106
107

ఆగస్టు/
సెప్టెంబర్
1980

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక
మాసపత్రిక

## ప్రేంచంద్‌కు కాలదోషం పట్టిందా?



నిర్వాహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా రు. 20
ఈ సంచిక రు. 2

ఈ సంచికలో—



ప్రేమ్ చంద్ ప్రత్యేకం



---


SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

---

Edited, Printed & Published by P Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam, J. P N. Road, Warangal.
Working Editor; Varavararao

పద్నాలుగు సంవత్సరాలుగా తన వ్యాసాలు, సమీక్షలు, లేఖల ద్వారా సృజన పాఠకుల ఆలోచనలనూ, చైతన్యాన్నీ పదునెక్కించి 'సాహిత్యంలో విప్లవోద్యమా'నికి దోహదంచేసిన మా సాహిత్య కుటుంబ సభ్యుడు కొడవటిగంటి కుటుంబరావు స్మృతికి మా విప్లవ జోహార్లు.

'సాహితీ మిత్రులు'



# ప్రేమ్‌చంద్

భారతీయ సాహిత్యాల్లో ప్రేమ్‌చంద్ పేరు తలచుకుంటే రష్యన్ సాహిత్యంలో మాక్సింగోర్కీ, చైనా సాహిత్యంలో లూసున్ మనసులో మసలుతారు. ఆయన వ్యక్తిత్వాన్నీ, సాహిత్యవ్యక్తిత్వాన్నీ ఆయనమాటల్లోనే అవగాహనకు తెచ్చుకుందాం.

వ్యక్తిత్వం :

"నా జీవితం సాధారణ సమతల మైదానం. అక్కడక్కడ గోతులున్నాయి కాని, తిన్నెలు, పర్వతాలు దట్టమైన అడవులు, లోతైనలోయలు, శిథిలాలూ ఎక్కడా లేని. గలవు పర్వత విహారాలపై అనురక్తిగల సజ్జనులకు ఇక్కడ నిరాశే ఎదురవుతుంది."

— ప్రేమ్‌చంద్

ఒకనాటి సంఘటన పెద్ద గాలివాన నిరంతరమైన కుంభవృష్టి. మధ్యమధ్య కొంపలు కూలుతున్నాయి. మేము నలుగురమూ రోజంతా ఇంట్లోఉన్నాము. ఇల్లు ఏ క్షణంలో కూలుతుందో అన్నట్లుంది. మరునాటికి వాన తగ్గుముఖం పట్టింది. ఆయన బడికి వెళ్ళారు.

హెడ్‌మాస్టర్ అన్నాడు "నిన్న మీరెందుకు రాలేదు?"

"అయ్యా! అవైపు వాన చాలా తీవ్రంగావుంది"

"అయితే ఉప్పురాయిలాగా కరిగిపోతానని భయమా?"

"ఉప్పురాయిని కానుగాని చుట్టుపక్కల కొంపలు కూలుతున్నాయి. నా ఇల్లు కూడ కూలుతుందేమో అనిపించింది"

"అయితే మీరుండి అది పడకుండా ఆపుతారా?"

"ఆపలేను గాని, వాళ్ళతోపాటు కలిసే చావగలనుగదా!"

—ప్రేమ్‌చంద్ భార్య శివరాణీదేవి (స్మృతులనుండి)

రాజకీయ దృక్పథం :

ఒకప్పుడు ఆయనభార్య శివరాణీదేవి అడిగింది. "స్వరాజ్యం వచ్చినాక దోపిడీ ఉండదంటారా?"

ప్రేమ్‌చంద్ సమాధానం చెప్పాడు "ప్రతిచోటా ఏదోకొంత దోపిడీ ఉండనే ఉంది బలవంతులు పేదల్ని పీడించడం జీవిత విధానమేమో అనిపిస్తుంది. కాని ఒక రష్యాదేశం ఉంది. అక్కడ పెద్దవాళ్ళ ఆధిక్యత కత్తిరించివేశారు. పేద వాళ్ళు ఇప్పుడు సంతోషంగా ఉంటున్నారు బహుశా రష్యాలాంటిదేదో మనకూ రావచ్చునుకుంటాను."

—శివరాణీదేవి స్మృతులనుంచి

"......నేను ఏపార్టీవాడ్నో అని మీరు అడుగుతున్నారు. (నేను ఏ పార్టీ వాడ్నికాను. ఎందుకంటే ఈరెండు పార్టీలలో ఏదీ ప్రయోజనకరమైన పనిచేయటం

లేదు). పేదలకు రాజకీయ విద్య గరపటం తమ కార్యక్రమంగా చేపట్టే భవిష్యత్ పార్టీయే నాపార్టీ......"

— మిత్రుడు నిగమ్‌కు 1923, ఫిబ్రవరి 17న రాసినలేఖ

"......ప్రజాభిప్రాయం నిర్మాణం చేయటమే మనలక్ష్యం ఇందుకోసమే సామాజిక వికాసంపై నమ్మకం పెట్టుకున్నాను. మంచి విధానాలు విఫలమైనప్పుడే విప్లవం వస్తుంది ప్రతివానికీ సమాన అవకాశాలు లభ్యంకావాలనేదే నా ఆదర్శం. వికాసక్రమం లేకుండా ఈ మెట్టుచేరుకునేది ఎలా? ఈ నిర్ణయం ప్రజల ఆచరణమీద ఆధారపడి వుంటుంది. వ్యక్తిగతంగా మనం ఉన్నతులంకాలేనంతవరకు ఏ సమాజ వ్యవస్థా ముందుకు పోలేదు; విప్లవ పరిణామం ఎలాఉంటుందో మనకు సందిగ్ధంగానే ఉంటుంది. అన్నితీరుల వ్యక్తి స్వాతంత్ర్యాన్ని లాగివేసి నియంతృత్వం మనముందు సాక్షాత్కరించవచ్చు. నేను బాగు చేయటాన్నే కోరతాను, నాశనం చెయ్యటాన్నికాదు అయినా ధ్వంసంవల్లనే మనకు స్వర్గం లభిస్తుందని నమ్మకం కుదిరినప్పుడు, నాకు తెలియవచ్చినప్పుడు నాకు ధ్వంసం గురించిన ఏ చింతా ఉండకూడదు..."

—డా. ఇంద్రనాథ్ మదాన్‌కు 1934, డిసెంబర్ 26న రాసినలేఖలో

మతం :

"......అన్నింటినీమించిన శక్తి ఏదో ఉన్నదని నేను ఇంతకు పూర్వం నమ్మేవాడ్ని. అది నా ఆలోచనాఫలితంవలనకాదు. కేవలం సంప్రదాయంలో నమ్మకంచేత. ఆ నమ్మకం ఈనాడు తుత్తునియలైంది..."

— ఇంద్రనాథ్ మదాన్‌కు రాసినలేఖలో

"కర్తవ్యక్షేత్రంలో హిందూ అనీ ముసల్మాన్ అనీ తేడాలేదు. ఇద్దరూ ఒకే పడవలో కూచుని ఉన్నారు. మునిగితే ఇద్దరూ మునుగుతారు; దక్కితే ఇద్దరూ దక్కుతారు".

— 'రంగభూమి' నుండి

రచయిత – సమాజం :

"సాహిత్యకారుడికి సమాజంలో స్థానంలేదంటూ మనలో తరచు ఒక అభియోగం వినవస్తుంటుంది. సభ్యదేశాల్లో ఐతే సాహిత్యకారుడు సమాజంలో గౌరవ స్థానం పొందుతున్నాడు. కాని భారతదేశం ఇంకా మధ్యయుగాల దశలోపడిఉంది. సాహిత్యం ధనికుల పంచల్లో యాచననే జీవికగా చేసుకుంటే, సమాజంలో జరుగుతున్న ఆందోళనలనుంచీ, విప్లవాలనుంచీ దూరంగా మడిగట్టుకు కూచుంటే తనచుట్టూ ఒక లోకం అల్లుకుని అందులోనే ఏడుస్తూ నవ్వుతూ కాలం గడుపుతుంటే ఈ లోకంలో అలాటి సాహిత్యానికి స్థానం లేకపోవటంలో ఏమాత్రం అన్యాయంలేదు"

— ప్రేమ్‌చంద్

రైతాంగం— చైతన్యం :

"లక్షల సంఖ్యలో రైతులు అక్షరాస్యులైనప్పటికీ ఎప్పటివరకైతే వారందరూ ఏకం కారో, ఎంతవరకైతే రైతు తనకు హక్కులున్నాయని గుర్తించడో ఏనాటి వరకైతే ఈ ముఠాలను ఎదురుకోలేడో అప్పటివరకూ అతని జీవితం సుఖవంతం కాలేదు. రైతుదగ్గర నాలుగుడబ్బులు కనిపిస్తేచాలు జమీందారును౦డి గుమాస్తాదాకా నోరూరడం మొదలు పెడుతుంది. ఏదో ఒక నెపంతో డబ్బుగుంజి రైతు నడుం ఖాళీచేసేస్తారు"

— "కలమ్ కా సిపాహీ"నుండి

న్యాయం - సంస్కృతి :

"న్యాయం ఎక్కడుంది? నిజంగా ఎక్కడ? ఒక పేదవాడు ఏదో చేనునుండి కొన్ని మొక్కజొన్నగింజలు ఒలుచుకొని తింటే అతణ్ని శిక్షిస్తారు కాని ఒక ధనవంతుడు పట్టపగలే ఇతరులను దోచుకుంటాడు; అతనికి పదవులూ సన్మానాలూ లభిస్తాయి... ఈ గొప్పోళ్ళ సంస్కృతిలో ప్రతిపనికీ లక్ష్యం కేవలం డబ్బే. ఈ దృష్ట్యా ఈనాడు ఇక్కడ గొప్పోళ్ళరాజ్యమే సాగుతున్నది".

— 'కలమ్ కాసిపాహీ'నుంచి

"డబ్బు సంపాదించడమే మానవుని లక్ష్యంకాదు; మానవత్వాన్ని ఉద్దీపించడం మనస్సులో ఉన్నతభావాలు రేకెత్తించడంకూడా అతని కర్తవ్యాలే. ఇవి లేకుంటే మనిషికీ పశువుకూ తేడాలేదు"

—'ప్రేమాశ్రమ్' నుంచి

"ధనవంతులు పుణ్యాలుచేస్తారు, దానాలు చేస్తాలు, దుఃఖార్తులపై దయకూడ చూపుతారు. దేశంలో పెద్దపెద్ద ధర్మశాలలు, ఎన్నెన్నో విద్యాలయాలు, వైద్యాలయాలు, చెరువులు, బావులు వాళ్ళ కీర్తి స్తంభాలుగా నిలబడి ఉంటాయి. వాళ్ళ విరాళాలతో నిత్యవ్రతాలు నడుస్తుంటాయి. అనాథల, వితంతువుల పోషణ జరుగుతుంటుంది. సాధువులకు, అతిథులకు సత్కారాలు జరుగుతాయి. ఎన్నో విశాల మందిరాలు తెరుస్తారు, విద్యాభివృద్ధి జరుగుతుంది. కాని వాళ్ళ అపకీర్తిముందు, వాళ్ళ సత్కీర్తి చీకటిరాత్రిలో మిణుగురు పురుగుయొక్క మెరుపులాంటిదే అనాలి. ఆవరించిన అంధకారాన్ని ఈ మెరుపు మరింత గాఢతరం చేస్తుంది. పాపకళంకం దానంతో, దయతో ప్రక్షాళనం అయ్యేదికాదు. లేదు, ధనికులు ఏనాడూ పవిత్ర భావాలతో ప్రేరితులు కాలేరు. ఇది నా అనుభవం"

—'సంగ్రామ్' నుంచి

# ప్రజల భాషా, ప్రజల సాహిత్యమూ

కొడవటిగంటి కుటుంబరావు

సమాజంలో కలిగే రాజకీయ మార్పులు సహజంగా సాంస్కృతిక రంగాలలో మార్పులను తెస్తాయి. ఒక్కొక్కప్పుడు ఇవి సాంఘిక ఆచార వ్యవహారాలలో కన్న కళారంగాలలోనే బాగా ప్రతిబింబిస్తాయి కూడా. ఇందుకు అంతులేని ఉదాహరణలు చూపవచ్చు. ఈనాటి రాజకీయ పురోగామి భావాలైన ప్రజాతంత్రమూ, జాతీయ విమోచనమూ, పౌరహక్కులూ, ప్రపంచశాంతీ మొదలైనవి వాస్తవ జీవితంలో కన్న సాహిత్యంలోనూ, ఇతర కళారూపాలలోనూ హెచ్చుగా కనబడుతున్నాయి. తమదాకా రాకుండా ఉంటే కట్నాల నిషేధాన్నీ, విడాకుల చట్టాన్నీ సిద్ధాంతరీత్యా ఆమోదించే వాళ్ళూ, కథలలోనూ, నాటకాలలోనూ చూసి హర్షించే వాళ్ళూ చాలా మంది ఉంటారు. అలాగే విప్లవభావాలు ఇతర దేశాలకు సంబంధించి సంతవరకూ గట్టిగా బలపరచబడతాయి. (కథలలో కూడా విప్లవభావాలను చూసి హిస్టీరియా తెచ్చుకునే బెదురుగొడ్లు లేరనికాదు )

ఇది రాజకీయ యుగమని నేను లోగడ ప్రతిపాదించాను. అది సరిఅయిన ప్రతిపాదనగానే కనబడుతుంది. ఒకప్పుడు మతమూ, ఫ్యూడల్ సంస్కృతీ నిర్వహించిన 'దుష్ట పాత్ర' ఈనాడు రాజకీయాలు వహిస్తున్నాయి. ఉదాహరణకు బ్రాహ్మణ మతంమీద (వైదిక మతంమీద కాదు) తిరుగుబాటు చేస్తూ వచ్చిన అనేక ఉద్యమాలు విఫలమయాయి. బ్రాహ్మణ మతానికి మూలాధారమైన కుల వ్యవస్థ చెక్కు చెదరలేదు. కాని ఉద్యమాల వెంట వచ్చిన గొప్ప సాహిత్యం ఆదరణ పొందింది. బ్రాహ్మణులను శాపనార్థాలు పెడుతూ శైవులు రాసిన గ్రంథాలను బ్రాహ్మణులు కూడా నెత్తిన బెట్టుకున్నారు- అయితే ఈనాడు మతపరంగా అభ్యుదయ రచనలు చేసి వాటిని ఉత్తమ సాహిత్యంగా ఆమోదింప జేయటం సాధ్యం కాదు. అందుకు నాకు తోచిన కారణం ఇది మత యుగం కాకపోవటమే. అదే విధంగా ఫ్యూడల్ సంస్కృతి తాలూకు శ్లేష రచనలూ, అలంకార ప్రధాన రచనలూ, మాటల గారడీలూ పెట్టి "వసు చరిత్ర", "రాఘవ పాండవీయం" లాంటి రచనలు అభ్యుదయకరరంగా రచించి ఉత్తమ సాహిత్యం అనిపించటం ఈనాడు సాధ్యంకాదు. కారణం, జీవితంలో అంతో ఇంతో ఫ్యూడల్ వాసనలున్నా, సాంస్కృతిక రంగం కొంచెం ముందు ఉండటం చేత మాటల చమత్కారం ఈనాడు నిరుపయోగమే. శ్రీశ్రీ రచనలలో కూడా మాటల గారడీకి సాంస్కృతిక రంగంలో చోటు ఉండే అవకాశం లేదు.

తేలేదేమంటే, జీవితంకన్న కళలు ఒక మెట్టు ముందుండి, భావికి సంకేతాలుగా ఉంటాయి; ఉండాలి! ఇది మన సమాజాల కనీసావసరం అని చెప్పవచ్చు ఎందుకంటే ఈ ఆచారం పాశవిక దశనుంచీ మానవులు అవలంబిస్తూనే వస్తున్నారు. వాన రాకముందే వాన నృత్యాలు జరిగేవి; వేటకు పోకముందే వేట నృత్యాలు చేసేవాళ్ళు- రావణుడు హోమం చేసిగాని యుద్ధానికి వెళ్ళేవాడు కాడుట; హోమం చెడగొట్టితే యుద్ధంలో వారికి జయం అనుమానాస్పదం! మనం ఈనాడు సామాజికంగా చేసే హోమం కళలలో భవిష్యత్తును ఆవాహన చెయ్యటం.

* * *

ఇది రాజకీయ యుగమని జ్ఞాపకం ఉంచుకుని, రాజకీయ భవిష్యత్తు ప్రజా సామాన్యమైనదని గుర్తించినాక ఇందు గురించి ఏ రంగుకు చెందిన రాజకీయవాదీ అభ్యంతరం చెప్పడు- కళలు ప్రజలకు సన్నిహితం కావాలనీ, ప్రజలపరంకావాలనీ స్పష్టమవుతుంది.

నిజానికి, ఏ కృష్ణదేవరాయల కాలంలోనో ప్రజాసాహిత్యం అన్నమాటకు అర్థం ఉండేదికాదు; ఉంటే జానపద సాహిత్యం అన్న అర్థం ఉండేది; అది సామాజిక పురోగమనానికి పనికి వచ్చే సాహిత్యం అయి ఉండేదికాదు- అట్టడుగు ప్రజల "ఎస్కేపిస్టు" సాహిత్యమే అయిఉండేది.

కాని ఈనాడు ప్రజా సాహిత్యం అన్నదే సాంస్కృతికంగా ఉత్తమ సాహిత్యం కావాలి. కాని అటువంటి సాహిత్యం రావటానికి గల అవాంతరాలు రాజకీయమైనవీ, మూఢమైనవీనూ.

ప్రజల సాహిత్యానికి ప్రాణం ప్రజల భాష. పాతకాలపు కవులు తమ రచనలను ప్రజల భాషలో చేసి ఉండటం ఎంత అసంభావ్యమో, ఈనాటి ప్రజా జీవితాన్ని సన్నయభట్టు భాషలో చిత్రించటం అంత అసంభవం. చిన్నయసూరి నాటిదాకా శిష్టుల వ్యావహారికభాషలో సాగుతూవచ్చిన సాహిత్య సృష్టికి, గ్రాంధిక భాషావాదం సైంధవుడల్లే అడ్డుపడి సాహిత్యతత్వాన్ని వెయ్యి సంవత్సరాలు వెనక్కునెట్ట జూచింది. ఈ సైంధవుడి అడ్డుతొలగించటానికి గిడుగు రామ్మూర్తి గారు విప్లవం చేసినంత పని చెయ్యాల్సి వచ్చింది!

రామ్మూర్తిగారు తమ ఉద్యమాన్ని ఇంకా సాగిస్తూండగానే రాజకీయ రంగంలో తుఫానులు తీవ్రంగా చెలరేగి, రష్యన్ విప్లవమూ, డిప్రెషనూ, రెండో ప్రపంచ యుద్ధంలాంటివి భీభత్సం కలిగించి, "శిష్టవ్యావహారిక భాష" అనే దానికి కాలదోషంపట్టించాడు.

సుప్రసిద్ధ సినీ ఆర్టు డైరెక్టరు మాధవపెద్దిగోఖలే మొట్టమొదటిగా తెలుగులో "అలగావాళ్ల" భాషలో, వాళ్ల జీవితానికి సంబంధించిన కథ 1941లో రాశాడు. దాన్ని నేను ఆంధ్ర వార పత్రికలో వేశాను. వెంటనే రెండు రకాల రియాక్షన్లు కనిపించాయి

ఆంధ్ర పత్రిక కార్యాలయంలో ఎక్కువ మందికి గోఖలే కథ సాహిత్యమనిపించలేదు. వాళ్లకు పట్టిచ్చినది అలగా భాష. అందులో కొందరు ఉదారులైన మిత్రులు, "వాళ్ల నోటి మాటలు వాళ్ల భాషలో ఉండవచ్చు కాని కథనం కూడా అదే భాషలో ఏమిటి?" అన్నారు. అంటే వాస్తవికత పాత్రోచిత భాష దాకా వస్తే వారికి అభ్యంతరం లేదు. కాని కథకుడే "అలగా వాళ్ల" ప్రతినిధి కావటం ఏమిటి? వాడు మధ్య తరగతిలోనే ఉండాలి!

రెండో రియాక్షన్ దీనికి పూర్తిగా వ్యతిరేకం! గోఖలే కథ వచ్చిన వారంలోనే నేను రాయిస్టు మిత్రుడు నరహరి అనే అతన్ని కలిశాను. "ఎంత అన్యాయం జరిగిందండీ! నేనురాయాలిసిన కథ మీ బ్రాహ్మణ అబ్బాయి రాసేశాడు! అది చదివిన రాత్రి నేను కన్ను మూయలేదు," అన్నాడు.

ప్రజల భాషలో కథ రావటంలో ఉండే ఔచితి ఆనాటి రాయిస్టుకు అందరికన్నా బాగా అర్థమయింది. ఇది గమనార్హం.

గోఖలే కథలోని విషయాన్ని గురించి ఎవరూ అభ్యంతరం చెప్పలేదు. కారణం అందులో రాజకీయ వాసన ఏమీలేదు- కాని అదే పద్ధతిలో గోఖలే దరిమిలా రాసిన కథలు అభ్యుదయోద్యమంలో ఇమడగలిగాయి.

కథనంలోకి కళాకారుడి కుంచెను ఆ 'అలగా' భాషలో అంత ప్రౌఢంగా వాడినవాడు గోఖలే తప్ప మరొకడు ఉన్నట్టు నాకు అనిపించలేదు.

* * *

ప్రజల భాషకు సంబంధించిన మరొక అంశం ప్రాంతీయత. గోఖలే కథలలో వాడిన భాష గోఖలే ఊరి వాళ్ళకే పట్టిచ్చిందంటే, ఇతర ప్రాంతాల వారికి ఎలా ఉండాలో ఊహించవచ్చు. సాహిత్యం జాతికంతకూ చెందిన దైనప్పుడు ప్రాంతీయ భాషలు వెలిబెట్టినట్టుగా ఉండటమూ, వేరు వేరు ప్రాంతాల వారు తమ ప్రాంతీయ నుడికారాలలో ఉండే మాధుర్యాన్ని తామే గుర్తించకపోవటమూ వల్ల సాహిత్యంలో అనేక ప్రాంతాల నివసించే జనసామాన్యపు భాషా, వారి జీవితాలకు సంబంధించిన ఉత్తమ రచనలూ ఇతర ప్రాంతాల వారికి అందవు. సాహిత్యాభి

లాషులూ, అభిమానులూ అని చెప్పుకునేవారు వెయ్యేళ్ళనాటి భాష అర్థం చేసుకోగలరు గాని, రెండొందల మైళ్ళ దూరంలో జనం నిత్యమూ వాడుకునే చైతన్యంగల జీవద్భాషను అర్థంచేసుకోలేని స్థితిలో ఉంటే ఏమనాలి? వాళ్ళు ఆ ప్రజల భాషలో వచ్చే ఉత్తమ రచనలను రాజకీయ కారణాలవల్లే సాహిత్యంగా గుర్తించకపోగా, దుమ్మెత్తిపోస్తే ఇంకా ఏమనాలి?

*　　　*　　　*　　　*

సాహిత్యరూపాలుగాని, ప్రమాణాలుగాని, ఆశయాలుగాని కాలానుగుణంగా మారుతూవచ్చినట్టే సాహిత్యానికి సంబంధించిన సమస్యలుకూడా మారుతూవస్తాయి. ప్రజల భాష, ప్రజల సాహిత్యం అనేది ఈ కాలపు సమస్య. తన భారత రచన జనావళికి మోదం చేకూర్చుతుందని తిక్కన సోమయాజిగారు అనుకున్నది ఆనాటికి నిజమేనేమో ఆనాటి జనావళికీ, ఈనాటి జనావళికీ చాలా తేడా ఉన్నది. ఈనాటి జనావళి రాజకీయ యుగంలో బతుకుతున్నది దీని సమస్యలకు పరిష్కారం భారతంలో దొరకదు. వర్తమాన సాహిత్యం ఈ జనావళికి అందుబాటులో లేదు- వాళ్ళు సాహిత్యం దగ్గరికి రారు- వచ్చినా లాభంలేదు వాళ్ళను చైతన్యవంతులను చేసేది వర్తమాన సాహిత్యంలో లేదు- కాళీపట్నం రామారావు, అల్లం రాజయ్యల వంటి వాళ్ళ కొన్ని రచనలు మినహాయిస్తే; అవి కూడా దురదృష్టవశాత్తూ రెండు భిన్నప్రాంతాల ప్రజల భాషా, జీవితాలూ కలవి!

అందుచేత సాహిత్యం, అంటే సంప్రదాయ సాహిత్యం. ఒకనాడు దేవళ్ళను నెట్టేసి రాజులనూ, రాజులను నెట్టేసి మధ్య తరగతినీ చేరినట్టే, ఈనాడు మిగిలిన వర్గాలన్నిటినీ నెట్టేసి ప్రజల దగ్గరికి వెళ్ళాలి. కనీసం సాహిత్యానికి సంబంధించినంత వరకైనా ప్రజలందరూ ఏకం కావాలంటే అన్ని ప్రాంతాల ప్రజల భాషా ఏకం కావాలి, కనీసం ప్రతి ప్రాంతీయ శబ్దజాలమూ, నుడికారమూ అన్ని ప్రాంతాల అందరికీ అర్థం కావాలి. అప్పుడే అభ్యుదయకర, పురోగామి సాహిత్యం అన్ని ప్రాంతాల అందరినీ చైతన్యవంతులను చేస్తుంది.

ఇది అన్నిటికన్నా రాజకీయమైన అవసరం. ఈ యుగధర్మం అటువంటిది. ఈ విధమైన సాహిత్య పరిణామాన్ని ప్రతిఘటిస్తున్నవారు కేవలమూ రాజకీయ దృష్టిగలవాళ్లేగాని, నిజమైన సాహిత్యాభిలాషులు కారు. ఈ విధంగా సాహిత్యానికి సంబంధించిన అతి ముఖ్యమైన వైరుధ్యం అచ్చగా రాజకీయ రంగంలో ఉన్నదనటం స్పష్టం. సాహిత్యం రాజకీయాలకు అతీతంగా ఉండాలని ఈనాడు ఎవరన్నా అంటే వాళ్లు మోసపుచ్చేవాళ్ళో, మోసపోయినవాళ్ళో కావాలి!

1-6-80

నవల - సీరియల్

చౌ లి-పో



రెండవ భాగం

(గత సంచిక తరువాయి)

11

మిన్‌షిన్ రైతులు వెళ్ళిపోయేక యువాన్‌మావో ప్రజలకి 'తాంగ్' ఇంట్లో మరికొన్ని వస్తువులు దొరికేయి. కొందరు కామందుల ఇళ్ళలోనే కాక గుర్రపు సాలల్లోను, కోళ్ళ గూళ్ళల్లోను, పందిళ్ళ కింద— ఇలా ఎవ్వరూ ఊహించలేని ప్రదేశాల్లో ధాన్యం, బట్టలు, కొన్ని వస్తువులు దొరికేయి. కొందరు కామందులు తమ రోజులు దగ్గరబడ్డాయని తెలిసినా జనాన్ని యింకా శత్రువుల్లానే చూస్తున్నారు. వాళ్ళకు ఎలాగూ దక్కని వస్తువులు, ధాన్యం జనానికి దక్కడం ఇష్టంలేక వాటిని నాశనం చేయడమో, కుళ్ళబెట్టడమో చేసేరు. వాళ్ళు ఇంతచేసినా పాతిపెట్టిన తుపాకులు, వస్తువులు దొరికిపోయేయి.

లీ చెన్-చియాంగ్ ఓ పెద్దరైతు. జనం అతన్ని 'బుగలగాడి తోక' అని పిలిచేవారు. ఆ ఏడాదంతా అతను తన నిజస్వరూపాన్ని దాచేందుకు చాలా శ్రమపడ్డాడు. పెరట్లో పందులను పెంచుతూ, ఇంట్లో కోళ్ళను పెంచుతూ రెక్కాడితేగాని డొక్కాడని మనిషిలా పని చేసేవాడు. కాని పిల్లల లీగ్ సభ్యులు కొందరు అసలు సంగతి పసిగట్టేరు. ప్రజాశత్రువు లీకీ-యంగ్‌కి వేగులవాడుగా వుండి, యిక్కడి కబుర్లన్నీ అతనికి చేరేసేవాడు.

లీ చెన్-చియాంగ్‌కి భూసంస్కరణ కార్యకర్తలంటే ఎప్పుడూ మంటే. అతని ఎనిమిది గుర్రాల్లోనూ ఆరు గుర్రాలు సంఘం తీసుకుంది. అందుకే కసి తీర్చుకునే అదనుకోసం పొంచి చూస్తున్నాడు. ఒకరిద్దరు మధ్యతరగతి రైతులకు అన్యాయం జరిగిందని విన్నాక మధ్యతరగతి రైతులందరు తనతో కలిసే అవకాశం కోసం చూస్తున్నాడు.

హూ తీన్-పెన్ అనే మధ్యతరగతి రైతుని పెద్దరైతుగా లెక్కేసి అతని దగ్గరున్న నాలుగు గుర్రాల్లోను రెండిటిని సంఘం తీసేసుకుంది. దాంతో ఊరంతా పుకార్లు అల్లుకుపోయేయి:

"సంవత్సరాది ముందు పందుల మాదిరే మధ్యతరగతి రైతుల గతీను. కొద్ది రోజులు అటూయిటూగా ఈళ్ల పనీ అయిపోతాది." ..."ముందు పెద్దపందుల్ని సంపి, ఆ ఎనక సిన్న పందుల్ని సంపాలన్నదే రూలు..." ఇలాగ జనం అంటుండేవారు.

ఈ మాటలు విన్న మధ్యతరగతి రైతులు రైతు సంఘం ఆఫీసుకెళ్ళి తమ ఆస్తులను కూడా జప్తు చేసుకోమని వేధించసాగేరు.

"నా సొమ్మంతా తీసుకోండి"—

"రేపు కాదు, ఇయాలే నా ఆస్తికి సీలెయ్యండి"—

"చూ బాబూ, నాకాడ ఓ కంబడున్నాది. దాన్ని జప్తు సేద్దునా?"

నాలుగు గుర్రాలున్న వాళ్ళు రెండు గుర్రాలివ్వాలని, రెండు దూడ పశువులుంటే ఒకటి సంఘాని కిచ్చెయ్యాలనే పుకార్లు. దానికితోడు పేదరైతులు, రైతు కూలీల మీటింగుకి మధ్యతరగతి రైతుల్ని పిలవకపోవడంతో మరీ అనుమానం బలపడింది. మధ్యతరగతి రైతుల భార్యలు వంటిళ్ళలో గుసగుస లాడుకునేవారు.

"బుగతలందరి పనీ అయిపోయేక యిక మనపనే"—

"అదీ దగ్గర్లోనే వున్నాది!"

కొందరు మధ్య రైతులు ఉన్నట్టుంటి మందకొడిగా తయారయేరు. పగలంతా నిద్రపోయేవారు. రాత్రుళ్ళు గుర్రాలకు మేత వేసేవారు కాదు. చివరికి అవి ఎముకల గూళ్ళలా తయారయి నిల్చోలేకపోయేవి.

కొందరు కామందులలాగే తమ పశువులు, చలికోట్లు, కాంగ్ దుప్పట్లు, చాపలు కూడా దాచేసేరు. చలికాలంలో చాపలు, దుప్పట్లు లేక రాత్రులు పిల్లలు చలికి ఏడ్చేవారు. వాళ్ళ పెళ్ళాలకి చలి మూలంగా 'ఫ్లూ' జ్వరాలొచ్చేయి.

కొన్నాళ్ళు యింట్లోనే వుండిపోయిన లీచెన్-చియాంగ్ భార్య యిప్పుడు పొరుగిళ్ళకు పోసాగింది. ఉప్పో సప్పో అప్పుకోసం మధ్యతరగతి రైతుల ఇళ్ళకు పోయి "అరె, ఇంత చలిలో మీకు దుప్పటైనా లేదా!" అని ఆశ్చర్యం నటించేది. దాంతో వాళ్ళు తమ కష్టాలకు తామే ఎంతో బాధపడిపోయేవారు.

మధ్యతరగతి రైతుల పరిస్థితి ఎలా వుందో రిపోర్టివ్వమని సాంచియా నుండి సియావో ఉత్తరం రాసేడు. మహిళా సంఘం, పిల్లల లీగ్ యిచ్చిన రిపోర్టులు తీసుకుని సాంచియా బయల్దేరేడు కువో. పార్టీ ఆక్టివిస్టుల మీటింగులో కువో రిపోర్టు విన్నాక యిక నుంచి మధ్యతరగతి రైతులను కూడా తమతో కలుపుకోవాలని చెప్పేడు సియావో. ప్రతి పల్లెలోను మధ్యతరగతి రైతుల అభిప్రాయాలను సేకరించి వాళ్ళకి పేదరైతులకు మధ్య అంతరం (వైరుధ్యం–అను) పెరగకుండా చూడమని చెప్పేశు.

యువాన్ మావో తిరిగొస్తూ కువో యిదే ఆలోచించేడు సంవత్సరాది దగ్గర పడుతోంది ఊరంతా యింకా ఉద్రేకపూరితంగానే వుంది. ఆక్టివిస్టులు కోడి కూసేవరకు లెక్కలు చూస్తూనే వున్నారు.

మధ్యతరగతి రైతు లియూతె-తెషాన్, పెద్దలీ సైన్యంలో స్ట్రెచర్లు మోస్తున్నాడు. లియూ భార్య నిజాయితీ అయిన మనిషి. మగాడితో సమానంగా కష్టపడగలదు. మహిళా సంఘంలో చేరింది కాని పుకార్లకు జడిసి వెనక్కి తగ్గింది. మధ్యతరగతి రైతు హుతీన్-వెన్‌ని పెద్దరైతుగా లెక్కేసేక ఆమెకి అనుమానం బలపడి రైతు సంఘం ఆఫీసుకి వెళ్ళడమే మానేసింది.

అప్పటి నుండి లీచెన్-చియాంగ్ భార్య లియూ భార్య యింటికొచ్చి ఛటీ లేస్తూండేది. కాంగుమీద సుఖంగా కూర్చుని పైపు కాలుస్తూ నిట్టూర్చి,

"అయ్యో, రేపటికి ఎవరేమేటవుతామో ఎవరికి తెల్సు?" అనేది.

"నాకు బయంనేదు. మా ఎజమాని సైన్యంలో వున్నాడు. మాం(వూ సంగం తరుపే" అంది లియూ భార్య తాపీగా.

"అయ్యో రాత, ఎంత అమాయకురాలివే నువ్వు! ఓరోజు నీ వంతూ వస్తుంది. రైతుసంగంలో పేరుగలవాల్లలో ఎవరైనా మధ్యతరగతిరైతులున్నారా?"

"ఊఁహూఁ, ఎవులూ నేరు."

లీచెన్-చియాంగ్ భార్య యింకా దగ్గరకు జరిగి,

"వాళ్ళ మీటింగుల్లో జరిగేదంతా రహస్యమన్న మాట కొంచెం సొమ్ము న్నోళ్ళందరినీ దూరంగా వుంచుతారు" అంది నెమ్మదిగా.

"నిజఁవే. మునుపు మమ్మల్ని మీటింగుకి పిలిచేవోరు- ఉప్పుడు మా వూసు ఎవరికీ పట్టనేదు" అని ఒప్పుకుంది లియూ భార్య.

"వాళ్ళ మీటింగుల్తో మనకి పనిలేదు గాని వాళ్ళ తిండికి దారి కర్చులకీ మాత్రం మనఁవే పెట్టుకోవాలేఁ?"

"నువ్ సెప్పిందీ నిజఁవే!"

లియూ భార్యని అకట్టుకో గలిగేననే ధీమాతో లీచెన్-చియాంగ్ భార్య కోతలు మొదలెట్టింది.

"ఇది విన్నావా? మన పక్కూళ్ళల్లో కొందరు మధ్యతరగతి రైతుల్ని జైల్లో పెట్టేరట!"

లియూ భార్య పుట్టిల్లు పక్క వూరే. వాళ్ళ పుట్టింటివాళ్ళు మధ్యతరగతి రైతులే. అందుకని ఆ మాట వినగానే హడిలిపోయింది. కానీ ఆలోచిస్తే యిది నిజఁవనిపించలేదు. ఆ క్రితంరోజే అక్కడి నుండి వాళ్ళన్న వచ్చి పోయేడు. అతనీవిషయఁవే చెప్పలేదు.

"ఎవుల్ని పెట్టేరు జైల్లో?" అనడిగింది.

"షీ తాకనట" అని తక్కున అబద్ధఁవాడింది లీచెన్-చియాంగ్ భార్య.

"మా వూళ్ళో 'షీ' కుటమానంనేదే!" అంది లీచెన్-చియాంగ్ భార్య ముఖంలోకి చూస్తూ. ఆమెకి పెళ్ళయి యిరవై ఏళ్ళవుతున్నా తను పుట్టిన వూరినే "మా వూరు" అనేది.

అబద్ధం బైటపడేసరికి లీచెన్ భార్య మాటమార్చి, "లేరా?, అయితే నేను పేరు మర్చిపోయి వుంటా. ఏఁవైనా యీ ప్రభుత్వం మనల్ని పట్టించుకోదు" అంది గట్టిగా.

లియూ భార్య నిజఁవే నన్నట్టు తలూపింది. ఈ ప్రభుత్వం మీద మరి నాలుగు నిందలు మోపి, పైపు నోట్లో పెట్టుకుని తిప్పుకుంటూ బయటకు నడిచింది లీచెన్-చియాంగ్ భార్య, లియూ భార్యని బుట్టలో పెట్టగలిగింది. లియూ భార్య దిగాలుపడింది. హుంతీన్-వెన్ కూడా తన భర్త లాగే మధ్యతరగతి రైతు; కాకపోతే తమకన్న మరో గుర్రం ఎక్కువుందతనికి, అంతే. లీచెన్ భార్య చెప్పింది నిజవేఁనేమో! ఈ దిగులుతోనే రాత్రి నిద్రపట్టలేదామెకి. మర్నాడుదయమే ఓ ఆడగుర్రాన్నీ, గుర్రప్పిల్లని సంఘం ఆఫీసుకి తీసుకెళ్ళింది- వాళ్ళు గుంజుకు పోయేకన్నా తనే ఇచ్చేస్తే నయఁవని. కాని,

"ఇప్పటికి నీకాడే వుంచు" అన్నాడు చు. దీనితో ఆవిడకి మరీ అనుమానం బలపడింది. మునుపు ఓ కామందు తన భూఁవిస్తానంటే సరిగ్గా యిదేమాటన్నారు,

అంటే తన గుర్రాలను మరో రోజు తీసుకుంటానన్నమాట! ఇంటికి పోతుంటే లీచెన్ భార్య చెప్పినమాట పదేపదే గుర్తొచ్చింది "రేపేమవుతుందో ఎవరికితెల్సు!"

అర్ధరాత్రి దాకా లియూ భార్య కాంగ్‌మీద అటూయిటూ దొర్లుతూనే వుంది. ఇంతలో ఎవరో తలుపుతట్టేరు. అర్ధరాత్రి ఎవరబ్బా? ఆడగొంతు వినిపించింది. ఓ కామందు ఇంటిమీదికి దాడి వెళ్ళినప్పుడిలాగే ఒకావిడని తలుపు తట్టమన్నారు. తలుపు చప్పుడు ఎక్కువవుతున్నకొద్దీ ఆవిడ గుండెదడ పెరిగింది. కాంగ్ దిగి కోటు తొడుక్కుంటూండగా,

"ఇంకా తలుపుతియ్యవేఁవఁమ్మా తల్లీ" అని వినిపించిన పిలుపుతో మార్దవం వుంది. చావో భార్య గొంతు గుర్తుబట్టి వెంటనే తలుపు తీసింది లియూ భార్య.

ఆవిడను చూడగానే లియూ భార్య మనసు తేలికపడింది. చావో భార్య నిజాయితీ గల మనిషి. అలాంటి మంచి మనిషితో మనసు విప్పి మాట్లాడాలనిపిస్తుంది. అందుకనే ఆప్యాయంగా ఆవిడ ఒంటిమీద మంచుదులిపి కాంగ్‌మీద కూర్చోబెట్టింది.

"మీ ఎజిమాని సైన్యంలో చేరి ఎన్నాళ్లయింది?" అని అడిగింది చావోభార్య.

పొగాకుతో పైపు నింపుతూ. యీ ప్రశ్నతో తేరుకుని "మూడు నెల్లవుతాది. మరో నెలకి సర్వీసైపోతాది కదా, ఒచ్చియాల మరి" అంది లియూ భార్య.

పైపు వెలిగించి చావో భార్య కందించింది.

"నాకొద్దు, నువ్ తీసుకో. అది సరేగాని లియూ కానా మంచి సర్వీసు సేసినాడు."

"కొమింటాంగ్ బందిపోట్లని తరిఁవేడం ఆడిడూటీ. అదే సెప్పుకోవాలా?"

లియూ భార్య కుట్టిన గుడ్డలు, అల్లికలు చూసి మురిసిపోయింది చావోభార్య.

"రైతు సంగం ఆపీసుకి రావడం లేదేఁవి? బుగతలపని పట్టడంతో యిసుగెత్తిపోనావేటి;" అని చనువుగా అడిగింది చావోభార్య.

లియూ భార్య పొగవదిలి నిట్టూరుస్తూ,

"ఆఁ. మాఁవు మధ్యతరగతోల్లం. మమ్మెవ్వరు కలుపుకుంతారు? ఇప్పుడంతా పేదరైతులు, కంబార్లు సూసుకుంతన్నారు కదా?" అంది.

"అదేటీ, ఎవరన్నారనాగ?"

'లీచెన్-చియాంగ్ భార్య చెప్పింద'ని నోటిదాకా వచ్చినా తమాయించుకుని.

"ఒక రనాలేటి? మాం 'మధ్యతరగతి రైతుల'మని మీరు రాసేసుకోగానే పనొగ్గేసినాం. పేదరైతులు, కంబార్ల మాటేగా వుప్పుడు సెల్లేది? మీరే అదికార్లు."

" 'అదికారుల'ని పాతపాటే పాడతన్నావ్" అంది చావోభార్య నవ్వుతూ.

"నువ్వెంతసెప్పినా మా పనేఁవీ బాగునేదు. ఏటిసేద్దామన్నా బయ్యంగున్నది. ఎప్పుడ్తో ఏటంతే ఏటవుతాదోనని బయ్యం."

"నీకు బయఁ ఎందుకు? మావోవో సిటన్నాడు 'మాటాడినోడిని ఏటీ అనకు' అని- ఎరికనేదా?" అని విడమర్చి చెప్పింది చావో భార్య.

లియూభార్య మళ్ళీ పైపులో పొగాకుదట్టించి, అది వెలిగించి, కళ్ళెత్తకుండానే

"వూరి ఎవారాలన్నీ మీరే సూసుకుంతన్నారుగదా? మయిలా సంగం కూడా మీరే నడుపుతున్నారు— ఇంక మాకేటున్నాది?" అంది.

"అదుగో మరి మాటాడితే మీరు, మాఁవు అంతావేటి? మనఁవంతా ఒకటి కాదా? పేదరైతులు, రైతుకూలీలు, మధ్యరైతులు అందరూ ఒకటే. ఇయాల సియావోబాబ కాడి నుంచి కబురొచ్చినాది— మధ్యరైతుల్ని కూడా కలుపుకుని అల్లకేణాదా నేకంటా సూసుకోమని. ఆ బాబుకి సైర్మన్ మావో ఉలిగాం* పంపినాడట."

"నిజఁవేనేటి?" అంది లియూ భార్య నోట్లోంచి పైపుతీస్తూ.

"నీకాడ అపికాలాడతానా?"

"నిజెంగా మధ్యరైతుల గురించి అలాగ సెప్పినాడా?" అని మళ్ళీ అడిగింది లియూ భార్య.

"సియావోబాబు అబద్ధఁవాడతాడంతావా? మావో సెప్పిన మాట హార్బిన్‌లో ఓ పేపర్లో కూడా పడినాది" అంది చావోభార్య ఆమెకు నమ్మకం కలగడానికి.

లియూ భార్య మనసు తేలికపడింది. కొంతసేపు పైపుకాల్చి, "నాకు తెల్సు సైర్మన్ మావో మమ్మల్ని ఒగ్గడని. మంచుకో పెబుత్వంలో మధ్యరైతులం శానా బాదలు పడినాం. పన్నులన్నీ మధ్యరైతుల మీదకీ పేదరైతుల మీదకీ తోసేసి

* 1947 డిసెంబరు 25న చైనీస్ క-పార్టీ సెంట్రల్ కమిటీ మీటింగులో "ఇప్పటి పరిస్థితి - మన భవిష్యత్ కార్యక్రమం" అన్న మావో రిపోర్టు సారాంశానికి సంబంధించి...

వాళ్ళు కామందులు. మా ఎజమానిక్కూడా కామందులంటే కోపమే. కాని పిరికోడు— పైకి సెప్పలేక పోయావోడు" అంది.

ఇద్దరూ చాలా సన్నిహితంగా మాట్లాడుకున్నారు. లియూ భార్య ఓ పెట్టె లోంచి పేలాలు, పొద్దుతిరుగుడు గింజలు తీసి బల్లమీద పెట్టింది. వేయించిన బియ్యంతో టీ పెట్టడానికి పొయ్యిమీద నీళ్ళు పెట్టింది.

"మల్ల మర్సిపోతానేటో, సియావోబాబు కబురెట్టినాడు— మధ్య రైతుల్ని తమ బాదలేటో పైకే సెప్పమన్నాడు— నోపల్నోపల నసుక్కుంటే నాబంసేదన్నాడు. ఒంటికి పేదరైతులు, కంబార్లు దుమ్మలైతే మధ్యరైతులు పై సెరమంట. సూసేవా, మనం యెంత దగ్గిరోల్లమో! నీ బాదలేటో అన్నీ దాసుకోకుండా సెప్పు" అంది చావో భార్య పొద్దుతిరుగుడు గింజ పప్పు ఒలుస్తూ.

"మాకేబాదా నేదు. ఈ మద్దెన ట్రాన్సుపోర్టు సర్వీసు మాత్రం కొద్దిగ లావైనాది. అందుకే గుర్రాలున్నోల్లందరికీ సర్వీసు పంచాల" అంది లియూభార్య నవ్వుతూ.

ఈ విషయాలన్నీ కువోకి చెప్తానని హామీయిచ్చింది చావోభార్య. కొంతసేపు మాట్లాడేక లియూభార్య కాంగ్‌దిగి "వుప్పుడే వత్తా" నంటూ పైకెళ్ళింది. బయట నేలంతా మంచుతో తెల్లగా వుంది. ఏమీ చడి చప్పుడులేదు. ఎవరూ లేరని తేల్చుకుని లోపలికొచ్చి లీచెన్-చియాంగ్ భార్య తనతో చెప్పిందంతా పూసగుచ్చినట్టు చెప్పింది. మరోసారిగాని లీచెన్ భార్య పుకార్లు ప్రచారం చేసేందుకొస్తే ఆఫీసులో రిపోర్టివ్వమని సలహా యిచ్చింది చావో భార్య.

"రేపు పేదరైతుల, కంబార్ల, మధ్యతరగతి రైతుల ఐక్యతకోసరం మీటింగెడుతున్నాడు కువో. ఉప్పుడున్న పేదరైతుల కంబార్ల లీగ్ ఎత్తేత్తుంటారు. మధ్యరైతులు కూడా రైతు సంగంలో సేరిపోవచ్చు. నువ్వు జరూరుగ రావాల. పందిమాంసం, గోదుములు కూడా ఎలా పంచాల్నో మీటింగులో తేలతాది. "సమస్య రాదివత్తుంటాది— అందరూ బూరెలొండుకోవాల, బుగతల పందిమాంసం, గోదుములు, కోల్లు పేదోల్లందరికీ పంచాల" అంటాడు కువోబాబు."

చావోభార్య వెళ్ళేందుకు లేచింది. లియూభార్య లాంతరు వెలిగించబోతే "లాంతరేల: మంచు మెరుత్తుంటాది కదా?" అని వారించింది.

బంగారమంటి మనసుగల చావో భార్యంటే లియూ భార్యకి చాలా ఇష్టం. ఆమెను గేటుదాకా సాగనంపింది. కనుమరుగయే వరకు చూసి లోపలికిపోయి తలుపేసుకుని కాంగ్‌మీద హాయిగా నిద్రపోయింది

(ఇంకా వున్నది)

సాహిత్య విమర్శ - ప్రసంగ వ్యాసం:
(విరసం 7వ మహాసభలు, తిరుపతి)

# ఇటీవలి విప్లవ విమర్శ

జ్యోతి

ఆధునిక తెలుగు సాహిత్యంలో ముఖ్యంగా అభ్యుదయ రచయితల సంఘం ఆరంభమైన తర్వాత కవులూ రచయితలూ కూడా విమర్శనాత్మక పద్ధతుల్లో సాహిత్య సృజన చెయ్యటం ఎక్కువ చేశారు. సాహిత్య విమర్శ కొత్త మలుపులు తిరిగి జన సిద్ధాంతమైన మార్క్సిస్టు పంథాలో ప్రయాణం చెయ్యటం ప్రారంభమైంది. సంప్రదాయవాదుల్లో ఈ సిద్ధాంత విమర్శ కలవరం లేవదీసింది.

తిరుగుబాటు సాహిత్యానికీ, విమర్శనాత్మక సాహిత్యానికీ తేడా వుంది. అయితే విమర్శనాత్మక సాహిత్యం తిరుగుబాటు సాహిత్యంపై సాధించే అభ్యుదయాంశంగా పేర్కొవాల్సి వుంటుంది.

విమర్శలో రెండు ధోరణులున్నాయి. అనుకూల విమర్శ, ప్రతికూల విమర్శ. అనుకూల విమర్శ 'రచన' లోని వాస్తవ లక్షణాల్ని విశ్లేషించి శాస్త్రీయ దృక్కోణంతో సామాజిక ప్రగతిని లక్షించేది. ప్రతికూల విమర్శ వివిధ రూపాల్లో వివిధ రకాలుగా రంగ ప్రవేశం చేస్తున్నా స్థూలంగా అశాస్త్రీయ మార్గంలో ప్రగతిని వెనక్కు నెడుతూ సమాజ భవితవ్యానికి అంధకారం ముసుగు తగిలించేది.

కవిత్వంగానీ, కథలుగానీ, నాటకాలుగానీ సామాజిక వాస్తవికతకు ప్రతిబింబాలే. అయితే కవీ, రచయిత యొక్క తాత్విక ప్రతిభ అతని రచనలో అతడు దర్శించే సిద్ధాంతాన్నిబట్టి వుంటుంది; అతని సామాజిక అవగాహనను బట్టి వుంటుంది. ఇంకా చెప్పాలంటే అతని జీవిత విధానాన్నిబట్టి, కూడా వుంటుంది. విమర్శకుని యొక్క ప్రతిభ మాత్రం అతని చారిత్రిక అవగాహననుబట్టి, సిద్ధాంతాల పరిజ్ఞానాన్ని బట్టీ, సామాజిక స్పృహ అవగాహనను బట్టీ వుంటుంది; వుండాలి కూడా. పాక్షిక దృష్టి, గుడ్డి ప్రేమ, మూఢనమ్మకాలూ, అపరిణత పాండిత్య ప్రతిభ, అతి వుత్సాహం విమర్శకుని యొక్క విమర్శలో చోటు చేసుకుంటే రచన యొక్క ప్రయోజనం వమ్ము అయిపోతుంది. ఆ విమర్శ ప్రయోజనశూన్యంగా తయారౌతుంది రచనలోని వాస్తవం వక్రీకరించ బడుతుంది.

నేడు తెలుగు సాహిత్య విమర్శనా రంగంలో సంప్రదాయవాదుల దగ్గర నుంచి, అతి, మిత అమితవాద యథా స్థితివాద విప్లవ విమర్శకుల దాకా వివిధ

పత్రికల్లో, వివిధ వేదికల మీద దర్శనమిస్తున్నారు. ఒకరు సాహిత్య విమర్శను కూడా జిల్లెళ్ళమూడి అమ్మపాదాలకు పరిమితం చేస్తూంటే, మరొక వర్గం అభ్యుదయం ముసుగు తగిలించుకొని పాలక వర్గాల మెప్పుకోసం కాకాల బాకాలతో రివిజనిజాన్ని భుజాన మోస్తూ సాహిత్య విమర్శ ప్రయోజనాన్నే 'సెటైర్'గా మారుస్తోంది. వేరొక వర్గం విమర్శకులు చెట్టు పేరు చెప్పకుండానే విత్తనాలమ్ముతామని ప్రకటించి మార్క్సిస్టు మూల సూత్రాలకే ఎసరు పెడ్తూ తమదే నిజమైన సాహిత్యమని బుకాయిస్తూ అవకాశవాదాన్ని చెలాయిస్తున్నది. వీళ్ల విప్లవ విమర్శ గతాన్ని మరచిపోయి వర్తమానంతో రాజీపడమని గతం బూచిని చూపి భవిష్యత్తు ద్వారాలు మూసేందుకు జరుపుతున్న ప్రయత్నం తప్ప వేరుకాదు.

విప్లవం కోసం ప్రాణాలర్పిస్తూ అందుకోసం పోరాడుతున్న విప్లవ వీరులనూ, విప్లవ సిద్ధాంతాల్ని అధ్యయనంచేస్తూ, దేశవాళీ ప్రజా పోరాటాల్ని విశ్లేషించుకుంటూ వర్తమాన సాహిత్యాన్ని వర్గరహిత సమాజం వేపు కొనిపోవడానికి శాస్త్రీయ పంథాను విశ్లేషించి, వివరిస్తూ కొనసాగుతున్న మరొక సాహితీ విమర్శనా ప్రక్రియను విరసం విమర్శకుల్లో కొందరైనా చేపట్టారు.

విప్లవ విమర్శ ప్రధానంగా విప్లవ సిద్ధాంతం మీదా, విప్లవోద్యమం మీదా ఆధారపడి వుంటుంది. విరసం ఆవిర్భవించిన తర్వాత సాహిత్య ప్రక్రియల్లో చాలా వరకు మార్పు తెచ్చింది. అయితే గతంలోని ఏ కొత్త ఉద్యమమైనా తెలుగు సాహిత్య చరిత్రకు సంబంధించినంత వరకు కవిత్వంలో తీసుకొచ్చిన మార్పులు ఇతర ప్రక్రియల్లో తీసుకురాలేదు. అభ్యుదయ సాహిత్యం కూడా ప్రధానంగా కవిత్వ రంగంలోనే అభ్యుదయాన్ని సాధించింది. కొన్ని నవలలు, కథలు కూడా అభ్యుదయ సాహిత్య ఉద్యమంలో వచ్చినమాట వాస్తవమే గాని కవిత్వంలోవున్న ప్రబల శక్తిగా అభ్యుదయ ధోరణి కథ, నవల వంటి ప్రక్రియల్లో రాలేదు. అభ్యుదయ కవిత్వం సంప్రదాయ కవిత్వం మీద, భావ కవిత్వం మీద తిరుగుబాటుచేసి ప్రగతిశీల ఉద్యమంగా రూపొందింది. అయితే విమర్శ దగ్గరకు వచ్చేటప్పటికి ముఖ్యంగా అభ్యుదయ వ్యతిరేకుల విమర్శలకు సమాధానం చెప్పడానికి అభ్యుదయ రచయితలు విమర్శలో ఎక్కువగా సంప్రదాయక ప్రమాణాల్ని ప్రతిబింబించారు. వాస్తవికత, వర్గదృష్టి కొంతమంది అభ్యుదయ రచయితలలో వున్నప్పటికీ, సాహిత్య విమర్శలో అభ్యుదయ విమర్శ అంటూ లేదు. కొంతమంది అభ్యుదయ వాదులు రస, ధ్వని సిద్ధాంతాల్ని కూడా తమది కవిత్వమని నిరూపించుకోవడానికి ప్రమా

ణాలుగా స్వీకరించారు. ఇంకా కొంతమంది అనుభూతి, ఆవేశం ప్రమాణాలుగా విమర్శలు చేశారు. మొత్తంమీద నాడూ నేడూ కూడా అభ్యుదయ రచయితలు సాహిత్య విమర్శలో శాస్త్రీయమైన పంథాను ప్రవేశపెట్టడంలో విఫలమయ్యారు "విమర్శనాత్మక వాస్తవికత" అని అభ్యుదయ విమర్శకులు ఈనాటికీ వాదనలో బలంగా చెబుతున్నారు గాని దానికి స్పష్టమైన అర్థాన్ని నిర్దేశించలేకపోతున్నారు.

అర్ధ శతాబ్దానికి పూర్వం పెట్టుబడిదారీ దేశాల్లోని రచయితలు తమ రచనల్లో అక్కడక్కడా పెట్టుబడిదారీ సమాజంలోని దోపిడినీ, అన్యాయాన్నీ ఖండించిన ధోరణిని విమర్శనాత్మక వాస్తవికతగా పేర్కొంటున్నారు. అసలు వాస్తవికత అనే మాటే గందరగోళానికి దారితీసేది. దానికి అభ్యుదయవాదులూ అభ్యుదయ వ్యతిరేకులూ కూడా అనేక రకాల వివరణలిచ్చారు; నిర్వచనాలు చేశారు. లోతుగా పరిశీలిస్తే అభ్యుదయ సాహిత్య ప్రత్యేకతని నిరూపించటంలో అభ్యుదయ విమర్శకులు విఫలం కావడానికి ఈ అస్పష్టమైన విమర్శనాత్మక వాస్తవికత అనే ప్రమాణాన్ని పట్టుకొని వేలాడటమే కారణంగా తోస్తోంది. విమర్శనాత్మక వాస్తవికత నిజానికి విమర్శనాత్మక భావవాదమే (critical idealism). అంటే అభ్యుదయ వాదుల మొత్తం విమర్శకు ప్రమాణమైన విమర్శనాత్మక వాస్తవికత భావవాదధోరణి. ఈ కారణం వల్లనే అభ్యుదయ సాహిత్య ఉద్యమం శాస్త్రీయ విమర్శనా ప్రమాణాల్ని రూపొందించడంలో వైఫల్యం పొందింది.

విప్లవ సాహిత్య ఉద్యమం యితర ఉద్యమాలతో పోలిస్తే ప్రధానంగా విజయవంతమైంది కవిత్వంలో, సాహిత్య విమర్శలోనే. సాహిత్య విమర్శలో గుణాత్మకమైన మార్పుని విప్లవ విమర్శకులు సాధించారు, విప్లవ సాహిత్యానికి అత్యవసరమైన విప్లవ విమర్శ రూపొందింది. విప్లవ వ్యతిరేకులకు బలమైన సమాధానాలు చెబుతూ సాహిత్య రంగంలో విప్లవ సాహిత్యానికి శాస్త్రీయమైన పునాదిని విప్లవ విమర్శ వేసింది. విమర్శ, విప్లవం గతితార్కిక భౌతికవాదం రెండు ముఖాలు. విప్లవం కోసం విమర్శ అంటే ఆచరణాత్మకంగా జీవితంలో సాహిత్యం పాత్రని స్పష్టంగా నిర్వచించటం. ఉన్న సాహిత్యధోరణుల్లోనే ప్రజా వ్యతిరేక అంశాలను సైద్ధాంతికంగా విశ్లేషిస్తూ, ప్రజా వ్యతిరేక సాహిత్యాన్ని విశ్లేషించటం- విప్లవ సాహిత్యాన్ని నిర్మించటం విప్లవ సాహిత్య విమర్శ సాధించిన విజయం.

విమర్శ సాహిత్య వర్గ పోరాట సాధనం 'నిర్మూలనం-నిర్మాణం' అనే పదునైన రెండు అంచులు గల కత్తి. ఒక విమర్శకుని విమర్శనల్ని విమర్శిస్తున్నా

మంటే ఆ విమర్శకు మూలమైన సామాజిక శక్తుల్ని విమర్శిస్తున్నామని అర్థం. వర్గ సమాజంలో విప్లవ విమర్శకుడు విమర్శించే వాస్తవికత, విప్లవ విమర్శకుని ఖండనకు గురయ్యే విమర్శకుని వాస్తవికత రెండూ వుంటాయి.

విప్లవ విమర్శకు దృఢమైన పునాది మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనావిధానం. అంటే సిద్ధాంతం, ఆచరణ ఐక్యమైన గతితార్కిక భౌతికవాద జ్ఞాన సిద్ధాంతం, ఇంతకు పూర్వం మార్క్సిస్టు విమర్శకులు కూడా సాహిత్యాన్ని స్వతంత్ర ప్రతిపత్తి గల రంగంగా భావించారు, ఆర్థిక పునాదిలోగానీ, ఉపరితలంలో గానీ మిగిలిన విజ్ఞాన శాఖలతోగానీ సాహిత్యానికి వున్న గతితార్కిక సంబంధాన్ని పూర్తిగా విస్మరించారు. అందుకనే "మీ సాహిత్యంలో రాజకీయాలెక్కువ వుంటా" యనీ, మీ సాహిత్యంలో కళా ప్రమాణాలు లేవనీ పండితులు విమర్శిస్తుంటే అభ్యుదయ విమర్శకులు అనేక మంది తెల్లమొఖాలు వేశారు. విప్లవ విమర్శ పండితుల వాదనల నడ్డి విరగ్గొట్టింది. గతితార్కిక చారిత్రిక భౌతికవాదాన్ని సాహిత్యానికి సృజనాత్మకంగా అన్వయిస్తూ విప్లవ విమర్శ సాహిత్యం పుట్టుక, సాహిత్య ప్రయోజనం, సాహిత్యంలోవుండే వర్గదృష్టి సాహిత్యానికి ఇతర ఉపరితల అంశాలతోనూ పునాదితోనూ వుండే అన్యోన్య సంబంధాన్ని శాస్త్రీయంగా ప్రతిపాదించి, విమర్శలో గుణాత్మక మార్పును తీసుకువచ్చింది. ప్రతిభ, రసం, అనుభూతి, శైలి, ఆనందం, వస్తు శిల్పాలు మొదలైన ఫ్యూడల్ బూర్జువా సాహిత్య పరిభాషకి వాస్తవ సామాజిక పునాదిని విశ్లేషించి వాటి మీద సాహిత్య రూపంలో వున్న భ్రమల్ని తొలగించింది. అలాగే ఆధునికమైన మనస్తత్వ శాస్త్ర సాహిత్య విమర్శలో కూడా భావవాద ధోరణుల్ని విప్లవ విమర్శకులు ముఖ్యంగా త్రిపురనేని మధుసూదనరావు గారు శాస్త్రీయంగా బహిర్గతం చేశారు. మనిషి నాడీ మండలం దాని ఉన్నత రూపమైన మెదడు ఇతర వ్యక్తులతో అన్యోన్య సంబంధాన్నుంచి ఎలా పని చేస్తుందో కవిత్వ సృజన క్రమం మానవ శారీరక, సామాజిక ప్రమాణాలకు అందు తుందని, వివరణకు అతీతమైన విషయాల ప్రమేయం సాహిత్య సృజనలో లేదని మనస్తత్వశాస్త్ర, శరీర ధర్మశాస్త్ర (ఫిజియాలజీ)ల సహకారంతో సాహిత్య సృజనలోని పదార్థ స్వభావాన్ని నిరూపించింది విప్లవ విమర్శ.

కవి లేదా రచయిత, సమాజం - చరిత్ర మొదలయిన వాటిని గతితార్కిక భౌతిక వాదంతోనూ, దానికి పునాదియైన విజ్ఞాన శాస్త్రాలతోనూ వివరించటంతో సంప్రదాయక విమర్శ దెబ్బ కాచుకునే స్థితిలో పడింది. సాహిత్య ప్రయోజనం

విషయంలో విప్లవ విమర్శ నిబద్ధతా సిద్ధాంతాన్ని సాహిత్యరంగంలో ప్రవేశపెట్టింది. ఏ ఆశయానికైనా స్థిరంగా కట్టుబడి వుండటం నిబద్ధత కాదు. పాలకివర్గ భావజాలానికి కట్టుబడి వుండడం బానిసత్వమౌతుంది గాని నిబద్ధత కాదు. ప్రజా పోరాటాలకు దోహదం చేసే భావజాలానికి కట్టుబడివుండటమే నిబద్ధత. ప్రజా పోరాటాలు ఉధృత రూపంలో వున్నప్పుడు అతిసహజంగా కవుల, రచయితల కలాల నుండి నూతన ఉత్సాహంతో కొత్త కవితలు, కథలూ నాటకాలూ యితర అనేక ప్రక్రియలు చోటుచేసుకుంటాయి. కొత్త కవులు గళాలు విప్పుతారు. ఇలాంటి రచనల్ని పార్టీ రచనలనీ యింకా ఏవేవో ముద్దు పేర్లు పెట్టి ప్రగతి నిరోధకులు కలాల, గళాల్ని నొక్కి వెయ్యటానికి శివమెత్తి చిందులేస్తారు. విప్లవ విమర్శకులు అతి జాగ్రత్తతో విరోధుల్ని ఆటకట్టించటం నిబద్ధత అవుతుంది. అంతేగాని కేవలం సాహిత్యానికి మాత్రమే నిబద్ధం గావటం నిబద్ధతకాదు. ఇది అస్తిత్వవాద నిబద్ధత.

సాహిత్యం స్వతంత్రంగా ఏ పాత్రనూ నిర్వహించలేదు సాహిత్య ప్రయోజనం సాంఘికమైంది. అది నిర్వహించే పాత్ర సంఘంలోనే వర్గ సమాజంలో మానవ జాతి విముక్తికి విప్లవిస్తున్న ప్రజల పోరాటాల్ని సాహిత్యంలో చిత్రించటం నిబద్ధత. పోరాటాలకు అద్దం పట్టడం గానీ, వాస్తవ పోరాటాలతో అన్వయం లేకుండా విప్లవ సిద్ధాంతాన్ని చిత్రించటంగానీ నిబద్ధత కాదు. విప్లవ సిద్ధాంతం వెలుగులో ప్రజల పోరాటాలను చరిత్రను మార్చే పోరాటాలుగా ప్రజలను చైతన్యవంతం చెయ్యడం నిబద్ధత. దీన్నే మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానానికి నిబద్ధత అంటారు. ఈ విధంగా విప్లవ విమర్శ విప్లవ సాహిత్య ఉద్యమానికి సక్రమమైన భాష్యం చెప్పడమేగాక విప్లవ సాహిత్యానికి పథనిర్దేశం చెయ్యడమేగాక విప్లవ వ్యతిరేక విమర్శకులతో శాస్త్రీయమైన పోరాటం చెయ్యగలిగింది. ఫ్యూడల్ బూర్జువా సాహిత్యం సమాజంలోని ఫ్యూడల్ బూర్జువా వర్గ ప్రయోజనాల్ని ప్రతిబింబిస్తుంది. అందుకని ఈ సాహిత్యానికి మూలం తప్పుడు చైతన్యం. తప్పుడు చైతన్యం అంటే సమాజాన్ని తల్లక్రిందులుగా చూడటం. ఉదాహరణకు కవిత్వానికి సామాజిక జీవితం ప్రేరణ శక్తి అయితే కవి హృదయమే మూలమని చెప్పడం. దోపిడీ వర్గ అవసరాలకు పునాది శ్రమ జీవుల చెమట అయినప్పుడు దోపిడీ వర్గాలను శ్రమ జీవులకంటే పున్నతమైన వ్యక్తులుగా చిత్రించటం. ఈ తప్పుడు చైతన్యాన్ని సూత్రబద్ధంగా విశ్లేషిస్తూ విప్లవ విమర్శ వాస్తవ చైతన్యాన్ని రచయితలకు కలిగించటంలో దోహదం చేసింది.

# ఇన్ క్రెడిబుల్ గాడెస్ నవల - ఒక పరిశీలన

సంగ్రామ్

డాక్టరు కేశవ రెడ్డిగారు "క్షుద్రదేవత" నవలకు దళితుల దాస్య ప్రవృత్తిని కథావస్తువుగా స్వీకరించి చిత్తూరు జిల్లా వ్యవహారిక భాషలో ప్రతిబింబించారు.

భారతదేశంలో కనీసము రెండు వేల సంవత్సరాలుగా, అమానుషంగా, పరమ నీచంగా పీడనకు, దోపిడీకి గురవుతున్న వర్గం పంచములనే మాలమాదిగలు. వీరు దేశ జనాభాలో దాదాపు 15 శాతము వరకు వుంటారు. అత్యధికులు గ్రామాల్లోనే వసిస్తున్నారు. పేదరికం వీరి సొత్తు. మన గ్రామీణ వ్యవస్థలో వీరికోసం ప్రత్యేకంగా నిన్నమొన్నటి వరకు కొన్ని ప్రత్యేకమైన పనులు కేటాయించబడివుండేది. ప్రస్తుతము దేశములో సాదుకొనివున్న వ్యవస్థలో వీరిలో ఎక్కువ భాగం గ్రామాల్లోని భూస్వాముల, ధనిక రైతుల భూములలో కూలీలుగా, పాలేళ్ళుగా పని చేస్తున్నారు. వీరంతా ఇప్పటి వరకు ఈ దేశంలోని అగ్రవర్ణాలుగా వున్నవారిచేత సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా దోచబడుతున్నారు. ఈ దోపిడీకి, పీడనకూ వ్యతిరేకంగా దళితుల్లోని కొంతమంది అప్పుడప్పుడూ తమ అసంతృప్తిని, తిరుగుబాటును వ్యక్తం చేయుటం జరిగింది. కాని రాజకీయాధికారం ఈ దేశంలోని అగ్ర

---

అయితే కొందరు తప్పుడు చైతన్యాన్ని ఎదుర్కొంటున్న విప్లవ విమర్శ స్వభావం తెలీకుండా విప్లవ విమర్శలో ప్రతికూల అంశం ఎక్కువగా వుంటోందని భ్రమపడుతున్నారు. అసలు వర్గసమాజమే ప్రతికూల సమాజం. ఆ వర్గసమాజ సాహిత్యాన్ని విమర్శించటం అనుకూల విమర్శ. శాస్త్రీయమైన కారణం ప్రదర్శించకుండా, సామాజిక పదార్థ మూలాధారం ఎత్తిచూపకుండా ఆడంబర పదజాలంతో శాస్త్రాంశలేని శాస్త్రీయ పరిభాషతో విమర్శించటం విప్లవ విమర్శ కాదు- విప్లవ విమర్శ పేరుతోవున్న బూర్జువా విమర్శ మాత్రమే. వర్గసాహిత్యాన్ని పరిశీలించేటప్పుడు తమకు అన్యాక్రాంతంగా సంక్రమించిన పరిచయాల్నిగానీ, ప్రలోభపెట్టే పనికిరాని స్నేహంగాని తమమీద ప్రభావం చేస్తున్నప్పుడు పాలకవర్గాలకు మాత్రమే పనికివచ్చే సాహిత్యంలో ఉన్నత కళాప్రమాణాలున్నట్లుగా భ్రమపడి అంగీకరించడం, అభినందించటం, తప్పుడు చైతన్యాన్ని చైతన్యంగా చిత్రించటమే. ఇది అనుకూల విమర్శగా కనబడే నిజమైన ప్రతికూల విమర్శ. కాబట్టి అనుకూల ప్రతికూల ధోరణుల్ని పూర్తిగా కార్మికవర్గ పోరాటదృక్పథం నుంచే నిర్ణయించాలి. విప్లవ విమర్శ ధ్యేయం విమర్శ కాదు- విప్లవం.

వర్ణాలవారి చేతిలో వుంటూ ఈ తిరుగుబాటు ధోరణులను, అందుకు కారకులైనవారిని అనేక ఘోరమైన చిత్రహింసల పాలుచేసి అణచివేసిన సంఘటనలు మన సామాజిక చరిత్రను తెరిచిచూస్తే మనకు గోచరమవుతాయి.

హిందూ రాజుల పాలనలోగాని, మహమ్మదీయ రాజుల పాలనలోగాని వీరి జీవితాల్లో చెప్పుకోదగ్గ మార్పేమీ రాలేదు. ఇంగ్లీషువారి పాలనలో అధిక సంఖ్యాకులుగా వున్న దళితుల్ని తమవైపు ఆకర్షించుకోవటం కోసం బ్రిటిష్ సామ్రాజ్యవాదులు వీరిని తమ క్రైస్తవ మతంలో చేర్చుకొని విద్యగరిపి, ఆర్థిక సహాయం చేసారు. కాని సామ్రాజ్యవాదులు ఈ దేశంలోని రాజ్యాధికారాన్ని ప్రత్యక్షంగా వదులుకోవలసి వచ్చినపుడు తప్పనిసరిగా ఈ దేశంలోని దోపిడీ అగ్రవర్ణాలకే అధికారాన్ని దఖలుపరిచారు.

జాతీయోద్యమ కాలంలోను, ఆ తరువాతను కొంతమంది సంస్కరణవాదులూ అభ్యుదయవాదులూ వీరి అభ్యున్నతికి పాటుపడటం జరిగింది. వారుకూడా తమ ఉనికికి చలనం లేనంతవరకు చేసారనే విషయం సత్యం. ప్రస్తుత దశలో వీరి సాంఘిక జీవితంలో కొంత వెసలుబాటు కలిగినా అదీ నామ మాత్రమే అయ్యింది. "అంటరానితనం నేరం" అనే చట్టం అమలులోవున్నా ఇప్పటికీ అనేక గ్రామీణ ప్రాంతాలలో భయంకరంగా ఈ జాడ్యమున్న విషయం మనందరకు తెలిసిందే. చట్టం చేసిన ప్రభుత్వమే ఇదొక భయంకర జాడ్యంగా ఈ మధ్యనే గుర్తించిన చందంగా "అంటరాని తనము నేరము" అనే నినాదాలను ప్రచారం చెయ్యటం మన 'జాతీయ' బస్సులపై చూస్తున్నాం.

దేశంలో పెరుగుతున్న యంత్ర పరిశ్రమల వలన పట్టణ కార్మిక వర్గంలోని దళితుల్లో కొంత చైతన్యం పెరిగినా, గ్రామాలలోని ఈ వర్గంలో చైతన్యంపాలు తక్కువే. బూటకపు ఎన్నికలు, సోషలిజం కబుర్లు, గరీబీహటావో నినాదాలు, రాజభరణాల రద్దు, బ్యాంకుల జాతీయం, మిగులు భూమి పంపకం, ఇళ్ళ స్థలాల పంపకం, హరిజన గిరిజన అభ్యుదయ పథకాలు, దినాదినాభి వృద్ధి చెందుతున్న క్రిష్టియన్ మిషనరీలు, దళితుల్లో దినదినం ప్రజ్వరిల్లుతున్న చైతన్యాన్ని ప్రక్కదోవ పట్టిస్తూ పాలక వర్గాల దోపిడీ ప్రయోజనాలను కాపాడుతున్నాయి

ఈ దేశంలోని 'వామపక్షాలు' వర్గపోరాటానికి తిలోదకాలిచ్చి, వర్గసామరస్యాన్ని బోధిస్తూ దోపిడీ పాలక వర్గాల బూటకపు ఎన్నికల రొంపిలో కూరుక

పోయి, దోపిడీ వర్గాలకు తోకలుగా తయారయి వర్గ పోరాటంలో ప్రధాన పాత్ర వహించవలసిన ఈ దళిత వర్గాల్ని చైతన్య పరచటంలో విఫలమైపోయాయి.

ఇటువంటి క్లిష్టదశలో నగ్జల్‌బరీలో భూమికోసం, భుక్తికోసం, ఈ దోపిడీ వర్గాలపై మొట్టమొదటిగా పీడిత ప్రజలు పోరాటాన్ని ప్రారంభించారు- ఆ సాంప్రదాయ చైతన్యంతో దేశ వ్యాపితంగా పీడిత ప్రజలు తమ విముక్తి బాటను ఎంచుకున్నారు- ఆ పీడిత ప్రజల్లో దళితులు ప్రధాన పాత్ర వహిస్తున్న విషయం గమనార్హం.

ఈ పది సంవత్సరాల కాలంలో దేశవ్యాపితంగా ప్రత్యేకంగా దళితులపై జరిగిన దారుణ హింసాకాండ, మానభంగాలు, గృహ దహనాలు దళితుల పోరాట చైతన్యాన్ని అణచాలనేయత్నంలోని భాగాలే- ఆంధ్రదేశంలోని చిన ఓగిరాల, కరవులాపల్లి, కంచికచర్ల, మోదుకూరు, పెరవలి, ఈమని మొదలగు అనేక గ్రామాల్లో దళితులపై జరిగిన దారుణ మారణ హోమానికి, దోపిడీ అగ్ర వర్ణాల దురహంకారానికి ఛాయా మాత్రపు ఉదాహరణలు మాత్రమే- ఇలా దేశ వ్యాపితంగా దళితుల్లో రెక్కలు విప్పుకుంటున్న చైతన్యాన్ని పాలకవర్గాలు, భూస్వాములు, హింసచే అణచాలనుకుంటున్నారు.

కాని ఈనాడు వారు ఒంటరిగా లేరు. ప్రపంచ వ్యాపితంగా దేశాలు స్వాతంత్ర్యాన్ని, జాతులు విముక్తిని, ప్రజలు విప్లవాన్ని కోరుకుంటున్న చరిత్ర గమనంలో ప్రపంచ పీడితప్రజ పోరాటపంథాలో తమ ఉనికిని దిద్దుకొంటున్నది. అందులో భాగంగానే భారత దేశంలోని పీడిత ప్రజానీకం అందులోని ప్రధాన పక్షమైన దళితులు చైతన్యంతో తమ విముక్తికై గ్రామీణ ప్రాంతాల్లో కూడా ఉప్పెనలా ముందుకు వస్తున్నారు- భూస్వాములు, దోపిడి పాలకులు వణికిపోతున్నారు- ఈ పరిస్థితికి అనుగుణంగా దేశ వ్యాపితంగా ప్రజా కళలు, సాహిత్యము పీడిత ప్రజా పోరాటాలను ప్రతిబింబిస్తూ అభివృద్ధి చెందుతున్నాయి- ఇదీ నేటి భారతం.

ఈ నేపథ్యంలో హరిజనుల దాస్య ప్రవృత్తిని కథాంశంగా తీసుకొని వెలువడిన నవల ఇది. సూక్ష్మంగా కథాంశాన్ని పరిశీలిద్దాం.

గంగపట్నం హరిజన వాడలోని ఓ వ్యవసాయ కూలి "రామచంద్రుడు" గ్రామ పెద్దరెడ్డి గారి పొలములో రెండు సంవత్సరాలు రెక్కలు ముక్కలు చేసుకొని కొంప కట్టుకోటానికి కాస్తంత పోరంబోకు జాగాను పొంది ఇల్లు కట్టుకొని వుంటూ వుంటాడు- ఓ కేసులో పెద్దరెడ్డిగారి తరఫున దొంగ సాక్ష్యము చెప్ప

నందుకు రామచంద్రునిపై కంటుపెట్టుకున్న పెద్దరెడ్డిగారు పై అధికారులకు తెలియ పరచి ఇల్లు ఖాళీచేయమనే తాఖీదు పంపుతాడు- పెద్దరెడ్డిగారు కంటుతో ఇంత పని చేయటం న్యాయంకాదని అర్థించటానికి వెళ్ళిన రామచంద్రుడ్ని కదలించి కజ్జాకు దించి అప్పట పనిలో నిమగ్నమై వున్న దాదాపు ఇరువది మంది మాలలు రామ చంద్రుని స్పృహ లేకుండా కొట్టి పంపిస్తారు. మరుసటి దినము అధికారులు, పోలీ సుల సమక్షంతో పెద్దరెడ్డిగారి పనిలోని మాలలు రామచంద్రుని ఇంటిని కూలుస్తారు, రామచంద్రుడు పెండ్లాం "నాగ" కొడుకు "కృష్ణుడు"తో మిగిలిన ఆస్తి అయిన ఇరువది పందులను తోలుకొని దూరంగా ఏదైనా గ్రామం పోయి బతకాలని ప్రయా ణమై పోతూవుంటాడు. దారిలో ఓ లారీ డ్రైవర్ నీళ్ళు పోసుకోవటానికై వీళ్ళ విశ్రాంతి తీసుకుంటున్న దాపులో ఆగి వీళ్ళ పరిస్థితికి జాలిపడి రామచంద్రుని కుటుం బాన్ని పందులను లారీలో ఎక్కించుకొని ఓ రెండు వందల మైళ్ళ దూరంలోని ఓ బాటలో దించుతాడు. దాపులోనేవున్న "వాంచెల్లు" గ్రామం చేరి అప్పటగల సత్రంలో ఆ రాత్రికి తలదాచుకుంటారు. ఉదయమే కూలిపనికోసం వెళ్ళిన రామ చంద్రుడు ఆ గ్రామ మునసబుగారి కొబ్బరి చెట్లు నరికే పనిలో కుదురుతాడు, రామచంద్రుని కొడుకు "కృష్ణుడు" కొబ్బరితోట వద్దకు వస్తాడు. దారి ప్రయా ణంలో వేడిచేసి ఎన్ని చిట్కా వైద్యాలు చేసినా తగ్గకపోవటంతో కృష్ణుడుకు ఓ కొబ్బరికాయ కొట్టి నీళ్ళివ్వాలనుకుంటాడు రామచంద్రుడు, కాని మునసబుగారి తొత్తుమాల "కుట్టిగాడు" ససేమిరా కాయ ముట్టడానికి వీలుకాందటాడు కొడుకును సత్రానికి పంపి చెట్లునరికే పనిలో నిమగ్నమవుతాడు రామచంద్రుడు అంతలో సత్రంలో కాపురముండే తత్వాల తాతయ్య ఒగర్చుకుంటూ పరిగెత్తివచ్చి రామ చంద్రుని పందులన్నీ కానలోని కుంటవద్ద చచ్చి పడుండాయి అనిచెప్తాడు- ఆ వార్త విన్న రామచంద్రుడు రివ్వునచెట్టు దిగి బాణంలా కానలోని కుంటదగ్గరకు దూసుక పోయి చచ్చిపడివున్న పందుల్ని చూసి, పందుల్ని వదిలి ప్రక్కకు వెళ్ళిన భార్యను తిట్టి కొట్టి కోపాన్ని తాపాన్ని దిగమ్రింగకొని దిగాలుగా పందుల శవాల వద్ద కూర్చొని వుంటాడు. దారిన వెళ్ళే రైతులు ఈ ఘోరానికి సానుభూతి చూపి రామచంద్రుని ఊరడించి చచ్చినపందుల్ని అమ్మిపెడ్తానంటాడు ఒక రైతు. ఆరైతుకు ఆ పందుల శవాల్ని అప్పచెప్పి సత్రానికి చేరతారు రామచంద్రుడు, భార్య నాగ. సత్రంచేరిన కొంచెము సేపటికి మునసబుగారి ట్రాక్టరు వచ్చి సత్రం ముందు ఆగు తుంది. అందులోని హరిజనులంతా క్రిందకు దిగి చివరగా కృష్ణుడి మృత శరీ రాన్ని దించుతారు. ఆ దృశ్యాన్ని చూచిన రామచంద్రుడు అవాక్కయి పోతాడు.

నాగ స్పృహ కోల్పోతుంది- కొంకాయ చెట్టెక్కి విరగబడ్డ వుదంతాన్ని ఓ హరిజ నుడు చెబుతాడు- మునసబుగారు రామచంద్రుడ్ని ధైర్యంగా వుండమనిచెప్పి, జర గాల్సిన పని చూడమని చెప్పి వెళ్తాడు. మసక చీకటిలో కృష్ణుడ్ని సమాధిచేసి రామ చంద్రుడు, నాగ విలపిస్తారు.

ఉదయమే భార్యాభర్తలు మరో వూరికి ప్రయాణం. దారిలో ఓ బండి రైతు తారసపడతారు- ఆ ఎడ్లబండిపై కొంతదూరం ప్రయాణించి ఓ మట్టిరోడ్డువద్ద దిగి దగ్గరలోని ఓ పురాతన దేవాలయం వద్దకు చేరతారు- ఆ దేవాలయం పాక్కారపు హద్దుగావున్న ఓ తాటియాకుల పాకలో వుంటున్న తాగుబోతు అయిన అర్జునరెడ్డి వీళ్ళకు తలదాచుకోవడానికి జాగా ఇస్తాడు- తెల్లవారుజామున గుడిచుట్టూ ప్రదక్షిణాలకై ఆ గ్రామ హరిజన వాడలోని మాలలంతా వచ్చి భజనచేస్తూ ప్రదక్షిణంచేసి తిరిగివెళ్ళి మాలపల్లెలోని భజన మందిరానికి చేరతారు- వాళ్ళతోపాటు మాలపల్లెలోకి వెళ్ళిన రామచంద్రుడ్ని సాతాని పూజారి పరామర్శించి ఎక్కడ వున్నది తెలుసుకొని అవాక్కయిపోతాడు- ఉదయమే తామంతా మాల రామచంద్రుడువున్న పాకచుట్టూ దేవుడి గుడితోపాటు ప్రదక్షిణం చేయటం వలన ఆంజనేయస్వామికి ఉగ్రం వస్తుందని మాలపల్లి హతమై పోతుందని చెప్తూవుంటాడు అంతలో "కలరా" మాలపల్లి లోకి వచ్చిందని జనం చచ్చిపోతున్నారని గగ్గోలుగా జనం పరిగెత్తివస్తుంటారు- దీనంతకీ కారణం రామచంద్రుడు ఆ పాకలో వుండటం, తామంతా ప్రదక్షిణ చేయటం అని నిర్ధారించి రామచంద్రుడ్ని వెంటనే ఖాళీ చేయమంటాడు సాతాని పూజారి సరేనంటూ రామచంద్రుడు పరుగెత్తి వెళ్ళి పాకలోని సామాను తీసుకొని బయటపడతాడు. ఇది చూచిన అర్జునరెడ్డి రామచంద్రుని వారించి "ఈ పాకలో నేను కాపురముండగా లేని పాతకం నువ్వు కాపురముంటే వచ్చిందా" అంటూ వారిస్తున్న సమయంలో అప్పటకు వచ్చిన సాతాని పూజారి కలుగజేసుకొని రామ చంద్రునిపైకి కొట్టేదానికి దుముకపోతున్న సమయంలో అర్జునరెడ్డి సాతాని పూజారిని చితకగొట్టి పంపిస్తాడు ఆ రోజు రాత్రి ఆ పూరికొంపకు ఎవరో నిప్పంటించగా లోపల అరుస్తున్న అర్జునరెడ్డి కేకలకు బయట నిద్రిస్తున్న రామచంద్రుడు లేచి రక్షించబోతాడు. తలుపుకు తాళం బిగించి వుంటుంది. ఓ రాతితో తాళం బద్దలుకొట్టి కాల్పులకు గురైన అర్జునరెడ్డిని మోసుకొని వైద్యసహాయం కొరకు గ్రామంలోకి బయలుదేరబోతాడు- అర్జునరెడ్డి వారించి తాను ఆట్టేసేపు బతకనని శరీరమంతా కాల్పులలో అమిత తాపంగా వుందని లోపల గర్భగుడిలోని దీపపు ప్రమెల్లోని అముదం తెచ్చి శరీరంపై పోసి తన తాపాన్ని తీర్చమంటాడు- మాలవాడు గర్భ

గుడిలోకి పోకూడదని తిరస్కరించిన రామచంద్రుని దగ్గరకు రమ్మని పిలిచి సర్వ శక్తులను కూడదీసుకొని కాండ్రించి రామచంద్రుని మొఖాన ఫుమ్మి కుప్పలా కూలి పోతాడు అర్జునరెడ్డి. ఇది సంక్షిప్తంగా కథాంశం

ఈ కథాంశాన్ని తీర్చిదిద్దటంలో రచయిత యొక్క సఫలతను, విఫలతను బేరీజు వేయవలసి యున్నది. పీడిత తాడిత వర్గాలకే అంకితమైన రచయితగా చెలామణిఅవుతున్న రచయిత ఈ నవలలో హరిజనుల సమస్యలనీ, బాధల్నీ, కష్టాల్నీ, సుఖాల్నీ వాస్తవంగా చైతన్య వంతంగా చిత్రించిందీ, ఏ మేరకు హరిజనుల ప్రయోజనాలను కాపాడిందీ, ఏ మేరకు హరిజనుల్ని చైతన్యహీనులుగా చేసే భావాలను ప్రచారం చేసిందీ ముఖ్యంగా పరిశీలించాలి.

సాహిత్యానికి ముఖ్యంగా రెండు ప్రధాన లక్షణాలున్నాయి. పీడిత ప్రజలలో వైరుధ్యాలను తొలగించి ఐక్యత సాధించటానికి తోడ్పడేది, పీడనను ప్రతిఘటించేది, అభ్యుదయం కలిగించేది– ఇదంతా ప్రజా సాహిత్యము. పీడిత వర్గానికి పనికి వచ్చే సాహిత్యము, పీడిత వర్గాల పక్షాన నిలిచే సాహిత్యము

ఐక్యతకూ, ప్రతిఘటనకూ, అభ్యుదయానికి పీడిత ప్రజలను వెనక్కులాగేది, చైతన్య రహితంచేసేదీ, ప్రక్కదారి పట్టించేదీ– ఇదంతా పీడిత తాడిత వర్గాలకు వ్యతిరేకమయిన సాహిత్యము. ఈ రెండు రకాల సాహిత్యానికి తేడాను ముఖ్యంగా పరిశీలించాలి.

ఆదర్శవాదులు, యధాతథవాదులు వస్తువుకూ, శిల్పానికి ప్రాధాన్యత ఇచ్చి ఫలితాలను నిర్లక్ష్యంచేస్తారు. హేతువాదులు, యాంత్రిక భౌతికవాదులు ఫలితాలకు ప్రాధాన్యతనిచ్చి వస్తువును, తృణీకరిస్తారు.

ఈ పుభయులకు వ్యతిరేకంగా వస్తువుకూ, ఫలితానికి మధ్య ఐక్యత పీడిత ప్రజల పక్షం వహించే రచనలకు వుండాలి. పీడిత ప్రజలకు సేవ చేయాలన్న ఆశయానికి వారి ఆదరణ ఫలితాన్ని సాధించటానికి అవినాభావ సంబంధముంది. కేవలం పీడిత ప్రజలను సేవించాలని ఆశయంవుండి, వారికి లాభంచేకూర్చటం అన్న ఫలితాన్ని విస్మరించితే ఆ రచన నిరుపయోగమే అవుతుంది.

ఈ నవలలో రచయిత ప్రధానంగా గ్రామీణ పీడిత వర్గమైన హరిజన దాస్య ప్రవృత్తిని కథాంశముగా తీసుకొని, గ్రామీణ వాతావరణాన్ని హరిజనుల దాస్య ప్రవృత్తిని చక్కగా తీర్చిదిద్దారు. అదే సమయంలో భూస్వాముల దురాగతాలను,

హింసాత్మక చర్యలను ప్రత్యక్షంగా చూపక వారిని కేవలము ఆలంబనగా చిత్రీకరించి చిమ్మ చీకటిలాంటి హరిజనుల జీవన వ్యవస్థలోకి ఒక్క కాంతి కిరణాన్నైనా ప్రస రింపచేయటానికి ప్రధాన ఆటంకము దోపిడీ వర్గాలకన్నా, తన వర్గంలోని వారిచేత జరిగే అపచారమే ప్రధానమైనదని చిత్రించి పీడిత తాడిత వర్గాల పక్షాన నిలబడటంలో రచయిత వైఫల్యముచెందాడు. ఈ నవలలో రామచంద్రుడు తన కష్ట నష్టాలకు ప్రధానకారణము తనకు దారిలో సహాయపడిన లారీ డ్రైవర్‌తోను, బండి రైతు తోను, అర్జునరెడ్డితోను వాపోతాడు- రామచంద్రుడు పుట్టి పెరిగిన గ్రామమయిన "గంగపట్నం"లో ఇంటిని కూల్చే సందర్భములోగాని, పెద్దరెడ్డి ఇంటివద్ద రామ చంద్రుడ్ని చితక గొట్టటంలోను ప్రధాన పాత్ర మాలలదేనన్నట్లు చిత్రించి, దోపిడీ వర్గాలకు ప్రతీకయైన పెద్దరెడ్డి అత్యాచారాలను కేవలము ఉవాచ ద్వారా కొద్దిగా పరా మర్శిస్తాడు రచయిత అలాగే "వొంటిమిట్ట" గ్రామములో రామచంద్రుడు తన కొడుక్కి కొబ్బరి నీళ్ళు ఇవ్వటానికి కూడా ప్రధాన ఆటంకము మాల "కుట్టిగాడు" గా చిత్రించి, రామచంద్రుని పందులనన్నింటినీ చావబాదింది మునసబుగారి పని పాట్లలోని మాలలేనన్నట్లుగా చిత్రించారు రచయిత. పందులు చనిపోయినప్పుడు గాని, కొడుకు చనిపోయి కుమిలి పోతున్నప్పుడుగాని కనీసం సానుభూతి వాక్యాలు కూడా మాలలచేత పలికించక రామచంద్రుడ్ని వాపోవ చేస్తాడు రచయిత చివరగా అర్జునరెడ్డి పాకను ఖాళీ చేయవలసివచ్చినప్పుడు కూడా అందుకు ప్రధాన కారణము మాలలుగానే చిత్రించి మాల మాదిగల అభ్యున్నతికి దోపిడీ వర్గాలుకాక, మాల మాదిగలే ప్రధాన అడ్డంకి అన్నంతగా కథాంశాన్ని నడుపుతాడు రచయిత.

ఇలా తీర్చిదిద్దటంలో రచయిత సమాజంలోని వైరుధ్యాల పాత్రను గుర్తించ లేదనేది స్పష్టమైన విషయం. అనగా వ్యక్తి చైతన్యానికి, సామాజిక చైతన్యానికి, వర్గ చైతన్యానికి మూల కారణమైన వైరుధ్యాల పాత్రను శాస్త్రీయ దృక్పథం లేనందువలన రచయిత విస్మరించాడనే నిర్ణయానికి మనము తప్పక రావలసి యుంటుంది.

ఈ నవలా చిత్రణలో హరిజనులందరూ తమలో ఒకడైన రామచంద్రుడ్ని నీచంగా పరిహసించటం, చావ బాదటం, స్పృహ తప్పినవాని మొకాన పుచ్చ బట్ట చల్లమనటం- ఇవ్వన్నీ మిత్రవైరుధ్యాల స్థాయిని మించి శత్రు వైరుధ్యాల స్థాయికి చేరుకున్నవి.

అలానే దోపిడీ వర్గాలైన భూస్వాములకు హరిజనులకు మధ్య వుండే శత్రు వైరుధ్యాన్ని చిత్రించటంలో రచయిత విఫలత చెందాడు. కేవలం రామచంద్రుడి

లాంటి ఉద్రేకి, నిరక్షరుడు, మూర్తీభవించిన మొరటుతనం - అయిన పాత్ర నొకదానిని సృష్టించి ఒంటరిగా భూస్వామ్య వర్గంతో తలపడటం చూపించి మిగిలిన హరిజనులందరినీ పెద్దరెడ్డికో, మునసబుకో వంతపాడే హరిజనులుగా చిత్రీకరించటం ద్వారా, హరిజనులలోని చైతన్యాంశ అంతా కేవలం ఉద్రేకం, మొరటుతనం అన్నట్లుగానే రామచంద్రుని పాత్ర ద్వారా చిత్రించటం జరిగింది. చివరిగా రామచంద్రుని చైతన్యసాహిత్యానికి గీటురాయా అన్నట్లుగా అర్జునరెడ్డిచే గుడిలోని దీపపు సెమ్మెలోని అముదం తెమ్మని చెప్పించి అందుకు నిరాకరించిన రామచంద్రునిపై అర్జునరెడ్డిచే వుమ్మించటం పీడిత ప్రజలను అవమానించటంగానే తప్పక పరిగణించవలసి యున్నది.

పీడిత ప్రజలైన హరిజనులలో లోపాలుండవని కాదు. చాలా మందికి పాత భావాలు పోవు. దాస్య ప్రవృత్తి పోదు. వారు ఈ పాతభావాల బరువును దించేసుకొని, దాస్య శృంఖలాలను వదలించుకొని, తమ లోపాలను తామే సరిచేసుకొని, ఐక్యంగా, చురుకుగా ముందుకు సాగేటట్లు తోడ్పడటానికి తగిన చైతన్యాన్ని అందించవలసిన బాధ్యత ప్రధానంగా పీడిత తాడిత ప్రజల పక్షం వహించే రచయితల గురుతర కర్తవ్యం. వారు ఇప్పటి వరకు జరిగిన వేలాది సంవత్సరాల పీడనలో దోపిడిలో నిత్యజీవిత సమరంలో సంస్కారం పొందటానికి ప్రయత్నిస్తున్నారు, పొందుతున్నారు. ఈ పరిణామాన్ని ముఖ్యంగా పీడిత ప్రజ పక్షపాత రచయితలు తప్పక చిత్రించాలి. వారి లోపాలను ప్రస్తావించి, తద్వారా వారిని అవహేళనచెయ్యటం తప్పు. హరిజనులలో అనేకులు నిరక్షరాస్యులు. పేదరికం, అజ్ఞానం వారి సొత్తు. వారి జీవితము నిత్యసమరమే. వారిలోని సంఘర్షణాగ్ని నివురుగప్పి వుంది. దానికి ఆజ్యం పోయవలసిన ప్రధాన బాధ్యత పీడిత ప్రజ పక్షపాత రచయితలదే. వారి పక్షాన నిలబడే రచయితల రచనలు వారిని మేల్కొలిపి, ఉత్సాహం చేకూర్చి, వారు తమ వాతావరణాన్ని మార్చుకోవటానికిగాను తోడ్పడాలి. అలా కాని నాడు ఆ రచనవల్ల పీడిత ప్రజలకు ప్రయోజనం శూన్యం.

సహజంగా గ్రామీణ ప్రాంతాలలో పీడిత తాడిత ప్రజల మధ్య వున్న అంతర్గత వైరుధ్యాలను ఆసరగాచేసుకొని భూస్వాములు తమ దోపిడీని కొనసాగిస్తుంటారు. ఈ నవలలో రామచంద్రునికి మిగిలిన మాలలకు మధ్యగల అంతర్గత వైరుధ్యాలను చిత్రించటంలో బలమైన కారణాలుగాని, ఈ అంతర్గత వైరుధ్యాలను

పెంపొందిస్తూ భూస్వామ్య వర్గాలు కొనసాగించే దోపిడీ, హింసాత్మక చర్యలను బలంగా చిత్రించటములోగాని రచయిత విఫలత చెందాడు.

మన సాహిత్యమూ కళలూ ప్రజలకు సేవ చేయాలి. ముఖ్యంగా పీడిత తాడిత ప్రజలకు సేవచేయాలి. ప్రజలలోని మూఢ భావాలను, అశాస్త్రీయ భావజాలన్ని తొలగించాలి. చైతన్య పరచాలి. వారి జీవితాలలో వెలుగు రేఖలను నింపాలి అంతే కాని పాత భావాలకు బలం చేకూర్చటం పీడిత ప్రజలకు హాని చేయడమే. మచ్చుకు కొన్ని భావాలను పరిశీలిద్దాం.

"ఈ ఇంట్లోకి మారంగానే కిష్టుడికి మందూ మాకూ లేకుండానే వొళ్లు కుదురుకునింది. ఈ సంవత్సరములో ఒకసారి గూడ మూర్చ కనబడలేదు వానికి పట్టిన "కింక"లన్నీ వదిలి పోయినాయి."

"నువ్వీ పొద్దు ఎడం పక్క నిద్ర లేచినావురా. నాదగ్గర వొళ్ళు కాపాడుకోలేవు"

"జరిగేదంతా నొసట వ్రాసిన ప్రకారమే జరుగుతుంది"

"ఈ కలిగ్గంలో వుండే జన్మల్లోకంతా కనా కష్టమయినది మాల జన్మ. గొడ్డయి పుట్ట వచ్చు పందై పుట్ట వచ్చు కాని మాలోడై పుట్ట గూడదు."

"భూస్వామి దురాగతాలకు దేముడే బుద్ధిచెబుతాడు"

"పుణ్యం చేసుకోనుండాల. మొగుడు తాగుతా వుంటే చూస్తా కూర్చొనే పెండ్లాము దొరకాలంటే రెండు చేతులా పుణ్యం చేసుకోనుండాల."

"అది తెలుగుది కాని, అరవది కాని మరింకెవ్వరన్నా కాని ఎర్రిగా బుర్రిగా వుండే ఆడదాన్ని మాత్రము నమ్మకూడదు. నువ్వు నాగు పామును నమ్ము. చిరుత పులిని నమ్ము, ఒకనాడు గాకపోయిన ఇంకొక నాటికి బాగు పడతావు. కాని అందంగా వుండే ఆడదాన్ని మాత్రం నమ్మొద్దు."

"మొగోడు బాగుపడినా, చెస్టుపట్టి పోయినా ఆడదాని పేరు మీదనే."

"మాలోడు కాపురముండే ఇంటిని సుట్టితే సావికి కోపంరాకుండా వుంటుందా."

ఇలాంటి భావ జాలాన్ని నవల పొడవునా రచయిత పొందుపరచటం జరిగింది. కాని ఆ భావ జాలాన్ని శాస్త్రీయంగా ఎండ గట్టటం జరిగి వుంటే రచనకు పరిపుష్టి కలిగేది. అలా జరగనందున ఆ ప్రజా వ్యతిరేక భావ జాలానికే పుష్టి కలిగింది.

నవలలోని పాత్రల చిత్రీకరణలలో రైతుల పాత్రలోవున్న సమగ్రత మిగిలిన పాత్రల చిత్రీకరణలో లోపించింది.

# సాహిత్యం - మార్క్సిజం

(గత సంచిక తరువాయి)

"కంట్రిబ్యూషన్ టు ది క్రిటిక్ ఆఫ్ హెగెల్స్ ఫిలాసఫీ ఆఫ్ రైట్" అన్న పుస్తకానికి ఉపోద్ఘాతాన్ని రాస్తూ మార్క్స్ అన్న మాటలివి : "ప్రాచీన మానవులు ఏ విధంగా నైతే తమ జరిగిపోయిన చరిత్రను కల్పనా శక్తి పురాణాల్లో చూశారో, అదే విధంగా జర్మన్ దేశస్థులమైన మనం మన జరగనున్న చరిత్రను ఆలోచనా రూపంలో తత్వశాస్త్రంలో దర్శిస్తున్నాం."6

అదే ఉపోద్ఘాతంలో "జర్మన్‌జాతి నిజజీవిత బీజం ఇంతవరకూ దాని తలలో మాత్రమే పెరిగింది. ఒక్క మాటలో చెప్పాలంటే తత్వశాస్త్రాన్ని వాస్తవంగా మార్చకుండా మనం తత్వశాస్త్రాన్ని రద్దు చెయ్యలేం"7 అదే పుస్తకంలో మరోచోట "ఆనాడు సన్యాసి లూథర్ మెదడులో ఏవిధంగా నైతే విప్లవం ప్రారంభమైందో-ఈనాడు అదే విప్లవం తాత్వికుడి మెదడులో ప్రారంభమౌతుంది."7

ఇదేరీతిలో ఎంగెల్స్ కూడా "ఏవిధంగానైతే 18వ శతాబ్దంలో ఫ్రాన్సులో తాత్విక విప్లవం రాజ్యాంగాన్ని రాజకీయంగా నిర్మూలించిందో అదేవిధంగా 19వ శతాబ్దంలో జర్మనీలో కూడా జరిగింది"4 & 5అన్నాడు.

దీనిని బట్టి భావాలు ముందు మనిషి ఆలోచనలో సాఫల్యత చెంది తర్వాత భౌతిక వాస్తవికతను మార్చడానికి ఉద్యమిస్తాయని తెలుస్తుంది. ఏ సమాజంలో నైనా ఆ సమాజంలో జరగనున్న మార్పులను గూర్చిన ఆలోచనలు ఆ మార్పులు జరగకముందే ఆకృతి నొందుతాయని తెలుస్తుంది.

కనుక వాస్తవికత నాధారం చేసుకుని పుట్టే భావాలు భవిష్యత్ వాస్తవికతను మార్చడంలో ప్రముఖపాత్ర వహిస్తాయి.

మార్క్స్ ఇదే విషయానికి సంబంధించి మే 1843 లో ఆర్నాల్డ్ రూగ్‌కు రాసిన ఉత్తరంలో ఈ విధంగా పేర్కొన్నాడు.

"చైతన్య సంస్కరణ అనేది ప్రపంచానికి తన చైతన్యాన్నిగూర్చి తెలియ చెప్పడంలోనే, ప్రపంచాన్ని తన స్వప్నావస్థ నుండి మేల్కొల్పడంలోనే, ప్రపంచానికి తన చర్యల గురించి విశదీకరించడంలోనే ఇమిడి వుంది."8 అదే ఉత్తరంలో "ప్రపంచం ఇన్నాళ్ళుగా ఏ కలనైతే కంటున్నదో ఆ కలను గుర్తించి, దానిని ఆచ

రణలో సాధ్యం చేసుకోవడంలోనే, గతానికి, భవిష్యత్తుకు మధ్య పెద్ద దూరమేమీ లేదని అయితే గతంలోని ఆలోచనల్ని సాధ్యం చేసుకొనడంలోనే వాస్తవికతని ఆలోచనల ప్రకారం మార్చవచ్చునని తెలుస్తుంది."8

ఈ ఉత్తరంలోని అంశాల్ని బట్టి చూసినా మానవుడు కల్పనాశక్తి ద్వారా తాను సాధించబోయే విజయాల్ని ముందుగానే ఊహించగలడని రుజువైంది. కవులు, తాత్వికులు ఇంతకాలంగా చరిత్రలో చేసింది ఇదే. ప్రజల్ని చైతన్యవంతుల్ని చెయ్యడమే జ్ఞానం యొక్క ముఖ్య లక్షణం.

మార్క్స్ ఉద్దేశించిన చైతన్య సంస్కరణకై సాహిత్యం, కళలు, తత్వశాస్త్రం ప్రముఖంగా తోడ్పడతాయి. మనిషి జీవితంలో, ఒక సమాజ జీవితంలో ఆలోచనకున్న ప్రాధాన్యతను ఇంతకన్నా బలంగా ఎవరూ వివరించలేరేమో!

మనిషి తన ఆలోచనల ప్రకారం శ్రమించి ఆలోచనా ఫలితాన్ని ఉత్పత్తి రూపంలో ఎలా పొందేదీ మార్క్స్ కాపిటల్‌లో సైతం వివరించాడు.

"సాలెపురుగు గూటిని నేతవాడి అల్లికతో పోల్చవచ్చు, తేనెటీగ తన గూడును కట్టుకోవడం ద్వారా శిల్పకారుడినే తలవంచుకునేలా చేస్తుంది. అయితే ఒక నాసిరకపు శిల్పకారుడిని మంచి తేనెటీగల్నుండి సైతం వేరు పర్చేది అతని కల్పనా శక్తి. అతను తాను నిర్మించబోయే కట్టడాన్ని ముందుగానే తన కల్పనలో చిత్రిస్తాడు. శ్రమ చివర శ్రామికుడు తాను ముందుగా ఊహించినదానినే పొందుతాడు."9

దీనినిబట్టి ఆచరణతత్వశాస్త్రంలో ఆలోచనలు, కల్పనాశక్తి ప్రాథమికమని సులువుగా గ్రహించవచ్చు. ప్రపంచాన్ని, బాహ్యవాస్తవికతని (విషయాన్ని) మార్చే వ్యక్తి ఈ విధంగా ముందుగానే తాను మార్చబోతున్న వాస్తవికతను గురించిన జ్ఞానాన్ని కల్గివుంటాడు. ఊహలోవున్న రూపానికి శ్రమద్వారా, క్రియాత్మకమైన చర్య వల్ల ఆకృతినిస్తాడు. అంటే తాత్వికుడు, కవి ముందుగా కల్పిస్తేనే తర్వాత సమాజంలో ఆకృతి తీసుకోవడం జరుగుతుంది.

మనిషి కంటున్న కలలు, ఊహిస్తున్న స్వర్గాలు నిజంకానంత వరకు మనిషి ఆలోచనల్ని ఎవరూ అరికట్ట లేరన్నది నిజం. ఊహ నిజంగా మారిన్నాడు ఊహ తన ఉనికిని కోల్పోతుంది.

అయితే ఇక్కడ ఇంకో సమస్య తలెత్తుతుంది. ఈ విప్లవాత్మక భావాలు ముందుగా ఎవరు ప్రవేశపెట్టాలి? ఈ ప్రశ్నకు సమాధానం కమ్యూనిస్టు మానిఫెస్టోలో లభిస్తుంది.

"ఇంతకు ముందు ఏ విధంగానైతే ఫ్యూడల్ వర్గంలోని ఉన్నత వర్గం బూర్జువాల తరఫున ప్రాతినిధ్యం వహించారో, అదే విధంగా బూర్జువాలలోని ఓ భాగం శ్రామికవర్గం వైపు వెళ్ళి వారికి ప్రాతినిధ్యం వహిస్తుంది. ముఖ్యంగా చారిత్రికగమనాన్ని మొత్తంగా అవగాహన చేసుకున్న బూర్జువా మేధావులు శ్రామిక జనపక్షం వహిస్తారు."10

ఇదంతా గమనిస్తే వ్యక్తికి తానున్న సమాజంలోనే స్వేచ్ఛ (autonomy) పరిమితమైనదైనప్పటికీ వున్నదనేది స్ఫుటంగా తెలుస్తుంది. ఇట్లా వ్యక్తికి కొంత స్వేచ్ఛ వున్నంత మాత్రాన చారిత్రిక భౌతికవాదం అసత్యమైపోదు. ఈ స్వేచ్ఛ భౌతిక పరిస్థితుల పరిమితుల్లోనిదే.

సంఘాన్ని అనుసరించాలా లేక వ్యతిరేకించాలా అనేది వ్యక్తి నిష్టం. ఆ వ్యక్తి సాహిత్య పఠనంవల్లో, సరియైన సాంఘిక అవగాహనవల్లో విజానిజాల్ని తెల్సుకుని బాధ్యతాయుతుడు కావల్సిందే తప్ప వేరు మార్గం లేదు. అందుకే సమాజం కోసం, మార్పు కోసం కృషిచేసే వాళ్లు ఏ వ్యవస్థలోనైనా కొద్ది మందే వుంటారు. కనుక వ్యక్తి గత అంశానికి (Subjective factor) మార్క్సిజంలో గుర్తింపు వున్నదనే తెలుస్తుంది. అయితే ఈ అంశాన్ని చెరిపివేసే ప్రయత్నం మనకు మార్క్సిస్టుల్లో ఎల్లెడలా కనిపిస్తుంది.

## కళలకూ - భౌతిక ఉత్పత్తికీ మధ్యగల అసమానత

మార్క్స్ తన "కంట్రిబ్యూషన్ టు ది క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ" ఉపోద్ఘాతంలోని నాల్గవ భాగంలో జ్ఞప్తికుంచుకోవాల్సిన ఎనిమిది అంశాల్ని వివరించాడు. ఈ అంశాల్ని మర్చిపోకూడదని నొక్కి చెప్పాడు. వాటిలో ఆరవ అంశం ఈ అసమానతను గురించి "భౌతిక ఉత్పత్తులూ, కళలు అసమానంగా వృద్ధి చెందుతాయి. ప్రగతి భావనను మొత్తంమీద మామూలు మాదిరిగా అమూర్త రూపంలో అవగాహన చేసుకోలేం, ముఖ్యం ఆధునిక కళల విషయంలో."11 — అంతే కాకుండా "ఈ భావన (conception) అనివార్యంగా వృద్ధినొందుతున్నట్లు కూడా కనిపిస్తుంది"12 అని కూడా మార్క్స్ అన్నాడు.

అసమానతలు ప్రతి సమాజంలో ఏదో రీతిలో వుంటాయని దీన్నిబట్టి తెలుస్తుంది. కళలు, సాహిత్యం లాంటివే కాకుండా కొన్నిసార్లు న్యాయ సంబంధాలు (legal relations) కూడా ఆనాటి ఉత్పత్తి సంబంధాలకన్నా వెనకపడివుండవచ్చు.

న్యాయ సంబంధాలు కూడా ఉపరితలానికి (Supe structure) కు చెందినవే కదా? యూరోపియన్ దేశాల్లో సైతం ఉత్పత్తి సంబంధాలు మారినంత వేగంగా వివాహ చట్టాలు లాంటివి మారడంలేదు. దీన్నిబట్టి ఉపరితలానికి చెందిన అంశాలు పునాది కన్నా వెనకబడి వుండడానికి అవకాశముందని తెలుస్తుంది. జర్మనీలో పెట్టుబడి విధానం ప్రవేశించకముందే పెట్టుబడిదారీ సమాజం కన్నా ఉన్నతమైన సామ్యవాద సమాజాన్ని గూర్చిన సిద్ధాంతాలు తత్వశాస్త్రంలో ప్రవేశించడాన్ని (మార్క్స్) బట్టి చూస్తే ఉపరితల అంశాలు ఆనాటి సామాజిక పరిస్థితుల నధిగమించి వుంటా యని కూడా తెలుస్తుంది. దీన్నిబట్టి ఈ అసమానతలు ఏ సమాజంలోనైనా ఉద్భవించ వచ్చునని అర్థమౌతుంది. తన ఈ ప్రత్యయానికి (concept) ఉదాహరణగా మార్క్స్ గ్రీకు ఇతిహాసాలను పేర్కొని విశ్లేషించాడు.

అసమానతా సిద్ధాంతాన్ని ఆరవ అంశంగా వివరించాడు గ్రీకు కళల్ని గురించి ఎనిమిదవ అంశంలో వివరించాడు. గ్రీకు సాహిత్యం ఆనాటి సమాజం అపరిపక్వ దశలో వున్నందువల్లే జన్మించిందని మార్క్స్ వివరణ ఇచ్చాడుక నుక మార్క్స్ సూత్రీకరించిన ఈ ప్రత్యయం (concept) అసత్యం కానేరదు.

త్రిపురనేని గ్రీకు ఇతిహాసాల గురించి మార్క్స్ ఇచ్చిన వివరణను ఒక్క గ్రీకు కాలానికే పరిమితం చేయడం చాలా చిత్రంగా వుంది. గ్రీకు ఇతిహాసాలను గూర్చిన వివరణ తాను సూత్రీకరించిన సిద్ధాంతానికి ఒక ఉదాహరణ మాత్రమే మరి మార్క్స్ షేక్స్పియర్‌ను గురించి కూడా రాశాడు. గ్రీకు సాహిత్యం ఏవిధంగానైతే ఆనాటి సమాజంలో ఉద్భవించిందో అదే విధంగా షేక్స్పియర్ సాహిత్యం కూడా విక్టోరియన్ యుగంలో ఉద్భవించింది. షేక్స్పియర్ సాహిత్యా నికీ, ఆయన కాలానికి మార్క్స్ గ్రీకు సాహిత్యం మాదిరి వివరణ ఇవ్వలేదు కనుక షేక్స్పియర్‌ను కూడా అసమానతకు ఉదాహరణగా తీసుకోవాల్సిన అవసరం లేదన్నమాట.

గ్రీకు సాహిత్యం చారిత్రికంగా మానవజాతియొక్క బాల్యదశకు చెందినప్పుడు షేక్స్పియర్, డాంటె, సెర్వాంటిస్‌లు యవ్వన దశకు చెందినవారై యుండాలి. బాల్యదశకు చెందిన సాహిత్యం చిరస్థాయిగా సాహితీ ప్రియుల్ని ఆకర్షిస్తుంది కనుక మానవజాతి యొక్క అన్ని ఇతర దశలకు చెందిన సాహిత్యంకూడా అలాగే ఆకర్షిం చాలి. ఆధునిక కళల విషయంలో, ఇతర విషయాల్లోనూ ప్రగతి భావనను

మామూలురీతిలో అమూర్తంగా అవగాహన చేసుకోకూడదని మార్క్స్ హెచ్చరించాడు. జ్ఞాపకం పెట్టుకోవడం అవసరమని కూడా నొక్కిచెప్పాడు.

సమాజం ఆర్థికంగా, చారిత్రికంగా అభివృద్ధి చెందుతున్నది నిజం కనుక కళలు కూడా అదేవిధంగా వృద్ధిచెందాల్సిన అవసరమేమీ లేదని ఇక్కడ మార్క్స్ ఉద్దేశ్యం.

కనక వాస్తవానికి కళ్ళుమూసుకుని కళలు కూడా వృద్ధిచెందుతాయని నమ్మేవాళ్ళు మార్క్సిస్టులు కాలేరు. ఈనాడు రష్యాలో జరుగుతున్నదదే. సోషలిస్టు పథంలో పయనిస్తున్నాం కనుక సాహిత్యం కూడా సోషలిస్టు పథంలో మున్ముందుకు సాగుతుందని ప్రచారం చేస్తున్నారు. నిజానికి రష్యాలో షోలోకోవ్ (Maichail Sholokhov) తర్వాత సాహిత్యం పుట్టలేదు.

ఓ సమాజం ఆర్థికంగా, శాస్త్రీయంగా పరిగతి పొందుతున్నంత మాత్రాన కళలు పరిగతి నొందనవసరం లేదని, అలాగే ఓ సమాజం ఆర్థికంగా, ఇంకా ఇతర రంగాల్లో వెనుకబడివున్నా కళలు చాలా గొప్పదశలో వుండవచ్చునని దీనివల్ల మనం తెల్సుకోవచ్చు. అట్లా అని చెప్ప కళలు స్వతంత్రంగా వుంటాయనిగాని, సామాజిక స్థితిగతుల్ని, వైరుధ్యాల్ని ప్రతిబింబించవనిగాని చెప్పడం నా ఉద్దేశంకాదు.

మార్క్స్ తన "థియరీస్ ఆఫ్ సర్‌ప్లస్ వాల్యూ" మొదటి వాల్యూంలో ఈ విషయాన్ని గురించే రాస్తూ "18వ శతాబ్దంలో ఫ్రెంచి వాళ్ళు తాము పూర్వుల కన్నా యాంత్రికశాస్త్రం ఇత్యాది శాస్త్రాల్లో అభివృద్ధి చెందాం కనుక కళల్లో మాత్రం ఎందుకు అభివృద్ధి చెందకూడదు అనే భ్రమకులోనై 'ఇలియడ్ స్థానంలో హెర్నియాడ్' ఎందుకు పుంచకూడదనుకున్నారు. ఫ్రెంచివాళ్ళ భ్రమల్ని లెస్సింగ్ తన రచనల్లో చాలా వ్యంగ్యంగా చిత్రించాడు"13 అన్నాడు.

దీనినిబట్టి మార్క్స్ కళలు, సాహిత్యమూ ఆనాటి సామాజిక సంబంధాల నుండి కొంతవరకు (ఆనాటి సమాజ పరిమితుల్లోనే, చారిత్రిక భౌతికవాద పరిధిలోనే) స్వతంత్రత కల్గివుంటాయని తలంచినట్లు తెలుస్తుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థలో పాలకవర్గ భావాలను సాహిత్యం, సినిమాలు, టీవీ, వగైరా సాంస్కృతిక సాధనాలు ముమ్మరంగా ప్రచారంచేస్తాయి. ప్రభుత్వం తన ఉనికికి భంగం వాటిల్లకుండా వుండడానికై మత్తుమందులా పనిచేసి మనుష్యుల్ని

నిర్వీర్యుల్ని చెయ్యగల ఈ ఉపకరణాలను సమృద్ధిగా వినియోగించుకుంటుంది. అందువల్ల అధిక జనాభా అజ్ఞానంలో, చీకటిలో సంఘాన్ని సాంప్రదాయాల్ని ప్రశ్నించనైనా ప్రశ్నించకుండా తమ జీవితాల్ని గడుపుతుంటారు.

సాహిత్యాధ్యయనం చేసినవాళ్లు లేదా తాత్విక రచనల్ని చదివినవాళ్లు సరియైన రాజకీయ అవగాహన వున్నవాళ్లు (ఆలోచించడం తెల్సినవారు) మాత్రమే ఈ ఉత్పత్తుల దుష్ప్రభావాన్ని అరికట్టి ప్రజల్ని వెలుగులోకి రప్పించడానికి వాటికి వ్యతిరేకంగా ఉత్తమ సాహిత్యాన్ని, కళల్ని సృజిస్తారు. ఈ కొద్దిమంది మాత్రమే సాహిత్యాన్ని ఉత్పత్తి చేయడంగాని, ఆనందించడం గాని చేస్తుంటారు.

కాపిటలిస్టు వ్యవస్థ అత్యున్నతమైనదని నమ్మే బూర్జువాలు తమ వ్యవస్థలో ఉత్తమ కళలు పుడతాయని నమ్మినా, కాపిటలిస్టు వ్యవస్థ పూర్తిగా అమానుషమైన, పతనమైన వ్యవస్థ అని నమ్మే మార్క్సిస్టులు ఆ వ్యవస్థలో వ్యాపార సాహిత్యం, క్షీణ సాహిత్యం మాత్రమే పుడతాయని నమ్మినా– ఇద్దరూ తప్పే. పెట్టుబడిదారీ సమాజం చాలా పతనమైనదే అయినప్పటికీ ఉత్తమ సాహిత్యం కూడా వెలువడుతుంది– దీన్నిబట్టి ఆనాటి సమాజంకన్నా ఓ మెట్టు పైస్థాయిలో కళలు వుంటాయని రుజువైంది.

కనుక చారిత్రిక భౌతికవాదం ప్రకారం సాహిత్యాన్ని విశ్లేషించడం ఇతర అంశాల్ని విశ్లేషించినంత సులభసాధ్యం కాదనేది నిజమని తెలుస్తుంది.

ఈ విధంగా అసమానంగా కళలు వృద్ధి చెందినంత మాత్రాన సాహిత్య ఉత్పత్తికీ, భౌతిక ఉత్పత్తికీ పెట్టుబడిదారీ సమాజంలో (ఏ వర్గ సమాజంలోనైనా) ఉన్న వైరుధ్యాలు అసత్యం కానేరవు. వైరుధ్యాలున్నా కళలు ఉత్పత్తి అవుతాయని మాత్రమే అవగాహన చేసుకుంటాం.

దీన్నిబట్టి ఉత్పత్తి సంబంధాలకు, సాహిత్య సృష్టికీ ఖచ్చితమైన, సూటైన పరస్పర సంబంధాన్ని చూడలేమన్నది నిజమని తెలుస్తుంది. అయినా సామాజిక స్థితిగతుల్ని నీడలా అనుసరిస్తూ, సాహిత్యం ఉత్పత్తి చెయ్యబడితే, వ్యక్తికీ (విషయి) సమాజానికీ (వాస్తవికత, విషయం) గతితార్కిక ఘర్షణ ఎలా సాధ్యమవుతుంది. గతితార్కికత క్రియాశీలంగా చరించాలంటే వ్యక్తికీ, వాస్తవానికీ ఘర్షణ జరగడం అనివార్యం. ఆ అనివార్యతే సాహిత్యంలో ప్రతిఫలిస్తుంది. కనుక తప్పనిసరి సామాజిక సంబంధాల నధిగమించే ప్రయత్నం చేస్తుంది సాహిత్యం.

## సార్వజనీనత

షేక్స్పియర్ సృష్టించిన రోమియో, జూలియట్ లు(అందరికీ తెలిసిన ఉదా:) ప్రేమికులకు చిహ్నంగా చిరకాలంగా అమరులై వున్నారంటే ఆ పాత్రలను షేక్స్పియర్ మనిషి నిజస్వభావాన్ననుసరించి సృష్టించినందువల్లే అయివుండాలి. రోమియో జూలియట్లు రచయిత వూహనుండి సృష్టించబడలేదు; ఆ నాటి సమాజంలో వున్న వైరుధ్యాలనాధారం చేసుకునే ఆ రెండు పాత్రల్ని రచయిత సృష్టించాడు. వాళ్లు రక్తమాంసాలున్న పాత్రలు. ఆ నాటకం ఆ నాటి వైరుధ్యాల్ని చిత్రీకరించినా ఇంకా ఆ నాటకం సజీవంగా వుండటంటే దానిక్కారణం సార్వజనీనత అనే చెప్పుకోవాలి. మనం ఇంకా వర్గ సమాజంలోనే వుండడం, ఈ నాడు కూడా ప్రేమ విషాదాంతమే కావడం కూడా రోమియో, జూలియట్లు జీవించివుండడానికి గల కారణాలుగా చెప్పుకోవాలి.

ఒక రచనను అన్ని వర్గాల పాఠకులు ఆనందించిన్నాడు కూడా మనం ఆ రచనను సార్వజనీన రచనగా గుర్తించవచ్చు.

బూర్జువా విలువల్ని ధ్వంసం చేసినందుకు బాల్జాక్ను మార్క్స్ గొప్ప రచయితగా అంగీకరించినట్లే బోదలేర్, ఆస్కార్ వైల్డ్ లు కూడా అంగీకరించారు. మార్క్స్కు, బోదలేర్, వైల్డ్లకున్న తేడా అందరూ ఎరిగినదే. బాల్జాక్ వ్యతిరేకమైన భావాలున్న ఇద్దరి నుండీ ఒకే రచనచే మెప్పుపొందాడు. నాకు తెల్సిన ఒక మార్క్సిస్టు రచయిత ఇదే విధంగా "బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' నాకూ నచ్చుతుంది. అచంట జానకీరాం (భావవాది కావ్యనికుడు) కూ నచ్చుతుంది" అని ఆశ్చర్యంగా అనడం విన్నాను. కారణాలు ఎవరికి వారు విశ్లేషించు కోవడం మంచిది.

## ఉత్పాదకత - వినియోగత

వ్యక్తి ఉత్పత్తి చేయడానికి, తాను ఉత్పాదక క్రియలో ఆర్జించిన శక్తుల్ని ఉత్పత్తి సాధనాల్ని వెచ్చిస్తాడు. కనుక వ్యక్తి ఉత్పాదకుడుగా వీటిని వినియోగిస్తాడు. ఉత్పత్తి చేయబడ్డవస్తువు లేకుండా ఎవరైనా వినియోగించటం అసాధ్యం కనక ఉత్పాదకత (Production) వస్తువును ఉత్పత్తి చేసి వినియోగదారుకిస్తుంది. ఈ విషయాన్ని మార్క్స్ తన క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ గ్రంథ ఉపోద్ఘాతంలో చర్చిస్తాడు.

ఉత్పత్తి వస్తువును వినియోగించే పద్ధతి (mode) ని కూడా నిర్ణయిస్తుంది.

"ఉత్పత్తి చెయ్యబడ్డ వస్తువు సాధారణమైనది కాదు (General), అది ఒక విశేషమైన (Particular) వస్తువు- కనుక ఆ వస్తువును ఉత్పాదకత నిర్ణయించిన రీతిలో మాత్రమే వినియోగించుకోగలం."14 దీన్నిబట్టి ఉత్పత్తి వస్తువును సరఫరా చెయ్యడంతో పాటుగా వస్తువును ఎలా వినియోగించేది కూడా నిర్ణయిస్తుందని తెలుస్తుంది.

ఉత్పాదకత తాను ఉత్పత్తి చేసే వస్తువును వినియోగించడానికి అవసరమైన వినియోగదారుణ్ని కూడా సృష్టించుకుంటుంది.

"కళలకు, సాహిత్యానికి చెందిన ఉత్పత్తులు కళాభిరుచి వున్న పాఠకుల్ని, అందాన్ని ఆనందించగల పాఠకుల్ని సృష్టించుకుంటాయి- ఇది ఏ ఉత్పత్తికైనా అన్వయిస్తుంది. ఉత్పాదకత అందువల్ల విషయికి విషయాన్ని సృష్టించడంతో పాటు విషయానికి విషయిని కూడా సృష్టించుకుంటుంది"15అని మార్క్స్ రాశాడు.

దీన్నిబట్టి ఏం తెలుస్తుందంటే రచయిత తన రచనను ఉత్పత్తి చేస్తేతప్ప ఆ రచనను అర్థంచేసుకోగల, ఆనందించగల పాఠకులు సిద్ధంకారు.

ప్రజల స్థాయినిబట్టి కవిత్వం రాయమనడం ఎంత మోసమో దీన్నిబట్టి తెలుస్తుంది. సినిమా నిర్మాతల్ని దర్శకుల్ని అడిగినా ఇదే సమాధానం ఇస్తారు- ప్రజలు వాంఛిస్తున్నారు కనక మేం ఈ సినిమాలు నిర్మిస్తున్నామని. వ్యాపార రచయితలు కూడా అదే చెప్తారు. అయితే అభ్యుదయ రచయితలు, విప్లవ రచయితలు కూడా అదే విధంగా సమాధానమివ్వడం ఆశ్చర్యంగా వుంది: ప్రజల భౌతిక అవసరాలు, వారి జ్ఞాన స్థాయిని బట్టి రచన ఉండాలని వారు సిద్ధాంతీకరించడం అందరూ ఎరిగినదే.

విప్లవ రచనకైనా, ఆధునిక క్లిష్టరచనలకైనా ముందే అమూర్తంగా ఎక్కడో పాఠకులుండరు. రచనలు ప్రజల్లోకి వెళ్ళిన పిదప ఆ రచనలు తమని అర్థంచేసుకోగల పాఠకవర్గాన్ని సృష్టించుకుంటాయి. కనక అస్పష్టమైన (obsecure) ప్రయోగ రచనలు ఏ కొద్దిమంది కోసమోనని నిరసించేవాళ్ళు పాఠకుల్ని అజ్ఞానంలో వుంచడానికి మాత్రమే తోడ్పడతారు. అయితే మార్క్స్ ప్రకారం రచనల్ని అందించడం మాత్రమే కాక, వాటిని పాఠకులు ఎలా ఆనందించాలో కూడా రచయిత నిర్ణయించాలి- తన రచన ద్వారా.

భావాలు పరివారం కాగానే సరిపోదు. వారికి భావాలు మాత్రం తెలుస్తాయి- ఆ రచనలు చదివింతర్వాత. అదే రచన సరియైన రూపం (రీతి) (form) తో వున్నట్లయితే పాఠకులకు భావాల్ని తెలియజెయ్యడంతోపాటు నూతన గ్రహణశక్తిని కూడా కల్గిస్తుంది. దానివల్ల పాఠకుడిలో జిజ్ఞాస పెరుగుతుంది. రచన (content) విషయానికి తగిన రీతిని కల్గివున్నప్పుడే పాఠకులను పరిభావితం చేస్తుంది. ఆ రచన తన పాఠకుడిని తానే ఉత్పత్తి చేసుకుంటుంది రీతి వాదానికి జడిసి ఏరీతీ లేకుండా రచించడం సాగిస్తున్నారు ఈనాటి రచయితలు

కొత్త భావాలు పాఠకుడి జీవితంలో ప్రవేశించిన పిదప ఆభావాల్ని ఇంద్రియాలతో గ్రహించే శక్తి లేనినాడు ఆ నూత్న భావాల్ని ఎలా జీర్ణించుకోవాలో తెలీక ఉదాసీనుడుగా మారతాడు. వుత్త భావాలు మాత్రమే మనిషిని క్రియా శీలుణ్ని చెయ్యలేవు. పాఠకుడ్ని బలంగా పరిభావితం చెయ్యగలిగే విధంగా రచించబడ్డ రచనలే అతన్ని క్రియా శీలుణ్ని చేస్తాయి. కనుక రచనకు రీతి (Form) ఎంత అవసరమో తెలుస్తుంది. ఈ రీతి రచనను ఆనందించేవిధాన్ని నిర్ణయిస్తుంది (మార్క్స్) దీన్ని బట్టి ఏ రచనైనా పాఠకుల్ని తయారుచేసుకుని, ఆ పాఠకుల చైతన్య స్థాయిని పెంచుతుందని ధృవీకరించవచ్చు.

పాఠకుడిలో ఆ రచనను ఆనందించాలనే కోరిక ఆ రచనే కల్గిస్తుంది ప్రజల స్థాయిని బట్టి రచించాలనే అభిప్రాయం మార్క్సిస్టు రచనల్లో లేనప్పటికీ మార్క్సిస్టు వర్గాల్లో మాత్రం ఎంతో ప్రాచుర్యంలో వుంది.

ఈ సూత్రాన్ని వ్యాపార రచనలకైనా అన్వయించ వచ్చు. కారణం అవైనా ఉత్పత్తి చెయ్యబడ్డ తర్వాతే పాఠకుల్ని సృష్టించుకుంటాయి. వ్యాపార రచనలనానందించే పాఠకులు ముందే ఎక్కడా సిద్ధంగా వుండరు. ఆ రచనలే వాళ్లను అలా సంస్కార హీనులుగా మార్చేది. కనక పాఠకులపైనే మొత్తం నింద మోపడం తప్పు. రచయిత తన అభిప్రాయాల్ని వ్యక్త పరిచే రచన పాఠకుని చైతన్యస్థాయిని పెంచడం ద్వారా పాఠకుడిని గతంలోకన్నా మెరుగు పరుస్తుంది. ఈ చైతన్య వంతుడైన పాఠకుడు తన నూత్న భావాలతో, గ్రహణశక్తితో తిరిగి రచయితను పరిభావితం చేస్తాడు దానివల్ల రచయిత తనకు పాఠకులున్నారన్న నమ్మకంతో ఉత్సాహంగా రచించడానికి పూనుకుంటాడు. ఎందువల్లనంటే పాఠకులు లేకుండా రచనలుండడం అసాధ్యం. రచనల్ని పాఠకులు గ్రాహ్యం చేసుకున్నప్పుడే ఆ రచ

నలకు సార్థకత లభిస్తుంది. కనక ఈ క్రమంలో ప్రాథమికంగా రచయితలు పాఠకులను ప్రభావితం చేయడం ద్వారా, తిరిగి పాఠకుల్ని తమని ప్రభావితం చేయగల స్థాయికి తీసుకువెళ్తారు.

దీన్నిబట్టి రచయిత, పాఠకుడు ఇద్దరికీ విడదీయలేనంత సంబంధం వున్నదనేది స్పష్టమౌతుంది.

(ఇంకా వున్నది)

– సురేంద్రరాజు

NOTES :

6. "As the ancient peoples went through their Pre-history in imagination, in mythology, So we Germans have gone through our post-history in thought in philosophy."

(Introduction to 'A contribution to the critique of Hegel's Philosophy of Right, - from Collected Works Vol, 3 1975, Page No. 180)

7. "The real living germ of the german nation has grown so far only inside its craniu n In a Word - you cannot supersede philosophy without making it a reality."

(Ibid P. 181)

8 "The reform of consciousness exists merely in the fact that one makes the world aware of its consciousness that one awakens the world out of its own dream, that one explains to the world its own acts"... "It will be evident then. that the world has long dreamed of something of which it only has to become conscious in order to posseses it in actuality. It will be evident that there is not a big blank between the past and the future but rather that it is a matter of realizing the thoughts of the past."

(In his letter to Arnold Ruge - May 1843 from Writings of Young Marx - P 214-215)

9. "A spider conducts operations that resemble tho e of a weaver and a bee puts to shame many an architect in the construction of her cells. But what distinguishes the wo st architect from the best of bees is this, that the architect raises his structure in imagination before he erects it in

reality. At the end of every labour process, we get a result that already existed in the imagination of the labourer at its commencement." (Karl Marx: Capital - Vol. I - Page 178 Progress Publishers, Moscow, 1954)

10. "Just as therefore, at an earlier period, a section of the nobility went over to the bourgeoisie, so now a portion of the bourgeoisie goes over to the proletariat and in particular, a portion of the bourgeois ideologists, who have raised themselves to the level of comprehending theoretically the historical movement as a whole." (Communist Manifesto Page 57 - Progress Publishers, Moscow, 1973)

11. "The unequal development of material Production and eg, that of art. The concept of Progress is on the whole not to be understood in the usual abstract form: Modern art etc"

(Introduction to the contribution to the critique of Political economy Page No.215; Progress Publishes, Moscow, 1970)

12 "This conception appears to be an inevitable development" (Ibid) Page No. 215).

13. "It opens the way to the illusion of the french in the eighteenth century which has been so beautifully satirised by Lessing. Because we are further ahead than the ancients in mechanics, etc, why should not we be able to make an epitor? And the Herniade in place of the Iliad.'

(Karl Marx; theories of Surplus Value Vol. I Page 285, Progress Publishers Moscow, 1963).

14. "For one thing, the object is not simply an object in general but a Particular object which must be consumed in a Particular way, away determined by Production"

(Marx - Introduction to the critique of Political economy; Page 197; Progress Publishes, Moscow 1970).

15. "An object of Art creates a public that has artistic taste and is able to enjoy beauty - and the same can be said of any other product, production accordingly produces not only an object for the subject, but also a subject for object"

(Ibid P. 197;)

# ప్రేమ్‌చంద్‌కి కాలదోషం పట్టిందా?

— అమృత్‌రాయ్

మహా అయితే సంఘ సంస్కరణ పరంగానో సాంఘిక ప్రచారరూపంలోనో, కథలు చెప్పాడేమోగాని రాయలేదనీ, చదునుగానూ సమాంతరంగానూ ఏకముఖంగానూ తప్ప మనస్తత్వం లోతుకు దిగి మానవస్వభావ సంక్లిష్టతను ప్రదర్శించలేదనీ "ఆధునికులు" కొందరిప్పుడు ప్రేమ్‌చంద్‌కు కాలదోషం పట్టిందని అంటున్నారు. ఆధునిక కథానిక ప్రేమ్‌చంద్‌ను దాటుకుని చాలా ముందుకు వెళ్ళిందట కూడా. వాస్తవాన్ని నిరూపించడంలో ప్రేమ్‌చంద్‌లో లేని లోతూపాతూ, సృజనాత్మకతా ఆధునిక కథానికలు సంతరించుకో గలిగాయట. ఇలాంటి విమర్శకు యిది మొదలేమీ కాదు. తాను బతికున్న రోజుల్లోనే మేధావంతమైన యిలాంటి దాడిని ఆయన ఎదుర్కొన్నాడు. కళ అన్నదల్లా ప్రచారమేనని బల్లగుద్ది చెప్పడానికి ఇదే కారణమేమో : సౌందర్య స్పర్శలేని దేదైనా ప్రచారం కావచ్చుగాని, ఆ స్పర్శవున్నదల్లా కళే నన్నాడు ప్రేమ్‌చంద్. నీతిశాస్త్రానికీ సాహిత్యానికీ ధర్మం ఒకటే అయినా దాని ప్రకటనా పద్ధతులు వేర్వేరన్నాడు. సాహిత్యం మానవభావోద్రేకాలతోనూ మనస్తత్వ స్థితిగతులతోనూ సంబంధం గలిగిన, గాఢమైన అనుభూతిపరమైన, సౌందర్య దృష్టి గల జీవనధర్మ ప్రచారమేనన్నాడు ఇందువల్లనే రచయితకు వికారమంటే మంట. నీచమైనదాన్ని కంటగించుకుంటాడు. మానవత్వం తొణికిసలాడని దాన్ని నిరాదరిస్తాడు సత్యానికీ సౌందర్యానికీ చేరువజేస్తున్నదా లేదా అనేదొక్కటే మంచి రచనకు ఒకేఒక గీటురాయి అని చెప్పాడు. హృదయానుభూతి లేకుండా, నువ్వెంత వేదాంతమైనా రాయి, అది సాహిత్యం కాలేదన్నాడు. ఏదైనాసరే, పాఠకుల మనోభావాలను కదిలించగలగాలి.

ఉన్నతవర్గాల కళాదృక్పథం అప్పట్లో సంప్రదాయ పరంగానూ, కన్నెత్తి జనాన్ని చూడని వ్యక్తివాదుల కళాదృక్పథం ఇప్పట్లో ఆధునికత పరంగానూ, ప్రేమ్‌చంద్‌ను విమర్శించబూనడానికి కారణం, ఆయన ప్రజాకోటితో భావపరంగా మమేకం కావడమే. బౌద్ధిక, కళాత్మక విషయాలకు సాదాసీదాజనం చాలా దిగువనే వుంటారని తలకు కళ్ళు మొలిచివున్న నేటి బుద్ధిసంపన్నతా వాదుల అహంభావం.

ప్రేమ్‌చంద్ సామాన్యుల్లో సామాన్యుడు, వారిలో ఒకడుగా వారికోసం రాశాడు. వాళ్ళంటే ఈసడింపో ఏవగింపో లేదు. జనంతో ప్రేమ్‌చంద్‌కుగల భావ బాంధవ్యమే ఆయన రచనలకంత పటుత్వాన్నిచ్చింది; ప్రజారంజకతనూ సమకూ

ర్పింది. గత ఏభై ఏళ్ళలో అది పెరుగుదలే చూపుతూందిగాని తరుగుదలని కాదు. రొచ్చుగుంట గత్తు కంపు 'సాహిత్యం' చదివేవాళ్ళు కాదు ఆయన పాఠకులు; "సీరియస్" రచనలు చదివేవాళ్లు. అధునిక ప్రామాణిక రచయిత అయినందు చేతనా యీ ప్రసిద్ధి? కాదు. సజీవ ప్రామాణిక రచనలు గనకనే సజీవం అంటే? నేటికీ పనికివచ్చేది. అతని రచనలవస్తువు ఇంకా దేశజీవితం నుంచి అదృశ్యం కాలేదు– ఏవో చిల్లర విషయాలు కొన్నితప్ప "చలికాలపు రాత్రి". "పీనుగ కప్పుబట్ట",వంటి కథానికల్లో కనిపించే కటిక పేదరికం, బీదాబిక్కీ గోడూ ఘోషా, పల్లెల్లో కామందుల పొన్నుకర్ర పెత్తనం, వడ్డీవ్యాపారుల కసాయితనం, పట్వారీల జిత్తులూ, యివన్నీ ఒకవ్యవస్థ విశేషాలు. అవి రూపం మార్చుకున్నాయేమోగాని, స్వభావం నిలబెట్టుకునే వున్నాయి. సన్నకారురైతు గరీబౌతున్నాడు; ఇల్లూ వూరూవదిలి బస్తీకివెళ్లి రెండు చేతుల సత్తువే ఆస్తిగా శ్రామికుడౌతున్నాడు, మార్కెట్ దినుసౌతున్నాడు, ఇంటి నౌకరౌతున్నాడు. లేదా పరిశ్రమల కార్మికుడౌతున్నాడు. కాని, అతని చూపూ తలపూ పుట్టిపెరిగిన వూరి పొలంమీదే. ఒకప్పుడది తన సొంతం. దాన్ని తాను నిలబెట్టుకో లేకపోయాడు. "బలిదాన్" కథ తార్కాణ. "గోదాన్" నవల వుదాహరణ.

ఆ వ్యవస్థ భావజాలంలో మూఢ విశ్వాసాలు, మంత్ర తంత్రాలు గ్రామీణుల మనస్సుల నెలా పరిపాలిస్తాయో "వరదాన్" నవలిక చూపెడుతుంది. బాల్యంలో వితంతువై క్రూర సాంఘిక నియమాలవల్ల యావజ్జీవం అలాగే గడిపే అబలా జీవి తాన్ని "ప్రతిజ్ఞ"లో చూడవచ్చు. ముక్కుపచ్చలారని పసిపిల్ల పండుముసలి భార్యై పడేక్షోభకు "నిర్మల" సాక్ష్యం, సాంఘికమైన వెనకబాటుతనం వల్ల పచ్చి అక్రమం వల్ల యువతులు మార్గాంతరం లేక సానికొంపల్లోకి ఎలా పోవలసివస్తుందో "సేవాసదన్" లోని సుమన్ పాత్ర ప్రదర్శిస్తుంది. సొంత భూమినుంచి రైతుని గెంటివేసి అక్కడ ఫాక్టర్ నిర్మించినప్పుడు జరిగిన బ్రహ్మాండమైన పోరాటాన్ని "రంగభూమి" లోని సూర్‌దాస్ పాత్ర నిరూపిస్తుంది. కాబట్టి యీ స్థితిగతులు మౌలికంగా మారిపోని ఈనాడూ ప్రేమ్‌చంద్ రచనలకు చెదబుపట్టలేదు

"కాయకల్ప" (1926) నవలలో ప్రేమ్‌చంద్ చూపదలచింది జన్మ,పునర్జన్మల విషయం కాదు. స్వార్థరహితులుగా కనిపించిన కాంగ్రెసు వాదులు శాసనమండలుల్లో ప్రవేశించి రాజకీయ అధికారానికి వచ్చాక ఎలా దురాశాపరులై పోతారో చూపాడంతే. ఇది ఈనాడూ లేదా? "ఉప్పు ఇనస్పెక్టరు" కథలోని లంచగొండితనం మటుమాయమై పోయిందా? తాహతుకుమించిన ఆడంబరాలకోసం ఆరాటపడే భార్యల సంతృప్తికోసం

ప్రజాధనాన్ని అపహరించే రకాలు "గబన్" నవలలోనేనా- నేటి జీవితంలోనూ ఎదురుకావడం లేదా? తాను రచన మొదలెట్టినప్పుడు ఒక దేవాలయాధికారి- మహంతు మదిరతో మదపతులతో ఎలా జల్సాచేసిందీ "దేవుడి గుడిగుళ్లు" నవల చూపెట్టింది. ఈ గంజాయి మొక్క వనమైందా లేదా ఇప్పుడు?

ఇదంతా ఏకరూ పెట్టడ మెందుకనంటే, ప్రేమ్‌చంద్ చైతన్యవంతుడైన నిబద్ధతగల రచయితగా తన దేశకాలపరిస్థితులకు స్పందించి మాత్రమే రచనలు చేశాడనేందుకే. ఆయన పాత్రలు కొయ్యబొమ్మలో యినపబొమ్మలో కావు- రక్తమాంసాలు గల మనుషుల మచ్చుముక్కలు. ఆయన యితివృత్తాలను అందించింది ఊహో కల్పనో కాదు, నిజమైన బతుకే.

కథ రాశాడా లేక, చెప్పాడా అని అడుగుతున్న ప్రబుద్ధులకు- అంటే ఆయన రచనారీతిని తప్పెన్నే విమర్శకులకు- చెప్పవలసిన ముక్క ఒకటుంది: ముప్పై యేళ్ళపాటు రాశాడు; అనేకానేక విషయాల గురించి రాశాడు: సాహసంతో ప్రేమ కథలూ నిగూఢాత్మక కథలూ మొదలు, రాజకుమారులూ రాజకుమార్తెలూ యోగులూ సాధువులూ అద్భుతాలూ మొదలు, పోనుపోను సాదాజీవితానికి చెందిన ఆణిముత్యాల్లా స్వచ్ఛమైన కథలు ఎన్నో! ఇతివృత్తబలం వున్నవీ కథాపటుత్వం వున్నవీ, పాత్రల వైవిధ్యం వున్నవీ- ఎన్నిరకాలో! మేలైన ప్రేమ్‌చంద్ కథల గుణం యేమిటంటే, చాలా కొద్దిపాటి యితివృత్తం వుండటం అనవచ్చు. ఎంతో కొంత కథాంశవుంటుంది. ఈ నిర్మితిని సాధించే మనస్తత్వ వాస్తవం కాస్తోకూస్తో తప్పదు. లేకుంటే రచయిత పాఠకుణ్ని తనతో తీసుకెళ్ళడం కష్టం. ఇదే ప్రేమ్‌చంద్‌కు అవలీల.

ప్రజాజీవితంతో ప్రేమ్‌చంద్‌కు వుండిన సంబంధం ఒక పరిచయం లాంటిది కాదు. అది ప్రాణవంతమైనది, అంచేతే క్రియాశీలమైనది. తన జనంతోపాటు తానూ పెరిగాడు. భావాలు ఎదుగుతూ వచ్చాయి. వందేమాతరం ఉద్యమాన్ని, టెర్రరిస్టు వుద్యమాన్ని మొదట మొదట అభిమానించి, యింటి గోడకు ఖుదీరాం బోస్ పటం తగిలించుకున్నాడు. సాంఘిక సంస్కరణకంటె ముందుగా రాజకీయ స్వాతంత్ర్యమే కావాలనే అతివాదులు అప్పట్లో ఆయనకు నచ్చారు. వారి గురించి వ్యాసాలు కొన్ని రాశాడు. 'సోజ్-యె-వతన్' లోని కథల్లో యీ ఛాయలున్నాయి గనక ప్రభుత్వం దాన్ని నిషేధించింది. గారిబాల్డీ, మేజినీల జీవిత చరిత్రలు రాశాడు. అయితే యిది వ్యక్తులకే పరిమితమై జనసామాన్యాన్ని చేరుకోలేకపోయిన వుద్యమం గనక, కాంగ్రెసులో 'గరంమదళ్' అనబడే తిలక్, లజపత్‌రాయ్, బిపిన్‌చంద్రపాల్

ధైర్యాన్ని మెచ్చాడు. ముఖ్యంగా తిలక్ అంటే చాలా గౌరవం. అట్లని గోఖలేని తక్కువ చెయ్యలేదు, గోఖలే రాజకీయం తన మనస్సుకెక్కకపోయినా సరే. 'అతివాద' నాయకులు ప్రభుత్వ నిర్బంధాల పాలయ్యాక, "ఆర్యసమాజ్" వారి సంఘసంస్కరణోద్యమం వైపు చూపు మళ్లించాడు. రెనడే గారి సంఘ సంస్కరణ సమితినీ అభిమానించాడు. విధవా పునర్వివాహాలను సమర్థిస్తూ 1907 లో "ప్రేమా" నవల రాయడం ఈ ప్రభావాల ఫలితంగానే, అయితే ఆర్యసమాజ్ వారి ముస్లిం వ్యతిరేక వైఖరులు ససేమిరా తనకు నచ్చలేదు. "శుద్ధి"తంతుని తాను మెచ్చలేదు. గాంధీశకం వచ్చాక, సత్యాగ్రహోద్యమాలు పల్లెపట్లకు పాకాక, కొంతమేరకు గాంధీ భావాలతో తనకు కలిసింది. ముఖ్యంగా హృదయ పరివర్తనం గురించి గాంధీ సూత్రం దీన్ని టాల్స్టాయి నుంచే గ్రహించాడేమో? టాల్స్టాయి నీతి కథలను గాంధీ గుజరాత్‌లోకి తర్జుమా చేసే రోజుల్లోనే తాను హిందీలోకి తెచ్చాడు. కాని, స్వరాజ్యం గురించి గాంధీగారి నీశ్యనములుడు ధోరణి తనకు సరిపడిందికాదు. గాంధీగారి "రామరాజ్యం" తనకు తృప్తినివ్వదు. స్వాతంత్ర్యం పొందడానికి ప్రజలు కదలాలి నీదేపార్టీ అన్నప్పుడు ఏదీకాదని, ప్రజల్ని విద్యావంతుల్ని చెయ్యగల పార్టీ ఒకటి పుట్టుకొస్తే అదే తనదౌతుందని అన్నాడు ప్రేమ్‌చంద్. దేశపరిపాలన మొత్తంగా ప్రజలకు సంక్రమించినప్పుడే అది స్వరాజ్యమౌతుందని ప్రజలనుంచి ఎన్నికైన ప్రతినిధులు పరిపాలన సాగించవచ్చునని. ప్రజలను పసరాల్లాచూడక పన్నుల భారంతో వెన్ను పూసలు విరచక సైన్యాన్ని పెంచక తమజీతాల్ని హెచ్చించుకోక ప్రజల జీవితావసరాలకు ప్రాముఖ్యమిచ్చేదే స్వరాజ్యమనీ రాశాడు. ఇది అప్పట్లో జరిగేదేనా? తాను సమకాలం కంటె ముందడుగు వేస్తున్నాడు, భవిష్యత్తు పరదాలు తొలగించి చూస్తున్నాడు. ధనికులూ విద్యావంతులూ జనాన్ని అజ్ఞానంలో నిలిపి వుంచారని, స్వరాజ్యోద్యమ నాయకుల్లో చాలామంది అడ్వోకేట్లూ భూస్వాములేననీ. వీరికి జనమంటే దయాదాక్షిణ్యాలు లేవనీ రాశాడు. కొన్ని కోట్లమంది రైతులున్న దేశంలో కిసాన్ సభలుగానీ రైతాంగం జీవితాన్ని అభివృద్ధిపరిచేందుకు ఆందోళనగానీ, వ్యావసాయిక విద్యాలయాలుగానీ లేకపోవడం చూసి సిగ్గేస్తుందన్నాడు. "రాబోయేయుగం రైతుదీ కార్మికుడిదీ." జనం కొద్దికాలంలో నోరెత్తి తమ హక్కులకోసం నిలిచి గద్దించి అడగబోతారు; తమ భవితవ్యానికి తామే కర్తలు కాబోతారు. పైకి కనిపించే జడత్వాన్ని చూచి మోసపోవద్దు. రష్యన్ ప్రజలలో అంతటి శక్తి గుప్తంగా వుండిందని విప్లవం రాకా ఎవరికి తెలిసింది?" (1919) ఒక సంవత్సర కాలం ముందే మొదలెట్టిన "ప్రేమాశ్రమ్" లోనూ రష్యన్ విప్లవ ప్రస్తావనేగాక బల్గేరియా విప్లవ ప్రస్తావనా

వుంది. రష్యా రైతుల రాజ్యమని ప్రేమ్‌చంద్ అనుకున్నాడు. "ఇప్పుడు నేను దాదాపు బోల్షివిక్ సిద్ధాంతాలను నమ్ముతున్నాను" అని 1919లో ఒక స్నేహితుడికి జవాబుగా రాశాడు. తాను బోల్షివిక్ నైనానని కాదు, కార్మికులూ రైతులూ మరేమాత్రం బాధపడగూడదని, ధనికుల దోపిడీ అంతం కావాలనీ, రష్యన్ విప్లవం యీపనిచేసింది గనక దాన్ని తాను అభినందిస్తున్నాననీ మాత్రమే అర్థం.

"పెట్టుబడిదారీ నాగరికత" (మహాజనీ సభ్యతా) అనే వ్యాసంలోనూ, 'మంగళ సూత్ర' అనే అసంపూర్ణమైన నవలలోనూ సోవియట్ వ్యవస్థగురించిరాస్తూ, పెట్టుబడిదార్లు దాన్ని వికృతంచేసి జనానికి చూపి మోసగిస్తారని, అయితే నిజమనేది ఏదో రోజున బయల్పడి గెలుపొందుతుందని "మహాజనీ సభ్యత"లో అంటే, "మంగళ సూత్ర" నవలలో, గాంధీ మతంపట్ల తనకుండిన గౌరవ భావానికి చివరగా స్వస్తి చెప్పాడు. "మత ధర్మాన్నీ నీతి సూత్రాల్నీ ఆధారం చేసుకుని యీ ప్రపంచం నడుస్తూందని భావించే దేవదూతలు కొందరెప్పుడూ వుంటూ వుంటారు. తమ జీవితాలను త్యాగం చేస్తారు. ఈలోకాన్నే వదిలివెడుతారు. అయితే వీరిని "దేవదూతలు" అనడమెందుకు? పిరికిపందలను, స్వార్థపరాయణులను. న్యాయంకోసం పోరాడుతూ ప్రాణదానం చేసేవాడే దేవదూత." ఇదంతా తెలిసీ, తెలియనట్టు నటించేవాడు, నిజమైన మతానికి అసలుశత్రువు. "ఈ ప్రపంచంలో దేవదూతలంటూ ఎందుకు? దేవుడి గురించీ పూజా పురస్కారాల గురించీ కట్టుకథలు ప్రచారంచేసింది మరెవరోకాదు, వీరే. వీరే లేకుంటే, మనిషి ఈపాటికి యీ అనర్థాల నన్నిటినీ తుద ముట్టించి వుండేవాడు, లేదా ఈ పరిస్థితుల్లో బతికేకంటె ఎంతోమేలైవుండే యీసమాజాన్నే అంతమొందించి వుండేవాడు. మనుషుల్లో మనిషిగా ఎవ్వడూ వుండలేడు. క్రూరమృగాల మధ్యవుంటూ వుండి, ఎవడికి వాడు సాయుధుడు కావాలి. వాళ్ల తుది గోళ్లతో నిన్ను చీల్చి వేస్తూంటే వూరకుండి పోవడం దేవతాగుణం కాదు, మూర్ఖుడి గుణం". కర్తవ్యబోధ అంటే ఇదే. భవిష్యద్దర్శనం ఇదే అందుకే నేటికీ ప్రేమ్‌చంద్ రచనలతో ఈ సమాజానికి అవసరం వుంది.

---

* "ఇప్పుడు నేను బోల్షివిజం సూత్రాలు దాదాపు సంపూర్ణంగా అంగీకరించాను"
(17–12–1919) మిత్రుడు నిగమ్‌కు రాసిన ఉత్తరం నుంచి

* "నేను కమ్యూనిస్టును– నా కమ్యూనిజానికి మామూలు అర్థం ఏమిటంటే రైతాంగాన్ని దోపిడీ చేస్తున్న పెట్టుబడిదారులూ భూస్వాములూ లేకుండా పోవడమే"
— ప్రేమ్‌చంద్

## ప్రేంచంద్ - హెూరా'హెూరీ'

సత్యం

"రాబోయేకాలం ఇక కర్షకులదీ కార్మికులది అని ప్రపంచపువేగమే సాక్ష్యం చెపుతూంది. ఈ ప్రభంజనపు ప్రభావాన్నుండి ఉత్తుంగ హిమాలయ శిఖరాలు కూడా భారత దేశాన్ని కాపాడలేవు. వెనుకముందులుగా, బహుశ త్వరలోనే, ప్రజలు తమ అధికారాలు హక్కుల గురించి ప్రలాపించడమే కాదు, నిలదీసి అడగటం చూస్తాం. అప్పుడు ( ధనస్వాములైన ) మీ అందరి అదృష్టాలకు వారు యజమానులౌతారు, అప్పుడు మీకుమీరుచేసిన దురన్యాయాలన్నీ తలపుకు వస్తాయి, మీరు చేతులు నలుపు కుంటూ నిలబడతారు".

ఈ మాటలన్నది అతివాదులూ మార్క్సిస్టులూ కాదు, ఆదర్శవాదం నుండి వాస్తవవాదం వైపు ప్రయాణంచేసే దశలో ఉన్న ఒక రచయిత అన్న మాటలు. అప్పటికింకా గట్టి నిబద్ధతకూడా లేదు. ఆ మాటకొస్తే అసలు ఏ రాజకీయపార్టీతోనూ సంబంధం లేనివాడని పండిట్ మాఖన్‌లాల్ చతుర్వేది ('అమీర్ - ఇరాదే- గరీబ్ ఇరాదే' పుట 118) అన్నాడు. అక్టోబర్ విప్లవానికి ఒక సంవత్సరం తరువాత ఫిబ్రవరి 1919లో "జమానా" అనే పత్రికలో పురానా జమానా- నయా జమానా పేర రాసిన వ్యాసంలోనివీ మాటలు. రచయిత మున్షీ ప్రేంచంద్ పేర ప్రసిద్ధిపొందిన ధనపత్ రాయ్ శ్రీవాస్తవ్.

రెండు ప్రపంచయుద్ధాల మధ్య కాలఖండాన్ని హిందీ సాహిత్య చరిత్రలో "ప్రేంచంద్ యుగము"ని అంటారు నానాటికీ భయంకర రూపం దాలుస్తున్న సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఆసియా ప్రజలు జరిపే పోరాటాలు తీవ్రతరమౌతున్న యుగం. ముఖ్యంగా భారతీయులు స్వాతంత్ర్యాన్ని సాధించడంకోసం తిరుగుబాటు మార్గాన్ననుసరిస్తున్న రోజులు. ధనస్వామ్యానికి, సామ్రాజ్యవాదానికి నూకలు చెల్లినయని చెప్పిన యుగమిది.

ప్రేంచంద్ తన ఇరవై మూడవ యేట (1903) రచన చేయడం ఆరంభించాడు. అప్పటికి హిందీ నవల వయస్సు ఇరవయ్యొక్క సంవత్సరాలు[1], అంత

1. ఆచార్య రాంచంద్ర శుక్ల అభిప్రాయం ప్రకారం హిందీలో రాయబడిన మొదటి నవల శ్రీ శ్రీనివాసదాస్ రాసిన "పరీక్షా గురు", (1882) మరికొంత మంది చరిత్రకారులు శ్రీ శ్రద్ధారాం ఫిల్లోరీ 1877 లో రాసిన "భాగ్యవతి" ని మొదటి నవలగా పరిగణిస్తారు.

కాలంలోనూ ఉత్పత్తి అయినవి చాలా మేరకు మూఢాచారాలను, సాంప్రదాయికతను, మతాచారాలను పైకెత్తే రచనలు, హీనసంస్కారాన్ని ప్రకోపింపజేసే లైంగిక, అపరాధ పరిశోధన నవలలు. ఉర్దూ సాహిత్యంలో ఇంత విచారకరంగాలేదు పరిస్థితి. నజీర్ అహ్మద్‌తో మొదలైన ఉర్దూనవల రతన్‌నాథ్ సర్‌షార్, అబ్దుల్ హలీం షరర్‌ల నుండి మిర్జామహమ్మద్ హాదీరుస్వా నాటికి కొంత వాస్తవికతను సంతరించు కొన్నది. సామాజిక జీవితం వస్తువైంది.

ఈ రెండు సాహిత్యాలకు జీవం, జవం కలిగించినవాడు ప్రేంచంద్. జాతి జీవనానికి అతిముఖ్యుడైనా పూర్తిగా నిర్లక్ష్యపరచబడ్డవాడు రైతు. "కర్షక కార్మికు లను చారిత్రిక సంఘర్షణల నుండి వేరుచేయలేము, వారే సమకాలీన సమాజానికి అసలైన ప్రతినిధులు. జీవితాన్ని తత్సంఘర్షణలోని కరుణను వాస్తవంగా ప్రతిబిం బించాలంటే రచయిత వారిని గురించే రాయాలి"[2] అందుకే ఈయన సాంప్రదాయిక పద్ధతిని తిరస్కరించి "గోదాన్"లో అతిసామాన్య ముసలి రైతును నాయకస్థానంలో ప్రతిష్ఠించాడు. "గోదాన్"తో ప్రేంచంద్ హిందీ ఉర్దూ సాహిత్యాలకొక ఆరోగ్య కరమైన కొత్తమలుపు నిచ్చాడు; నవలకొక స్థానాన్ని కల్పించాడు.

ఒక రచయితను, అతడు తనసమకాలీన జనజీవితాన్ని దర్శించినతీరు, భవిష్య ద్దర్శనము ప్రదర్శించిన పద్ధతి, దానిపై అతని ప్రభావము. అనుగామి అగామి రచయితలపై అతని ప్రభావపుమేర, యుగకర్తనుగా నిలబెట్టడానికి నిర్ణాయకాంశాలు. ఆ లెక్కన అన్నిరంగాల్లోనూ ప్రేంచంద్ ప్రభావం గాఢముద్ర వేసింది. ఇప్పటికీ మన్మథ్‌నాథ్ గుప్త, హంసరాజ్ రహబర్, కమలేశ్వర్, రాజేంద్రయాదవ్ వంటి నవలా రచయితలు ఆయననే ఆదర్శ నవలాకారునిగా భావిస్తారు. కీ. శే. రాంగేయ్ రాఘవ్, కిషన్‌చందర్, వస్తువైవిధ్యం ఉన్నా కొంతమేరకు యశపాల్‌లు కూడా ఈయన మార్గాన్ననుసరించిన వారే. "50 సంవత్సరాల తరువాత మహారచయిత సైతం పాతబడి చరిత్ర పుటల్లో ఒరిగి విస్మృతుడౌతాడ"న్న జాన్ వేన్ అభి ప్రాయం[3] ఈయన విషయంలో తప్పైన విషయం గమనించవచ్చు.

ప్రేంచంద్ స్వభావతః ఆదర్శవాది. ఆయన తనప్రారంభ రచనల్లో కేవలం వ్యక్తిగత పరివర్తన సంస్కరణను మాత్రమే సంకేతించాడు. 1920 లో గాంధీగారి

2. Ralph Fox : 'Novel and the People' పుట 14.

3. John Waine. Poetry and the Theatre in Modern Poetry (ELBS1967) పుట 179.

ఉపన్యాసం విని ఆయన భక్తుడైనాడు. జనజీవన సంస్కరణకు నడుముకట్టాడు. ప్రజల ప్రయోజనాల రక్షణకు వారిపక్షం వహించి రచనలు చేశాడు.

"ప్రజల ప్రయోజనాలను కాపాడే సాహిత్యమే వాళ్ళ మనసులలో చోటుచేసుకుంటుంది. పదికాలాలపాటు సజీవంగా ఉండటానికి యోగ్యతను హక్కును సంపాదించుకుంటుంది"[4]. అంతర్జాతీయంగా కూడా ఇప్పుడు వర్గ ప్రయోజనం దృష్ట్యానే సాహిత్య మూల్యాంకనం జరుగుతున్నది. దీనివలన సాహిత్యం స్వభావతః వర్గరహితం అనే బూర్జువా సైద్ధాంతికుల నమ్మకం అబద్ధమైంద"న్న[5] షొలఖోవ్ అభిప్రాయం గమనార్హం. సాహిత్య మూల్యాంకనం "నిష్పక్షపాతం" (objective)గా ఉండటం ఆదర్శం మాత్రమే. ఆచరణలో సాధ్యంకాదు. ఎంతటి సమర్థుడు, సహృదయుడైన విమర్శకునికైనా స్వీయవ్యక్తిత్వాధిగమనం (transcendence of personality) అసంభవం. "నిరంజనత, నిర్వికారత, నిష్కళంకత ఇత్యాద్యభావములు మానవ ప్రకృతికిం జేరినవికావు"[6]

ప్రేంచంద్ సామాజిక స్పృహకలిగిన రచయిత. అందుకే అతడు సమకాలీన జీవిత సమస్యల్ని ప్రతిబింబించే రచనల్ని చేశాడు. హిందీ(ఉర్దూ) నవలకు ఉన్నత స్థాయిని, ప్రపంచ సాహిత్యలోకంలో గౌరవం కలిగేవిధంగా, భారతీయులందరూ గర్వించేవిధంగా సామాజిక స్పృహతో రాసిన మొదటి రచయిత ఈయన. ఈదిగువ నవలలు గమనించండి :

1 సేవాసదన్ (1918) వేశ్యా సమస్య
2 ప్రేమాశ్రమ్ (1921) రైతుల సమస్యలు
3 నిర్మల (1923) వరకట్నం – వయోతారతమ్యం వలన ఉత్పన్నమయ్యే వైవాహిక సమస్యలు
4 రంగభూమి (1924) ప్రభుత్వాధికారవర్గపు అత్యాచారాలు
5 కాయకల్ప (1928) ఆధ్యాత్మిక జీవనం
6 గబన్ (1930) మధ్య తరగతి – ఆర్థిక అసమానత
7 కర్మభూమి (1932) అస్పృశ్యులు మరియు హరిజనుల సమస్య

---

4. M. Sholokhov : At the Bidding of the Heart (Moscow 1973) పుట 191.
5. అదే–పుట 182
6. కట్టమంచి రామలింగారెడ్డి : కవిత్వ తత్త్వవిచారము పుట 29

8 గోదాన్ (1936) కర్షక కార్మికుల శోషణ సమస్య

9 మంగళసూత్ర్ అసంపూర్ణం – ఇందులో ఆధునిక రచయిత జీవిత సమస్యలను చిత్రించ సంకల్పించాడు.

సాధారణంగా రచయితలలో ఎక్కువ భాగం సమస్యను చిత్రించటం వరకే చేస్తారు. అంటే వారిదృష్టిలో సాహిత్యం జీవితానికి దర్పణం మాత్రమే. అందులో కనిపించే వికారాలకు, వికలతకు కారణాలను, కారకులను ఎత్తిచూపరు; పరిష్కారాన్ని సూచించరు. కాని ఈయన ఒక్క "నిర్మల" లో తప్ప ప్రతి నవలలోనూ తాను లోనైన గాంధీ వాదపు ఆదర్శాల దృష్ట్యా పరిష్కారం గూడా సూచించాడు. "గోదాన్"లోకూడా ఈలోపం ఉందని డా. గణపతి చంద్రగుప్త అభిప్రాయం. కాని కథానాయకుడు హోరీ విపరీతమైన ధార్మికభీతి, సహనము, ఎదురు తిరుగలేనితనము కారణంగా కష్టాలపాలైనాడు. అది తప్పనీ అతని కొడుకు గోబర్ (గోవర్ధన్) మాదిరిగా సామాజికంగా చైతన్యవంతులు కావాలనీ "ఎంతకాలమిటు సహించి ఉన్నా దోపిడిమూకకు దయరాదన్నా" అనే నిజం తెలుసుకొని మసలుకోవాలనీ సూచించాడు.

"గోదాన్" ప్రేంచంద్‌లో క్రమంగా జరిగిన రాజకీయ చైతన్య వికాసానికి పరాకాష్ఠ. అప్పటివరకూ ప్రేంచంద్ అహింస, ప్రేమ, హృదయ పరివర్తనద్వారా సామాజిక విప్లవాన్ని సాధించటం అనే విషయాలపై నమ్మకం ఉన్నవాడే. కాని నానాటికి రైతుల జీవన ప్రమాణం తరగటం, రైతులు రైతుకూలీలుగా మారటం చూసి తన విశ్వాసాల్లో తనకే నమ్మకం పోయింది. "ధర్మకర్తృత్వ భావన" భూస్వాముల్లో జాగృతం కాదనేది స్పష్టంగా తెలిసిపోయింది. అందుకే క్రమంగా గాంధీగారి ప్రభావం, ఆలోచనా ధోరణినుండి విముక్తుడైనాడు. రైతు రైతుకూలీగా దిగజారటం గాంధీవాదపు పరాజయమని విమర్శకుల భావన. ఈ నవల ప్రేంచంద్ మనోవికాసమే కాకుండా ఆనాటి యువకులలో క్రమంగా జాగృతమయే వర్గచైతన్యానికి, సామాజిక స్పృహ, తిరుగుబాటు తత్వాలకు కూడా ప్రతీక.

ప్రఖ్యాత ఉర్దూకవి ఫిరాఖ్‌గోరఖ్‌పురి తన "బజ్మెజిందగీ - రంగెషాయిరీ" పీఠికలో "దీన్ని చదివినవారు నాకవితామణిని లేదా దాని జీవతత్వాన్ని గ్రహించినట్లే" అన్నాడు. అట్లాగే ఒక్క "గోదాన్" చదివితే ప్రేంచంద్ రచనా సారాన్ని గ్రహించినట్లే.

ఈయన "సవా సేర్ గెహూఁ" అనే కథలోనే ఈ నవల బీజరూపంగా దర్శన మిస్తుంది. అందులో నూ జమీందారీ వ్యవస్థలో రైతు ఏవిధంగా శోషణలో నలుగు తాడో చిత్రించబడింది. రైతు సమస్యను అంటే భూమి సమస్యను, గ్రామీణ జీవి తాన్ని, శోషణయొక్క విశ్వరూపాన్ని ఇంత విస్తృతంగా, ఇంత సమగ్రంగా చిత్రించిన భారతీయ నవల, ఈ నవల తరువాత మరో ఆరు సంవత్సరాలకు అంటే 1942 లో ప్రచురింపబడిన తారాశంకర్ బెనర్జి "గణదేవత" తప్ప మరొకటిలేదు. తెలుగులో "మాలపల్లి" (1922). ఈ రెంటికన్నా ఈ సమస్యపై ముందు వచ్చిన నవలయేగాని "గోదాన్"లో వ్యక్తమయినంతగా "భూమి సమస్య" ఇందులోకాలేదు. వట్టికోట ఆళ్వారుస్వామి 'ప్రజల మనిషి' ( 1952–55 ) ఈ సమస్యపై రెండు దశాబ్దాల తర్వాత వచ్చిన నవల. ఇప్పుడు రావిశాస్త్రిగారి 'సొమ్ములు పోనాయండి' చెప్పుకోదగిన నవల.

"గోదాన్" గురించి ఇంకా చర్చించే ముందు స్థూలంగా కథ చూద్దాం :

"ఈ నవలకు ఇరుసు ప్రధాన పాత్ర బేలారి గ్రామ రైతు హోరీ ఇతడి జీవితయాత్రే ఈ నవల కథావస్తువు మిగతా పాత్రలు ఇతని జీవితాన్ని ప్రత్యక్షం గానో పరోక్షంగానో ప్రభావితంచేసే సామాజిక శక్తుల ప్రతినిధులు. ఇతడు రాయ్ ఉగ్రపాల్‌సింహుని గ్రామంలో ఒక అతి సామాన్య రైతు, భార్య ధనియా, కొడుకు గోబర్, ఇద్దరు బిడ్డలు సోనా రూపాలు ఇతని కుటుంబం. మూడు నాలుగు బీగాల[7] పొలం మీద వచ్చే ఫలసాయమే జీవనాధారం. సంవత్సరంలో రెండు పూటలా కడుపు నిండ తినే రోజులు బహు తక్కువ. హోరీ భయంకర రుణభారంతో నలిగి పోతున్నాడు. మాయామర్మం తెలియనివాడు. నమ్మకస్తుడు అయినా పనిబడితే ఎదుటి వాళ్లను ఉబ్బించడానికి, మోసగించడానికి వెనుకాడడు. ఇంటిముందు ఒక ఆవును కట్టేసుకోగలగాలనేదే జీవితంలో పెద్ద కోరిక. గొల్లభోలాకు రెండవ పెండ్లి సంబంధం ఖాయం చేసిపెడతానని ఆశపెట్టి అతని నుండి ఒక ఆవును తీసుకుంటాడు తమ్ముడు హీరా ఇతని అదృష్టాన్ని చూసి ఓర్వలేడు ఈ ఓర్వలేనితనంతోనే అవ కాశం చూసి విషంపెట్టి ఆవును చంపుతాడు. హోరీ కల కరిగిపోతుంది. ఈకాలం లోనే భోలా విధవ కూతురు ఝునియాతో గోబర్‌కు సంబంధం ఏర్పడుతుంది. కాని తండ్రికి భయపడి బస్తీకి పారిపోతాడు. ఇంతటితో హోరీ తన బాధల దొంతరల నెదుర్కొవడానికి ఒంటిగా మిగిలిపోతాడు. ఝునియాను ఇంట్లోఉంచుకున్న నేరానికి

7. బీగా – 3025 చ. గ.

కులపెద్దలు, మత గుత్తేదార్లు అతనికి 'కులతప్పు' విధిస్తారు. ఫలితంగా పంట అంతా వారికి నైవేద్యం అవుతుంది. భోలా తనకు జరిగిన అవమానానికి పగ తీర్చుకుంటాడు. తానిచ్చిన ఆవుకు బదులు హోరీ ఎద్దును విప్పుకపోతాడు. హోరీ పైస పైసకు కటకటపడతాడు పిల్లలకు ఒక్క పూట గంజి దొరకడమే గగనమైపోతుంది. బస్తీకి పోయిన గోబర్ కొంత డబ్బుతో ఇంటికి తిరిగివస్తాడు. ధనియాహోరీల కళ తప్పిన ముఖాలు కళకళలాడుతై. మోడువారిన జీవితంలో వసంతం వెల్లివిరిసినట్లౌతుంది కాని గోబర్ పూర్వపు అమాయక రైతు బిడ్డకాదు. మారుతున్న పరిస్థితుల స్పృహగల తెలివిగల కార్మికుడు. నానాటికి దిగజారుతున్న రైతుల జీవితస్థితిని, పెరుగుతున్న పేదరికాన్ని జమీందారు, ప్రభుత్వోద్యోగులు, వ్యాపారులు, మత గుత్తేదార్లు అనేక రకాలుగా దోపిడీ చేయడాన్ని స్పష్టంగా చూశాడు. హోరీ అమాయకత్వానికి, 'బాంచెనుదొరా' తత్వానికి విసుక్కుంటాడు. దోపిడీగాళ్ళనలే మసలే ఈలోకంలో కండ్లు తెరచి నడచుకోమని హెచ్చరిస్తాడు. కాని హోరీ తన పాతపంథాను విడిచిపెట్టడానికి ఇష్టపడడు. దాంతో గోబర్ తన భార్య ఝునియాను కొడుకును తీసుకొని బస్తీకి వెళ్ళిపోతాడు

సోనా రూపాలకు పెండ్లీడు వస్తుంది. కాని పాపం హోరీ దగ్గర పెండ్లిచేసేంత డబ్బెక్కడిది. ఉన్న ఒక్క ఆశ చెరకు పంటను శిస్తు బాకీ క్రిందకి తెచ్చి జమీందారు వేలం వేయిస్తాడు. ఏదోవిధంగా అప్పుచేసి బిడ్డ సోనా పెండ్లి చేస్తాడు. దానితో కాళ్ళ చేతులు ఆడకుండా అప్పుల వలలో పూర్తిగా చిక్కుకుంటాడు. ఎడతెగని ఓటమి అతని గుండె నిబ్బరాన్ని కుంగదీస్తుంది. వ్యవసాయం చేసుకోవడానికి ఎడ్లు లేక కూలినాలిచేసి పొట్టపోసుకోవడం మొదలుపెడ్తాడు. ఉన్న మూడు బీగాల పొలాన్ని కాజేయాలని షావుకారు పొంచి చూస్తూంటాడు. కాని హోరీ తాతలు తండ్రుల ఆ తీపి గుర్తును ఎట్టి పరిస్థితులలోను వదలడానికి సిద్ధపడడు. ప్రేంచంద్ అన్నట్లుగా ఒక ఓడిపోయిన రాజు మాదిరిగా హోరీ తనను తాను ఆ మూడు బీగాల పొలపు కోటలో ఖైదు చేసుకున్నాడు. ఉపవాసాలు చేశాడు. పరువు పోగొట్టుకున్నాడు కాని కోటను పోనివ్వలేదు. దాన్ని కాపాడుకోవటానికి తన బిడ్డ రూపను ముసలి రామ్ సేవక్‌కు రెండు వందల రూపాయల కమ్ముతాడు. తాత తండ్రుల గుర్తు దక్కుతుంది. కాని ఆవును పెంచే కోరిక తీరదు. అందుకొరకు రాత్రింబవళ్ల కూలి చేస్తాడు. కాని ఒకనాడు సలసలకాగే మధ్యాహ్నపు మంట గాడ్పులు అతని బక్క చిక్కిన శరీరాన్ని ఉఫ్ఫున ఊదేస్తవి. ఆవును పెంచాలనే మనసులోని తీరనికోరికతో

ఇంటికి వస్తూ వస్తూనే ఈ లోకాన్ని శాశ్వతంగా విడచిపోతాడు. జీవితమంతా పరచుకున్న దుఃఖాలు, నిరాశలు, అపజయాలనుండి కేవలం మృత్యువు మాత్రమే విముక్తిని ప్రసాదించగలుగుతుంది."[a]

ఒక 'కింగ్‌లియర్,' ఒక పేర్‌గోరియో (Pere Goriot) చదివిన అనుభూతి కలుగుతుంది.

అభిజాత్యవర్గానికి చెందడం ఒకటి తప్పించి మిగతా గ్రీక్ విషాదనాయకుని లక్షణాలు హోరీలో ఉన్నై. విషాదాంత నాటకం చదివిన తరువాత సాధారణంగా పాఠకుడిలో కార్యవిముఖత, తాత్త్విక నిరీహ, నిర్లిప్తతలు కలుగుతై. కాని ఈనవల చదివితే విచారమూలక కార్యోన్ముఖత కలుగుతుంది.

"గోదాన్" రచన ప్రారంభించే నాటికి దేశంలో ఇంగ్లీషు ప్రభుత్వం ప్రజల్లో భయోత్పాతం సృష్టించింది. సహాయ నిరాకరణోద్యమం 1933 మేలో విరమించబడింది. అటుచూస్తే ప్రభుత్వం శిస్తు చెల్లింపుల విషయంలో రైతాంగంపై కన్నెర్ర చేసింది ఇటుచూస్తే మహాత్మాగాంధీగారి గౌరవార్థం కాంగ్రెసుపార్టీ తన రాజకీయోద్యమాన్ని వాయిదా వేసింది; రైతాంగపు దుస్థితిపట్ల ఉదాసీనత వహించింది. దానితో అందరికంటె ఎక్కువగా రైతాంగమే కష్టాలపాలయ్యింది. భూస్వామికి శిస్తు, సావుకారువడ్డీ, బ్రాహ్మణులకు దక్షిణ, కులంవాళ్లకు దండగలు, పోలీసువాళ్లకు లంచాలు ఇవ్వడంతోనే జీవితం బుగ్గి అవుతున్న రైతు దుస్థితి ప్రేంచంద్ గ్రామాలు తిరిగి కనులారా చూచాడు. భూస్వాముల రెండు నాల్కల వ్యవహారాన్ని గమనించాడు. వారు సామ్రాజ్యవాద ప్రభుత్వానికి విశ్వాస పాత్రులుగా ఉంటూనే ఇటు జాతీయ స్వాతంత్ర్యోద్యమానికి ద్రవ్య సహాయం చేసేవారు. (రాయ్ ఉగ్రపాల్ సింహుడు జాతీయవాది అయికూడా అధికారులతో చెలిమిచేస్తాడు) అందువలన వారుచేసే దోపిడిని ఖండిస్తూ పల్లెత్తుమాట అనలేని ఇరకాటంలో పడ్డది కాంగ్రెస్ కాంగ్రెస్‌వారి ఈ శోచనీయమైన ధోరణికి, గాంధీగారి రాజీతత్వానికి విసుగుడు పడ్తున్న ప్రేంచంద్ ఇప్పుడు పూర్తిగా విముఖుడైనాడు. క్రియాశీల రాజకీయాల నుండి పూర్తిగా వైదొలగి జీవితాన్ని రచనకే అంకితంచేశాడు. నిజానికి 1919 నాటికి

---

a. ఈ సంక్షిప్తరూపం డా. ఖమర్‌రయీస్ తన సిద్ధాంతవ్యాసం ప్రేంచంద్‌కా తన్ఖీదీముతాలా బహెసియతే నావల్‌నిగార్‌లో ఇచ్చిన కథకు (పుటలు 310–311) వ్యాసరచయిత చేసిన అనువాదం.

సోషలిస్టు వ్యవస్థపై సదభిప్రాయం లేదతడికి. ఉత్పత్తి సాధనాలు కార్మిక కర్షకుల కైవసం కావటం అతడికి ఇష్టంలేదు. సామాన్యుణ్ణి వ్యక్తిగత ఆస్తివేళ్ళను పెళ్ళగించేవాడుగానే కాక పెట్టుబడిదారులను చంపేవాడిగా భావించాడు.[8] అయినా అప్పటికే అతడిలో సంస్కరణవాద వ్యతిరేకత వేరూనింది. "సమాజ వ్యవస్థలో విషము అణువణువునా పాకిపోయింది. దాన్నితొలగించే ప్రయత్నం చేయక పైపైకి కనిపించే వికృతిని దాచే ప్రయత్నం మాత్రం చేస్తున్నారు. కుష్ఠు శరీరాన్ని రంగు గుడ్డలతో కప్పే ప్రయత్నమే ఇది"[9] అని అన్నాడు. గోదాన్‌లో ఈ భావన పరాకాష్ఠకు చేరుకుంది. మౌలికమైన మార్పు కావాలంటాడు. అట్లాంటి మార్పు రాజీమార్గంద్వారా రాదని నిర్ధారణ చేసుకున్నాడు. తానాశించిన చైతన్యం సామాజిక స్పృహ ప్రజల్లో కలిగించాలనే ఉద్దేశంతోనే "జాగరణ్" అనే వారపత్రిక ప్రారంభించాడు (కర్షకుల చైతన్యాన్ని శక్తిని అప్పటికి సరిగా అంచనా వేయగలిగినాడనే విషయం అతడి మొదటి సినిమాకథ "గరీబ్ మజ్దూర్" –ఇది చాలాచోట్ల నిషేధింపబడింది– వలన వ్యక్తమౌతుంది.) ఆ ప్రయత్నంలోని భాగమే "గోదాన్" రచన. దురదృష్టవశాత్తు అదే అతడి చివరి సంపూర్ణరచన అయింది. ఆయన ఇంకా కొంతకాలం బతికిఉంటే మరింకెన్ని మహత్తరరచనలుచేసి ఉండేవాడో ఊహించుకోవడానికి సంతోషంగానూ బాధగానూ ఉంటుంది. ఇంకా రాసి ఉంటే గోర్కి 'అమ్మ'కు దీటైన నవల రాసి ఉండేవాడని కొందరి ఊహ, ఈ ఊహలో వాస్తవం ఉంది.

'గోదాన్' ప్రేమ్‌చంద్ కాలపు గ్రామీణ జీవితాన్ని, సంపన్న విపన్నుల సంఘర్షణ చరిత్రను సమగ్రంగా చిత్రించిన గద్య మహాకావ్యం —Prose epic. తన జీవిత దర్శనాన్నీ, అనుభవ సారాన్నీ ఇందులో విస్తృతంగా చర్చించాడు. ఇది వాసికి రాశికి నిరుపమానమైన నవల. దీన్ని ఒక రూపచిత్రశాల — Portrait gallery– అనవచ్చు. ఇందులో మనకు నిత్యజీవితంలో ఎదురయ్యే పాత్రలు దర్శనమిస్తాయి. బస్తీ వాతావరణంలో కనిపించే నాగరికులు, పారిశ్రామిక వేత్తలుకూడా కనిపిస్తారు. గౌణంగా నైనప్పటికీ పట్టణజీవిత చిత్రణకూడా సమాంతరంగాచేశాడు. ఇందుకతడు బొంబాయిలాంటి పారిశ్రామిక నగరాల్లో సంపాదించిన అనుభవం ఉపకరించింది. (ఎంతైనా ప్రేమ్‌చంద్‌ను పట్టణ జీవిత చిత్రణలోదిట్ట అనలేము.)

---

8 వివిధ్ ప్రసంగ్: (హంస ప్రకాశన్ 1962) పు. 263

9 అదే — పుట 262

ఇందులో హోరీధనియాలు కర్షకులకు, దాతాదీన్ పత్రిజలను వారిలోని మూఢ విశ్వాసాల ఆధారంగా దోచుకునే కుత్సితమతా చార్యులకు, మంగూస్రిషా, ఝంగురీలు అప్పులిచ్చి రైతుల మూలుగులు పీల్చే వడ్డీ వ్యాపారులకు, ఖన్నా పారిశ్రామిక వేత్తలకు, శ్రీమతి ఖన్నా ఆదర్శ సతిత్వానికి, ఓంకారనాథ్ కపట నాయకులకు, మెహతా ఆదర్శ నాయకులకు, మిస్ మాలతి పాశ్చాత్య నాగరికతా వ్యామోహానికి గురిఅయిన స్త్రీలకు ప్రతీకలు. హోరీ కొడుకు గోబర్ కొత్తతరంలో తలెత్తుతున్న తిరుగుబాటు తత్వానికి. మరొక రకంగా యంత్ర నాగరికతలో నైతికంగా పతనం చెందుతున్న యువకులకు ప్రతీక. రచనకు విశ్వజనీనత సిద్ధించాలంటే పాత్రలను సాధారణీకరించడమే గొప్ప. అయితే ఆపాత్రల్లో ఒక విలక్షణతఉంటే అది రచయిత సమ్యగూప చిత్రణ కౌశలానికి తార్కాణంగా నిలుస్తవి.

గొప్పరచన ఆత్మ చరిత్రాత్మకంగా ఉంటుంది. ఇందులోని హోరీలో ప్రేమ్ చంద్ లక్షణాలున్నాయని ఆరనికొడుకు ప్రఖ్యాతరచయిత అమృతరాయ్అభిప్రాయం.

ఈ నవలను ఒకరకంగా హోరీ తనను దోచుకునేవారితో జరిపిన నిరంతర సంఘర్షణగా అనవచ్చు. దీనిలో రచయిత మానసిక వికాస ఫలితంగా కలిగిన ఒక విలక్షణత ఉంది. ప్రేంచంద్ పూర్వపు నవలల్లో కథానాయకుడు తన కష్టాలన్నిటికీ విధితో పోరాడతాడు. కాని ఇందులో హోరీతనచుట్టూ ఉండి తనరక్తాన్ని జలగల్లాగ పీలుస్తున్న భూస్వాములు, మతాచార్యులు, వడ్డీవ్యాపారులు మరియు ప్రభుత్వోద్యోగులతో చచ్చేవరకు పోరాడతాడు. హోరీ ఒకసామాన్య రైతు అలౌకిక లక్షణాలేమీ లేవతనిలో. మానవ సహజమైన బలము, బలహీనతలు, ప్రేమ, లౌక్యం, మోసం, ఆశ అన్నీ ఉన్నాయి ఇతనిలో.

ఒక ఆవును సాధించడమే జీవిత పరమాశయం. అందుకొరకతడు భోలాను వంచిస్తాడు. తమ్ముడికి తన ఆవునుచూపి తన సంతోషాన్ని తనితో పంచుకోజూస్తాడే కాని అతనిలో రగులుతున్న అసూయను పసికట్టలేని అమాయకప్రాణి తన ఆవుకు విషంపెట్టి చంపినపుడు పోలీసులు పట్టుకుపోవడానికి వస్తే అప్పుచేసి వారికి లంచం ఇచ్చి తమ్ముణ్ణి కాపాడుకుంటాడు. అప్పుడప్పుడు ధనియాతో కీచులాడతాడు, వంతాడు. అయినా సరసాలు లేకపోలేదు— ఊరి సేతానితోకూడా సరసాలాడతాడు.

రామ్ ఉగ్రపాల్‌సింహుని వద్దకు తమ స్వార్థాన్ని పురస్కరించుకునే పోతున్నాననీ, అట్లా వాళ్ళతో కలసిమెలసి ఉండటంవల్లనే తమకు ఆమాత్రం జరుగుబాటు అవుతుందంటాడు భార్యా పుత్రులతో— పూర్వాచారాల మీద నమ్మకం, ధర్మభీతి

మెండు. గోబర్ తనతో సృష్టిలో అందరూ సమానులే అన్నప్పుడు, అందరూ సమానులేకాని ధనం పూర్వజన్మ తపః ఫలం వలన లభిస్తుందంటాడు. ధనికులేదో సుఖపడిపోతున్నారనుకోవడం పొరపాటంటాడు. పంచులలో పరమేశ్వరుడున్నాడని నమ్మిక మరలనికి, తాను నమ్మిన విలువలకొరకు ప్రాణమైనా వదులుకోగలడు. అరవై కూడా నిండకుండానే, తానొక సందర్భంలో భార్యతో అన్నట్లు, విషాద మరణం పాలవుతాడు. "భూస్వాములు మతాచార్యుల దోపిడీ సమాజపు దుఃఖ సాగరంలో స్త్రీకి మాంగల్యం అనే గడ్డిపోచకూడా దక్కకుండా దోచుకోబడుతుంది. అట్లాంటి సమాజంలోని స్త్రీపురుషుల కరుణామయ ప్రేమగాథ ఇది"[10] అని డా॥ నవల్‌కిశోర్ అభిప్రాయం.

హోరీ జీవిత సమరంలో ఓడిపోయినాడని కష్టాలతో మనసంతా తూట్లుపడ్డాయని ప్రేంచంద్ అంటాడు. అతడు తనపై జాలితలచండి అని వేడుకుంటున్నట్లున్నాడంటాడు. (ఈదృశ్యంలో ఎవరికైనా కింగ్‌లియర్, అతడన్న I am more sinned against than sinning వాక్యం మనసులో మెదలకపోవు). కాని దీన్ని అతని ఓటమిగా పొరపడవద్దంటాడు ఏడుపేజీల తరువాత "ఈ సంతోషం, ఈ పొగరుబోతుతనం, ఈ తెగింపు ఇవే నా అపజయానికి గుర్తు?" అని ప్రశ్నిస్తాడు. ఇట్లాంటి అపజయాల్లోనే అతనిగెలుపు దాగిఉంది. విరిగిపోయిన ఆయుధాలే అతని జయకేతనాలనీ అంటాడు. మూడు బీగాల పొలము నిలుపుకోవటానికి, ఒక ఆవును సంపాదించుకోవటానికి సమాజపు దుష్టశక్తులతో హోరా హోరీగా పోరాడిన హోరీ జీవితం విషాదాంతంగా ముగుస్తుంది. కాని ఈ విషాద సంఘటన ఆలోచనాపరులను కుదిపి వేస్తుంది.

ధనియాలో స్త్రీ సహజమైన మాతృత్వము, ఔదార్యము, భర్తపై అధికారం చలాయించాలనే కోరికా ఉన్నై. ఈవిడలో శ్రామిక స్త్రీలలో వచ్చే ఆత్మ విశ్వాసం మెండు. హోరీచేత దెబ్బలుతిని, నేను తిండిపెడుతున్నాననుకుంటున్నావేమో. నీ ఇల్లు నువ్వు సంభాలించుకో - నీ కండ్ల ఎదుటనే ఇంతకంటె మంచిగాతిని తాగుతానో లేదో చూసుకో అంటుంది ఝునియాకు కష్టాల్లో ఆశ్రియమిస్తుంది. జుర్మానాలు కట్టించినా ఝునియాను ఈసడించుకోదు. ఇందుమూలంగా 'ఉన్నత కులాలవాళ్ళ' నబడేవాళ్ళ కంటె "తక్కువ" అనబడేవాళ్ళలోనే కొంత కులం పట్టింపులు తక్కువ అని స్పష్టమౌతుంది.

10. మానవవాద్ ఔర్ సాహిత్య - పుట 188 (రాధాకృష్ణ ప్రకాశన్, ఢిల్లీ- 1972)

ప్రేంచంద్ కేవలం మూగజీవులనే సృష్టించాడనే అభియోగం చారిత్రిక అవగాహనలేనిది. ప్రభుత్వం ఎంతో దమననీతిని అవలంబిస్తున్నా, ఎన్నిపుస్తకాలను నిషేధించినా (ఇతని "సోజేవతన్" అనే కథాసంకలనం నిషేధానికి గురి అయింది) తాను రాయాలనుకున్నది రాశాడు. అక్కడక్కడ కనిపించే మెత్తదనానికి రచన అసలు వెలుగే చూడకుండా పోతుందేమోననే భయం కారణం కావచ్చు. అయినా నవల మధ్యలో చివర్లో గోబర్‌తో అనిపించిన మాటల్లో ప్రేంచంద్ ఎంత సాహసం కనబర్చాడో అర్థమౌతుంది. గాంధీవాదం రైతుల సమస్యకు పరిష్కారం కాజాలదనే విషయం తెలుసుకున్న ప్రేంచంద్ యొక్క స్వీయాభిప్రాయాలే గోబర్ నోట వింటాము. "లాఠీ తీసుకొని ఈ దొంగముండాకొడుకులు పటేశ్వరీ, దాతాదీన్, ఝింగురీల కాళ్లచేతులు విరుగగొట్టి, పొట్టలు చీల్చి మింగిన రూపాయలు కక్కించా లనిపిస్తున్నది."

మరొకటి : గోబర్ తన తండ్రి హోరీతో అంటాడు.

"ఈ వంచన ఎంతకాలం సాగుతుందో అంతు పట్టటంలేదు. పొట్టకు గంజి నీళ్లకూడా గతిలేనివానికి గౌరవం, మర్యాద, అన్నీ పచ్చిమోసం, వంచన. నువ్వూ ఇతరులవలెనే సాటిమనుషుల పీకలనులిమి ఉంటే గొప్పోడివై పోదువు. నీస్థానంలో నేనే ఉంటేనా ఈపాటికి జేల్లోనో ఉరికొయ్యకు వేలాడుతూనో ఉండేవాడిని."

ఈ మాటల్లో ప్రేంచంద్‌కు పేదవారికి నష్టం కలిగించే పూర్వాచారాలపట్ల, మర్యాద మన్ననలు అనే ఓటిమాటలపట్లగల తీవ్రమైన నిరసన భావం తెలుస్తుంది.

గోబర్‌ను యంత్ర నాగరికతా ప్రభావంవల్ల నైతికంగా పతనం చెందినట్లుగా చిత్రించడం ప్రేంచంద్ అవగాహన లోపమే— మాలతి పాత్ర చిత్రణలో కూడా ఒకరకమైన పాశ్చాత్య నాగరికతా వ్యతిరేకత కన్పిస్తుంది. "సినిమాలు స్వతహాగా నష్టకారి కానట్లే యంత్రాలుకూడా తమంత తాము నష్టకారికావు. మనం నిందించ వలసింది వాటినికాదు, వాటి పైత్రివేటు యాజమాన్యాన్ని"[11] మనిషి ఏరకంగా పతనం చెందినా దిగజారినా అందుకు సమాజ వ్యవస్థాస్వరూపమే ప్రధానకారణం.

ప్రేంచంద్ తనకాలపు గ్రామదేవతల అత్యాచారాలను బట్టబయలు చేశాడు. హోరీ తన ఇంట్లో వేరేకులపు పరాయిపిల్లను పెట్టుకున్నందుకు ఎన్నో అవమానాలకు దండనలకు గురి అవుతాడు. కాని డబ్బున్న దాతాదీన్ కొడుకు మాతాదీన్ సలియా అనే హరిజన యువతితో సంబంధం పెట్టుకున్నందుకు ఏరకంగాను కష్టపడలేదు.

11 Ralph Fox: Novel and the People P. 149

300 రూపాయల ఖర్చుతో గౌరవానికి ఏలోటూలేకుండా ఉంటాడు. డబ్బొక్కటి ఉంటే ఎన్నిదోషాలనైనా కప్పేస్తుంది. డబ్బులేనివాడి చిరులోపాలనైనా వెయ్యింతలు చేసి చూపిస్తుంది దోపిడీవ్యవస్థ.[12]

మతాచార్యుల దోపిడీ పూర్తిగా ప్రజల అంధ విశ్వాసాలమీద ఆధారపడిఉంది. ఎదుటివాడి ప్రాణంపోతున్నా దక్షిణను నిర్దాక్షిణ్యంగా పిండుకోగల దక్షుడు దాతాదీన్. హోరీ శోషణసప్రదష్టుడై, జమీందారీ కంకుకోరల కాటుకు బలియై "ఇంకా ఎంతసేపు బతికించుకో గలుగుతావు. నన్ను చావనియ్యి ధనియా" అంటూ దయనీయంగా ప్రాణాలు వీడుతున్న సమయంలో కూడా తనకు గోదానం చేయమని చేయిచాస్తాడు. దీనికి అమాయక ప్రజానీకంలో ఉన్న పరలోకపు ఉనికిపై నమ్మకం. తద్యాత్రి మధ్యంలో అడ్డుపడే వైతరణిని దాటడానికి ఇహలోకంలో గోదానం చేస్తే దానితోక ఉపకరిస్తుందనే అంధవిశ్వాసమే మూలం (మృత్యు ముఖంలో ఉన్న కడుపేదవాడిని, గోవును కాదు కదా గోపుచ్ఛ మూల్యాన్నికూడా దానంచేయజాలని దరిద్రులను, సైతం దోచుకోవడానికి పీడకులకు. శోషకులకు వారి "అంతరాత్మలు" అడ్డురావని సంకేతించడానికే "గోదాన్" అని పేరుపెట్టాడు ప్రేంచంద్).

ఈ దాతాదీనే హోరీకి ఎద్దును కొనుక్కోవటానికి ముప్పై రూపాయలు అప్పు ఇస్తాడు. అది ఎంత చెల్లించినా ఎన్నటికీ తీరని రుణమై కూర్చుంటుంది.

గోబర్ బస్తీనుండి వచ్చిన తరువాత వడ్డీవ్యాపారిని హేళనచేస్తూ యువకులు ఆడిన నాటకం ద్వారా వ్యాపారులు ఎన్నికాల పీడిస్తున్నారో తెలుస్తుంది. వడ్డీ వ్యాపారి పదిరూపాయల అప్పు పత్రం రాసి ఐదురూపాయలు చేతపెడ్తాడు మిగిలిన ఐదు రూపాయలు కూడా వ్యాపారి ముఖానకొట్టి వాడి క్రియా కర్మలు మొదలైన ఖర్చుల కుంచుకోమంటాడు అప్పుకోసం వచ్చినతడు. ఈదృశ్యం మనకు దోపిడీని వ్యంగ్యంగా మనసుకు హత్తుకునేట్లుగా చేస్తుంది.

మిస్టర్ ఖన్నా పెద్ద పారిశ్రామిక వేత్త. ఎన్నో బ్యాంకులకు మేనేజింగ్ డైరెక్టర్. బేలారీ గ్రామంవద్ద వేరే ఒక పంచదార ఫ్యాక్టరీని నిర్మించి రైతులను దోచుకుంటాడు. బ్యాంకులు, ఫ్యాక్టరీలు అన్నీ రైతులను దోచుకున్న డబ్బు ఫలితంగానే ఉనికిలోకి వచ్చాయని ప్రేంచంద్ సంకేతం.

చివరకు ఖన్నా ఫ్యాక్టరీ అగ్నిప్రమాదానికి లోనుకాగా అతని ఆదర్శపత్ని

---

12. cf. King Lear (IV-VI-163, 164) Through tattered clothes great vices do appear Robes and furred gowns hide all.........

గోవిందాదేవిని చేరడం హార్డీ నవలలోని యాదృచ్ఛికత. ఏదో నీతి చెప్పటానికి సృష్టించిన బలహీనమైన సన్నివేశం రచనలో ఒక అవాంఛనీయమైన లోపం.

ఓంకారనాథ్ విలాస జీవితంపై మోజున్న కార్మిక నాయకుడు చెప్పేదానికి చేసేదానికి పొంతన ఉండదు. మధువు, మగువలను అవకాశమొస్తే విడచిపెట్టడు. విదేశీ వస్తువులను, కార్లను బహిష్కరించా లంటాడుకాని రెంటినీ తీవ్రంగా కోరుకుంటాడు. విదేశీ సూట్లనే ధరిస్తాడు.

షోలఖోవ్ 'At the Bidding of the Heart' (పుట 191)లో అన్నట్లు సాహిత్యంలో కనిపించినంతగా ఆదర్శాల వైరుధ్యం మరే కళారంగాల్లోనూ కనిపించదు. రచయిత తనపాత్రల రాజకీయ ఆదర్శాల ప్రసక్తి వచ్చినపుడు, అవి బయటపడ్డపుడు, తనసానుభూతిని,అయిష్టతను పాఠకులనుండి మరుగుపరచలేడు. ప్రేంచంద్ సానుభూతి ఏపక్షాన ఉన్నదో స్పష్టమే

"గోదాన్"లో ధార్మిక విషయాలు, ముఖ్యంగా మతము దైవముల ప్రసక్తి కూడా వస్తుంది.

హిందూ సమాజంలో "ఉత్తమ కులాలవాళ్లు ఉన్నతకులాల వాళ్ల"ను హిందూ మత సంరక్షకులుగా సంభావిస్తారు. అందుకే వారిని "భూసురుల"ని పేరుపెట్టి దాన దక్షిణలతో సత్కరిస్తారు. ఆరకంగా దేవతలనే ప్రసన్నులను చేసుకున్నట్లు తృప్తి పడతారు. ఈ భూసురులు ఫలసాయంలో ఒక నిర్ణీతభాగాన్ని గుంజుతారు. రైతు పస్తులున్నా, అప్పులపాలైనా అది ఎగగొట్టటానికి వీలులేదు. అట్లాచేయటం పాపంగా భావిస్తారు, నరకానికి పోతామని భయపడతారు. పవిత్రత అనే భావం ఆధారంగానే మతాచార్యులు ప్రజలను దోచుకునేవారు. దాతాదీన్ ఈ మార్గాన్ననుసరించే వేలాది రూపాయలు దండుకున్నాడు.

గోదాన్ అనే పేరు పుణ్యమూ పురుషార్థాల సాధనమార్గంగా చెప్పలేదు ప్రేంచంద్; ఆపేర జరుగుతున్న అమానుషమైన దోపిడీనుండి విముక్తి పొందడానికి ప్రేరణా సంకేతంగా పెట్టాడు. పైగా ప్రేంచంద్‌లో గోదాన్ రాసేనాటికి ఆస్తిక చింతన పూర్తిగా తగ్గిపోయింది. కాని ఆయనలో లేని ధార్మికచింతన ఉన్నదని, విద్యావంతులైన పాత్రలద్వారా సంపూర్ణసమాజంలో నాటుకొని ఉన్న భగవద్భక్తిని చిత్రించినాడని డా॥ వెలుగులేటి శ్రీనివాసాచార్యగారు తమ సిద్ధాంత గ్రంథం "ప్రేంచంద్ ఏవం తెలుగుకే యుగీన్ ఉపన్యాసకార్" లో ఒక అభిప్రాయాన్ని

వెలిబుచ్చారు. ఈ అభిప్రాయపుష్టికోసం దురదృష్టవశాత్తు "గోదాన్"లో ప్రేంచంద్ సానుభూతి ఎంతమాత్రమూలేని మాలతి ప్రొ. మెహతాతో అన్నమాటలను ఉటంకించారు. ప్రేంచంద్ అభిప్రాయాలకు నిజమైన ప్రతినిధి అయిన మెహతా అనే ఈ మాటలను దాటవేశారు. "దేవుడు ముక్తీఅనే వ్యవహారం చూస్తుంటే నాకు నవ్వు వస్తుంది. ఈ భక్తీముక్తీ మన మానవత్వాన్ని సర్వనాశనం చేసే అపరిమితమైన స్వార్థానికి పరాకాష్ఠ". కులమతాలకు అతడు (ప్రేంచంద్) వ్యతిరేకి, ముఖ్యంగా ఒక కులం మరొక కులాన్ని దోపిడీచేయడానికి. మతము అనే మాటనే పూర్తిగా తుడిచివేయాలని అతని అభిప్రాయం. అందుకే "హిందూమతం ఉండేంతవరకు బ్రాహ్మణులు ఉంటారు— దొరతనాలు దోపిడీలు ఉంటాయి" అంటాడు. గోబర్ మనసులో రైతుల గురించిన ఆలోచనలు కూడా గమనించండి: ఎవరి అదృష్టానికి వారేకర్తలు. తెలివితేటలతో, ధైర్యంతో కష్టాలను జయించాలి. అంతేకాని ఏదేవుడో దయ్యమో రాదు వారిని ఆదుకోవటానికి". ఎవరో వస్తారని, ఏదోచేస్తారని, ఎదురు చూసి మోసపోవద్దని హెచ్చరిస్తున్నాడు.

ఈ అలంకారాలూ, అన్యాపదేశాలూ ఎందుకు. ప్రేంచంద్ స్వయంగా ఆచార్య ఇంద్రనాథ్ మదాన్‌కు 26 డిసెంబర్ 1934 న రాసిన ఉత్తరం చూడండి. "మొదట్లో నేను సహేతుకంగాకాక కేవలం పరంపరాగతమైన విశ్వాసాల కారణంగా ఒక మహాదైవశక్తి ఉందంటూ నమ్మేవాణ్ణి. ఇప్పుడానమ్మకం భగ్నమౌతున్నది"[13] వెలుగులేటి వారి వ్యాఖ్య సత్యదూరం ప్రేంచంద్ వివేకంపట్ల అపచారం.

ప్రేంచంద్ తనలోవచ్చిన మార్పు కారణంగానే 1936లో జరిగిన అభ్యుదయ రచయితల సమావేశానికి (ప్రగతిశీల్ లేఖక్ సమ్మేలన్) అధ్యక్షుడుగా ఉండటానికి ఎంతో ఉత్సాహంతో ఒప్పుకున్నాడు.

ప్రేంచంద్ మొదట్లో వ్యక్తులలోని బలహీనతలను క్రూరతలను చిత్రిస్తే ప్రజలు నిరాశావాదులవుతారనీ, చెడుప్రవృత్తి ప్రబలుతుందనీ అభిప్రాయపడ్డాడు[14] ఒకరకమైన aesthetic realism, చేదు నిజాలకు చక్కెర పూతపూసే పద్ధతిని, అవలంబించా లంటాడు. కాని గోదాన్ నాటికి వాస్తవిక పద్ధతినికూడా దాటి సామ్యవాద వాస్తవికతను చేరుకున్నాడు "ఇందులోని పాత్రలు కేవలం కల్పితాలు ఎవరినీ

13. ఇ. మదాన్ : ప్రేంచంద్ ఏక్ వివేచన్ — అనుబంధం పు. 146 (రాజకమల్ ప్ర. 1968)

14. ప్రేంచంద్ సాహిత్యము – ఉద్దేశము (విశాలాంధ్ర 1966) పు. 68

ఉద్దేశించి రాసినదికావు" అనేలాంటి పాత్రలు కావీయన సృష్టి— రక్తమాంసాలున్న సజీవ వ్యక్తులు. కల్పిత పాత్రలు ఛాయామాత్రంగా అనిశ్చితంగా అవిశ్వసనీయంగా ఉంటాయని ఆయనకు తెలుసు.

నవలలో సంభాషణలు వీలైనంత తక్కువగా ఉండటం మంచిదనే నమ్మకం కలవాడు కావటంచేత ఆయన రచనల్లో కథనంపాలు ఎక్కువైంది. ఈయన అంతరంగ కథనాలు, శుద్ధమన స్తత్వ చిత్రణలు వెరిమొర్రి ప్రయోగాలు చేయలేదు. ఆయన ప్రధానంగా భౌతిక విషయాలను గురించి రాసినాడు గనుక సూటిగా కథ చెప్పడం (Straight narration) కే ప్రాధాన్య మిచ్చాడు. మధ్యమధ్య కల్పించు కొని వ్యాఖ్యానించే అలవాటుం డీయనకు (చాలమంది దీన్ని ఒక తప్పుగాభావిస్తారు. కాని నాటకానికి లేని, నవలకు ఉన్న సౌలభ్యము ఇది. తాను చెప్పదలచుకున్న విష యాన్ని సవ్యాఖ్యానంగా చిత్రిస్తాడు రచయిత నవలలో. గ్రీకు నాటకాలలో ఈపని కోరస్‌ద్వారా జరుగుతుంది. ఒకవిషయాన్ని చూపడమేకాదు తనదృష్టి కోణంనుండి చూపడం నవలాకారుడి ఉద్దేశ్యం— బాధ్యత— కనుక నాదృష్టిలో ఇది పెద్దదోషమేమీ కాదు.)

—*—

రచయిత ఎన్నుకొనే కథావస్తువులోని పటుత్వమే శైలికి బలాన్నిస్తుంది. బలమైన కథలేకుండా బలమైన శైలి కష్టసాధ్యం. ప్రేంచంద్ తన రచనను అనవ సరమైన అసంబద్ధమైన తర్కాల మాయతెరలతోకాని భాషాడంబరంతోకాని నింపలేదు. సజీవమైన శక్తిమంతమైన ప్రజల భాషను వాడాడు. మాండలికంలో వచ్చిన తొలి సశక్తమైన నవల ఇదే. సామెతలు జాతీయాలు కొల్లలుగా ప్రయోగించా డీనవలలో. దానివల్ల వాతావరణం ఆత్మీయంగాను వాస్తవికంగానూ ఉంటుంది. సామాన్యజనులు వాడుకునే భాషలో గోర్కీ అన్నట్లు అమూల్యశబ్ద నిధులున్నాయి. భాషావిస్తరణ, ముఖ్యంగా జాతీయాలు లోకోక్తుల నిర్మాణం, సామాన్య జనులవల్లనే జరుగుతుందని లోగన్ పియర్సల్‌స్మిత్ (Words and Idioms)అనే భాషా శాస్త్రజ్ఞుని అభిప్రాయం. ప్రజల భాషానాడి ఎరిగి వారిభాష నొకశక్తివంతమైన సాధనంగా వాడుకున్నాడు ప్రేంచంద్. ప్రజల భాషకు సాహిత్యగౌరవం కల్పించింది కూడా ఈయనే.

శిల్పం దృష్ట్యా ఈయన మహారచయిత కాకపోవచ్చు. యశపాల్‌తోనో, అజ్ఞేయ్‌తోనో లేదా భగవతీ చరణ్‌వర్మ, కీ. శే. మోహన్ రాకేశ్, కమలేశ్వర్ లతో పోల్చే వీలులేకపోవచ్చు. ఉర్దూలో కిషన్‌చందర్ ఒకవిధంగా గొప్పవాడు

## 'హంస' పత్రిక నిర్వహణ: ప్రేంచంద్

టి. వి. ఎస్.

సాహిత్యం ద్వారా సమాజసేవ చెయ్యాలనే నిరంతరమైన ఉబలాటం, దుర్భర దారిద్ర్యంతోను, అభ్యుదయ నిరోధకులతోను, బ్రిటిష్ పాలక వర్గంతోను నిర్విరామంగా ఒకవైపున పోరాటం మరోవైపు వెన్నాడే అనారోగ్యాన్ని వెనుకకునెట్టి సమాజ పతాకం చేతపట్టుకొన్న సైనికుడుగా ముందు ముందుకు తోసుకు పోవాలనే నిరంతరమైన ఆరాటం మునుముందుకు తోసుకుపోవడం-సంక్షిప్తంగా చెప్పాలంటే, ఇదే ప్రేమ్‌చంద్ జీవయాత్ర.

సుమారొక డజను నవలలు, మూడువందలదాకా కథలు, మూడునాటకాలు, ఎన్నో వ్యాసాలురాసి సుమారు ఆరువేల పాత్రలు సృష్టించిన అపారమైన సాధన, సామాజికమైన ఆవేదన సాహిత్యపోరాటం మున్షీప్రేంచంద్‌ను సాటిలేని జనాదరణకు పాత్రుణ్ణి చేశాయి. ఇవికాక మర్యాదా, మాధురీ, జాగరణ్ "హంస"లాంటి పత్రికలు స్థాపించి సంపాదకుడుగా, సాంఘిక రాజకీయ రంగాల్లో జన చైతన్యం నిర్మాణం

---

పోవచ్చు. అయితే అందుకు కారణం ఉంది. ఈయనకు పటిష్టమైన నవలా రచనా సంవిధానం వారసత్వంగా లభించలేదు. రచనాకళలో తనకుతానే గురువు. తరువాత తరాలవారిది వడ్డించిన విస్తరి. కాని పీడలపట్ల ఆర్ద్రిత, రైతుల సమస్యలపట్ల సానుభూతి, మానవప్రేమ ఇంత పుష్కలంగా ఉన్న రచయిత మరొకడు లేడు.

అనేక లోపాలతో ఒక పుస్తకం మనోరంజకంగాను, ఏతప్పులూలేక విసుగు పుట్టించేదిగాను ఉండవచ్చునన్న గోల్డుస్మిత్ మాటలు[15] ఈ సందర్భంగా గమనించ దగినవి. ప్రజల సమస్యల సానుభూతి పూర్వకమైన అవగాహన, చిత్తశుద్ధితో వాటిని చిత్రించిన తీరు అతణ్ణి "నవలా సామ్రాట్" గా నిలిపినవి. ఎన్ని లోపాలున్నా గోదాన్ గొప్పతనం తరగనిది. రాబోయే కాలాల్లో ఉర్దూ హిందీ సాహిత్యాల్లో ఎన్ని ప్రయోగాలు జరిగినా, ఎన్ని మార్పులు వచ్చినా ప్రేంచంద్‌ను ఆధునికయుగంలో మిక్కిలి విప్లవకారుడైన రచయితగాను, భారతీయ క్రాంతిదర్శిగాను పరిగణిస్తారు.

ఉర్దూకావ్య సాహిత్యంలో మహాకవి ఇక్బాల్‌కున్నస్థానం నవలాసాహిత్యంలో ప్రేంచంద్‌కుంది. విశేషమేమిటంటే ఇక్బాల్ ఉర్దూ, ఫార్సీ భాషల్లోను, ప్రేంచంద్ ఉర్దూ, హిందీ భాషల్లోను దాదాపు సమాన అధికారంతో రాయగలిగిన దిట్టలు.

---

15. Oliver Goldsmith. The Vicar of Wakefield. మొదటి అధ్యాయానికి రసిన ఉపోద్ఘాతం.

చేసే ఉద్యమంలో ఆయన పడరాని పాట్లకు గురైనాడు. ప్రేమ్‌చంద్ జీవితచరిత్రకు ఆయన "హంస" పత్రికా నిర్వహణగాథను ఒక చక్కని మచ్చుతునకగా పేర్కొన వచ్చు. పత్రికా రంగాన్ని ఎంత గౌరవపూర్వకం చేశాడో, ఈ ప్రయత్నంలో ఎన్ని ఇబ్బందులకు పాల్పడ్డాడో ఈప్రగతి ఉద్యమకారుని 'హంస' సంపాదకత్వగాథ స్పష్టంగా తెలుపుతుంది.

ఆరు నెలల పూర్వమే తన పత్రికకు "హంస" పేరు సూచించిన మిత్రుడు జయశంకర ప్రసాద్‌కు ఒక లేఖలో ప్రేమ్‌చంద్ ఇలారాస్తాడు "కాశీనుండి ఎలాటి సాహిత్య పత్రికా వెలువడడంలేదు. నేనా ధనికుణ్ణికాను, శ్రామికుణ్ణి. "హంస" వెలువరించాలనే నేను నిశ్చయించుకున్నాను —" ఆ నిర్ణయం ప్రకారంగానే మార్చి 1930 లో, కళాత్మకమైన ముఖ చిత్రంతో తొలి సంచిక వెలువడింది. రెండేళ్లకు పూర్వమే, పత్రికలో మూడేసి మౌలిక కథానికలు రెండు అనువాద కథలు ఉండాలనీ ఎనిమిది పుటలు ధారావాహిక నవలకు మరో ఎనిమిది పుటలు సాంఘిక, రాజకీయ, విద్యావిజ్ఞాన విశేష వ్యాఖ్యానాలకు, నాలుగు పుటలు ఉత్తమగ్రంథాల సమీక్షలకు, పన్నెండు పుటలు చరిత్ర, లైంగిక, యాత్రా సామాగ్రికి కేటాయించాలని అయన ప్రణాళిక వేసుకున్నాడు. ఎప్పటినించో కలలుకన్న మహత్తర సాహిత్య కృషి ఇప్పటికిఫలించిన సంతృప్తి ఆయనకు కలిగింది. ఒకసంవత్సరంపాటు తంటాలు పడితే పత్రిక నిలదొక్కుకుంటుందని ఆశించాడు. కాని జీవిత పర్యంతం ఆర్థిక చిక్కులతో పాటు తనను వెంటాడి వస్తున్న సామ్రాజ్యవాద ప్రభుత్వ విషజ్వాలలు ఈ రంగంలో కూడ ఆయనను చుట్టు ముట్టాయి. పైగా "హంస" మాసపత్రికకన్న అధికంగా "జాగరణ్" వారపత్రిక ఆయనను ఆర్థికంగా కుంగదీస్తూపోతున్నది.

ఈ కాలంలోనే బనారసీదాస్ చతుర్వేది పేరట ఉత్తరం రాస్తూ ప్రేంచంద్ అంటాడు "హంస అంతగా భారం కావటంలేదు కాని 'జాగరణ్' భారం మాత్రం భరించలేనంతగా కుంగదీస్తున్నది. ఈ పరిస్థితి నుండి ఎలా బయటపడాలో అని తీవ్రంగా బాధపడుతున్నాను. నెలనెలా రెండువందల రూపాయలు లొట్టపడుతున్నది... ఎంతకాలమని సహించను? కొన్ని ప్రకటనలు దొరికితే కొంతవరకు కూడ దీసుకోగలనేమో ..."

ఈ పరిస్థితుల్లో అక్టోబర్ - నవంబరు 1933 హంస ప్రత్యేక సంచికగా వెలువరించి, ప్రేంచంద్ మరో ఆర్థిక సంకటం కొనితెచ్చుకొన్నాడు. 9 జనవరి 1934 నాడు, తన ఆప్తమిత్రుడు మున్షీ దయానారాయణ్ నిగమ్ పేరిట ఆయన ఇలా

రాశాడు "హంస ప్రత్యేక సంచిక మీకు అందే ఉంటుందికదూ? కొంచెం జాగ్రత్తగా పరిశీలించి చూడండి. ఈ సంచికకు సుమారు 1200 రూపాయలు వెచ్చించాను ఈ ప్రత్యేక సంచిక ప్రభావంతో పత్రికకు అధిక ప్రచారం లభిస్తుందని ఆశించాను. రెండు మూడువందల చందాలు ఎక్కువ కావచ్చునని అంచనా వేసుకున్నాను కాని ఫలితం శూన్యం. 500 వీ పీ.లు పంపితే, 300 తిరిగి వచ్చినాయి. కార్యాలయం అంతా పత్రికలు గుట్టలుపడి ఉన్నాయి. కాగితం వాళ్లకు మొదటినించీ వస్తున్న బాకీ ఇప్పుడు రు. 2000 అయికూచుంది. కష్టంమీద 500 రూ.లు మాత్రం చెల్లించ గలిగాను."

ఈ తరుణంలోనే బొంబాయిలో సినీ డైరెక్టర్ భవనానీనుండి ప్రేమ్‌చంద్‌కు సినిమారంగానికి పిలుపు వచ్చింది. సంవత్సరానికి ఆరుకథల చొప్పున రాయించుకుని 8 వేల రూపాయలు చెల్లించేట్లు ఒప్పందం జరిగింది. పత్రికారంగంలో పడ్డ లోటు సినిమారంగంలో పూర్తిచేసుకోవచ్చని ప్రేంచంద్ ఆశించాడు. వెంటనే అంగీక రించాడు ఒకటి రెండు సంవత్సరాలు ఎలాగో బొంబాయిలో గడిపేస్తే, ఋణవిముక్తి చేసుకోవచ్చని ఆశించాడు.

కాని ఇక్కడా ఆయనకు చుక్కెదురే అయింది. తొమ్మిది నెలలకే మళ్ళీ బనారస్ తిరిగి వచ్చేశాడు. బొంబాయిలో ఎందుకు నిలువలేకపోయాడు? మజ్‌దూర్ (శ్రామికుడు) అనే కథ ఫిల్మ్ తీస్తే ప్రభుత్వం దాన్ని నిషేధించింది. ఈ చిత్రంలో స్వయంగా ప్రేంచంద్ కొద్దినిమిషాలపాటు, శ్రామికుల పక్షాన యాజమాన్యంతో రాయబారం జరుపుతూ, వెండి తెరమీద నటిస్తూ కనిపించడం ఒక విశేషం. సినిమా రంగం ఆర్థికంగా లాభసాటి బేరం అయినప్పటికీ. ఆ వాతావరణం ప్రేంచంద్‌కు ఏమాత్రం నచ్చలేదు అక్కడి కృత్రిమ వ్యవహారాలు, నిర్మాతల నీచత్వాలు ఆయన అసహ్యించుకున్నాడు. ఏమైనా ప్రేక్షకుల నుండి గరిష్ట లాభాలు గుంజడమే వారికి ధ్యేయంగా ఉంది ప్రజల్లో సామాజిక రాజకీయ చైతన్యం నిర్మాణం చేసే ఉద్దేశం ఏకోశానా కన్పడటంలేదు. సినిమా రంగంమీద ఆయన భ్రాంతి తొలగిపోయి, విముఖత్వం ఏర్పడింది ఒప్పందం విరమించుకొని అంతటితో ఇంటిముఖం పట్టాడు. ఈ విముఖత్వం వెనుక ఆయన అమూల్య భావాలేమిటో ఆయన మాటల్లోనే గమనించ వచ్చు "సాహిత్యం అశేష జనం అభిరుచిని అభివృద్ధి చేస్తుందేకాని. దానిని అనుస రించదు. సినిమా అనుసరిస్తుంది. జనం అభిరుచి ఎటుకోరితే అటే పోతుంది ఈ సినిమా. సాహిత్యం మన కళాత్మక సంవేదనల్ని కదలించి ఆనందింప చేస్తుంది.

సినిమా బర్బరభావాలను గిలగొట్టి పిచ్చివాళ్లను చేస్తుంది... సినిమా, సాహిత్యం ఈ రెండూ ఒకే తాటిమీద నడిచేకాలం ఇంకా ఎంతోదూరం ఉంది." ప్రేమ్‌చంద్ ఈ రంగంలో గందరగోళం అంతా చూసి, సంపద ఆర్జించడానికి వ్యభిచరించేది నిజమైన కళ ఎలా అవుతుందని వాపోయాడు. మరో సందర్భంలో ఆయన చెప్పిన మాటలు ఆయన తత్త్వాన్ని చక్కగా నిరూపిస్తాయి, "ఐశ్వర్యాన్ని ఆరాధించేవాళ్లకు సాహిత్యమందిరంలో స్థానంలేదు. జీవితానికి సేవయే సార్థకమని యోచించే భావుకులే ఇక్కడ కావాలి." మొత్తానికి ప్రేమ్‌చంద్ సినిమారంగంలో, ఆర్జించి తెచ్చుకున్న ఐశ్వర్యం రు, 1400 మాత్రమే.

ఈ ఘట్టం ఇలా సాగుతుండగానే కన్హయ్యాలాల్ మున్షీ రాసిన ఒక లేఖతో "హంస" నిర్వహణ మరోమలుపు తిరిగింది. ఇందోర్‌లో గాంధీ అధ్యక్షతన ఒక హిందీ సమ్మేళనం జరిగింది. అఖిల భారతస్థాయిలో అంతర్ ప్రాంతీయ సాహిత్య పరిషత్తును నెలకొల్పి, హిందీ మాధ్యమంగా విభిన్న ప్రాంతీయ భాషాసాహిత్యాలను ఏదైనా పత్రికద్వారా ప్రచారంలోకి తేవాలని మున్షీ కన్హయ్యాలాల్, గాంధీలు సమాలోచించు కొన్నారు. 2 మే 1935 నాడు ఈ సభల సమాచారమంతా పైనపేర్కొన్న లేఖద్వారా ప్రేంచంద్‌కి తెలియపరిచారు. మరో రెండు వారాల తర్వాత "హంస" పత్రికనే ఉపయోగించుకుంటే బాగుంటుందని ఆయన సూచించాడు. ప్రేంచంద్ సంతోషంగా ఈ మంచిపనికి తన "హంస"ను అంకితం చేయడానికి అంగీకరించాడు "హంస లిమిటెడ్" రిజిస్ట్రేషన్ జరిగిపోయింది. ఈ క్రొత్తరూపంలో తొలి సంచిక అక్టోబర్ 1935లో వెలువడింది. ప్రేమ్‌చంద్‌తోపాటు సంపాదకులుగా కన్హయ్యాలాల్ మున్షీ పేరు కూడ జోడించబడింది. గాంధీ పత్రికను ఆశీర్వదిస్తూ ఇలా సందేశం పంపాడు. "హిందీ లేక హిందుస్తానీ రాష్ట్రభాష కావాలంటే ఇలాంటి మాసపత్రిక ఎంతో అవసరమవుతుంది. వివిధ ప్రాంతీయ భాషల ఉత్తమ రచనలు రాష్ట్రభాష ద్వారా! అందరికీ అందించాలి. ఇలాటి సమన్వయ కృషి ఫలితం ఇప్పుడు హంస ద్వారా నెల నెలా కేవలం అర్ధరూపాయిలోనే అందించ గల్గుతున్నందుకు నాకెంతో ఆనందంగా ఉంది. గాంధీ సూచన ననుసరించి వ్యాపార ప్రకటనలకు దీనిలోతావులేదు. పుస్తకాలు, సాహిత్యం, విద్య వీటికి చెందిన సంస్థల ప్రకటనలుమాత్రమే స్వీకరింపబడతాయి. తనకు సంపూర్ణ స్వాతంత్ర్యంలేదు కనుక "హంస" నడకలోనే ఇప్పుడు మార్పు వచ్చింది.

ఒప్పందం ప్రకారం "హంస" ముద్రణ సరస్వతీ ప్రెస్‌లోనే జరగాలి. తన పత్రికకోసం ప్రేంచంద్ జీవితమంతా కుదువపెట్టి స్థాపించుకొన్న ముద్రణాలయం

ఇది. భారతీయ సాహిత్య పరిషత్తుకు "హంస"ను అర్పించిన అనంతరం కొందరు సభ్యులు ముద్రణ వ్యయం ఎక్కువ పడుతున్నదని గొణగడం మొదలు పెట్టారు. 4 జులై 1936 నాడు కార్యాచరణ సమితి "హంస" యొక్క ముద్రణం ఇకనుంచి సరస్వతీ ప్రెస్ నుండి తప్పించి ఢిల్లీలోని "సస్తా సాహిత్య మండల్"కు అప్పగించాలని తీర్మానించింది. ఇందువల్ల నెలకి రూ. 50/- లు మిగులుతూ ఉంటుందని వాళ్ల అంచనా. ఈ నిర్ణయం అందుతూనే "హంస" తో తన సంబంధాలు తెగతెంచు కోటానికి ప్రేంచంద్ నిశ్చయించాడు "హంస" తనది కాకుండాపోయింది. ఇక 'బీసవీం సదీ' అనే మరో పత్రిక స్థాపించాలనే నిర్ణయానికి వచ్చాడు. అంతటితో "హంస" పత్రిక ప్రమాణాలు దిగజారి పోయినాయి. అఖ్తర్ హుసెయిన్ "రాయపురీ" పేరిట జాబు రాస్తూ ప్రేంచంద్ ఇటీవల "హంస" ఏ సాహిత్యం ప్రచురిస్తున్నదో అదంతా భక్తి సాంప్రదాయానికి చెందిన "షాహుకారు" సాహిత్యంగాఉంది. ఇలాంటి సాహిత్యం ఇదివరకే హిందీలో కోకొల్లలుగా ఉంది అంటూ తన నిస్సహాయతనూ ఏవగింపునూ, నిస్సంకోచంగా వెల్లడించాడు.

ఇంతలో ఒక విచిత్ర సంఘటన జరిగింది. "హంస" జూన్, జులై సంచికల్లో సేఠ్ గోవిందదాస్ నాటకం ఒకటి ప్రచురింపబడింది. బ్రిటిష్ ప్రభుత్వానికి ఈ నాటకంలో రాజద్రోహం సాక్షాత్కరించింది. "హంస లిమిటెడ్" వెయ్యి రూపాయల జమానతు కట్టాలని తాకీదులు వచ్చాయి. జమానతు కట్టడం గాంధీకి ఇష్టంలేదు. కనుక "హంస లిమిటెడ్" అందుకు అంగీకరించలేదు. ఫలితంగా సంస్థను మూసి వేయాలని ప్రభుత్వం ఆదేశం పంపింది.

ప్రేంచంద్‌కు "హంస" ఇలా అంతరించడం ఇష్టంలేదు. ఆయన ఈ సమాచారం వినగానే తాను జమానత్ చెల్లించి పత్రిక నిర్వహించ దలచినట్లు గవర్నరుకు జాబురాశారు. అప్పటికే ఆయన ఆరోగ్యం భయంకరంగా క్షీణించిపోయింది. 'హంస' తనమానస పుత్రిక. అది చావడానికి వీల్లేదు కాని ఎన్నో యాతనలకులోనై డబ్బు పోగుచేసి 'హంస' ప్రచురణ కొనసాగించడానికి ఆయన ఉద్యమించాడు.

సెప్టెంబరు 1936 హంస సంచిక నూతన ఉత్సాహంతో వెలువడింది. ఈ సంచికలోనే ఆయన "షావుకారీ సభ్యత" అనే వ్యాసం వచ్చింది. ఇందులోనే నిర్ద్వంద్వంగా పెట్టుబడిదారీ సంస్కృతిని తీవ్రంగా నిరసిస్తూ వర్గరహితమైన సామాజిక వ్యవస్థను గట్టిగా సమర్థించాడు. "హంస"కు ఆయన ప్రాణం అర్పించాడు. మరుసటి సంచికనే చూడకుండా 8 అక్టోబరు 1936 నాడు మరణించాడు. ఆయన

# ప్రేమ్‌చంద్– సాహిత్య వ్యక్తిత్వం

తెన్నేటి

"సాహిత్యం ఎంతో ముందుకుపోయింది. ఎన్నో కొత్తమార్పులు వస్తున్నాయి. ఇంకా ప్రేంచంద్ ఏమిటి?" అన్నాడు ఒక మిత్రుడు ఇటీవల నాతో– ఆధునికత ముసుగులో తన అభ్యుదయ నిరోధకబుద్ధిని చాటుచేసుకుంటూ. నిజంగా ప్రేంచంద్ సాహిత్యం పాతబడిందా– అని మననం చేసుకున్నాను.

ప్రేంచంద్ ఆవిర్భావంతోనే ఉర్దూ, హిందీ రెండు సాహిత్యాల్లోనూ, ఇటు కథారంగానికి, అటు నవలా రంగానికికూడ ఉషోదయం కలిగింది. ప్రేమ్‌చంద్ ద్రష్ట. గతాన్నితడివి, తననాటి పరిస్థితుల్ని పరిశీలిస్తూ, భవిష్యత్తులోకి తొంగిచూడగలిగాడు. వికాస క్రమంలో రాబోయే చరిత్ర గమనంకూడ అంచనా వేయగలిగాడు ఆయన రాసిన మానవీయ సామాజిక సత్యాలు, మనోవైజ్ఞానిక చిత్రణలు, కొన్ని ఎంత సజీవమైనవంటే వాటికి ముసలితనం ఉండదు. అలాంటి వ్యక్తిత్వాన్ని గురించి, "రచయిత పాతవాడు కనుక రచనలు పాతబడ్డాయి"అని ఎటువంటివాళ్లు అంటారు? వాళ్లు ఎన్నడైనా ఆయన రచనలు మనసుంచి చూచారా? అని మథనపడ్డాను.

ప్రేమ్‌చంద్ అనంతరం ఆయన పుత్రుడు అమృత్‌రాయ్ 3500 పుటలదాకా మరుగునపడిన ఆయన సాహిత్యాన్ని వెలుగులోకి తెచ్చాడు. ఆయన రచనల్ని గురించిన విమర్శలు వ్యాఖ్యలు– బండెడు సాహిత్యం వెలువడింది; దేశవిదేశాల్లో ఇంకా వెలువడుతూనే ఉంది బెర్నార్డ్‌షా కాబోలు, ఒకసారి ఇలా అంటాడు :— మానవుడు ఎంత ప్రతిభావంతుడో తెలుసుకోవాలంటే షేక్స్‌పియర్ చదవండి; మానవుడెంత మూర్ఖుడో తెలియాలంటే షేక్స్‌పియర్‌పై వ్యాఖ్యానాలు చూడండి. ప్రేమ్‌చంద్ విషయం కూడా అంతే.

1920 కి పూర్వం ఉర్దూ సాహిత్యంలో ఉజ్జ్వలంగా ప్రకాశించిన ప్రేంచంద్ ఒక్కసారిగా "సేవాసదన్" అచ్చుకావడంతోటే సమకాలీన హిందీ సాహిత్య జగత్తులో తన రంగంలో నిరుపమానుడై వెలుగొందడం, ఎంతో ఆశ్చర్యం కల్గిస్తుంది. ఆనాటి ఉర్దూ విద్వాంసుడు మౌలానా శిబ్లీ "హిందూదేశంలో ఇప్పుడు 7 కోట్ల

---

తన అనారోగ్యన్ని కూడ లెక్క పెట్టకుండా, మందులు కూడ తీసుకోకుండా అదా పైసల తోసహా 'హంస' పత్రిక నిర్వహణకు ఖర్చు పెట్టాడు. ఆయన చనిపోయినపుడు అంత్యక్రియలకు సరిపోయే డబ్బుకూడ యింట్లోలేదట. తాను చిత్రించిన జీవితాన్ని స్వయంగా జీవించిన రచయిత ప్రేంచంద్.

మంది ముసల్మానులున్నారు. కాని ఒక్క ముసల్మాను కూడ ఇంత చక్కని ఉర్దూ వ్రాయలేడు." అని ప్రశంసించాడు. అలాటివాడు 1925 లోనే హిందీ 'ఉపన్యాస సమ్రాట్'గా ప్రసిద్ధి చెందాడు. ఇది ఏ సామంతుడో ప్రధానం చేసిన బిరుదంకాదు. సామాన్య పాఠకలోకం నించి ఉబికివచ్చిన గుర్తింపు. ఆయనమహనీయ కళాకారుడే కాని గొప్ప విద్వాంసుడుకాడు. ఏ అభిమాన రచయిత శైలినో ఆయన అనుకరించ లేదు. అందుకే ఆయన హిందీశైలి అనన్యంగా రూపొందింది.

ఉర్దూలో నవాబ్‌రాయ్‌గా 'సోజ్-ఇ-వతన్' (మాతృదేశ స్ఫులింగాలు) ప్రచు రించినప్పుడు బ్రిటిష్ ప్రభుత్వం ఆయనపై విరుచుకు పడింది. ఆ పుస్తకాన్ని నిషేధించి ప్రతులను తగులబెట్టించింది. మళ్లీ నవాబ్‌రాయ్ ఏది రాయాలన్నా అధి కారులకుచూపి, జిల్లా మెజిస్ట్రేటు అనుమతి పొందితేనే ప్రచురించాలని ఆదేశించింది. అంతటితో ఉర్దూ నవాబ్‌రాయ్ అంతరించి హిందీ ప్రేంచంద్ అవతరించాడు. భాషమారింది. విధానం కూడ మారింది. విదేశీ ప్రభుత్వం కళ్లల్లో దుమ్ము చల్లి, నిర్విరామంగా రచనలు సాగించాడు. చాలకాలం వరకు ఆయనే ఈయన అనేవిషయం స్వయంగా భార్య శివరాణికి కూడ తెలియదు

అనేక విదేశాల్లో ప్రేంచంద్ గురించిన చర్చలు పరిశోధనలు జరిగాయి. జకోస్లేవేకియాలో చెక్ భాషలో డా॥ ఓడేలిన్ స్మెకిల్ (గ్రామీణ జీవన విషయంగా హిందీ నవలా సాహిత్య అధ్యయనం), జర్మనీలో సీగ్ ఫ్రిడ్ ఎషర్జ్ (డికెన్స్, ప్రేమ్‌చంద్‌ల తారతమ్య పరిశీలన) ఇంగ్లీషులో రాబర్ట్ ఓ. స్వాన్ (లమ్‌హీ గ్రామ స్థుడు ప్రేమ్‌చంద్ అనే గ్రంథం)రచనలగూర్చి ఇటీవలే చదివాను. సత్యజిత్‌రాయ్ మృణాల్‌సేన్ వంటి సుప్రసిద్ధులైన చలనచిత్ర దర్శకులు ఈమధ్యనే "షత్‌రంజ్‌కే ఖిలాడీ", "కఫన్" ( తెలుగులో తీసిన "ఒక ఊరికథ" ) కథానికలను ఫిల్మీక రించారు. కాని ఈ రెండు సినిమాల్లోను వారు స్వతంత్రించి చేసిన మార్పులతో ప్రేమ్ చంద్ ఆశయానికి అన్యాయం జరిగిందనే చెప్పాలి. ఇదంతాఎందుకు చెప్పా నంటే, ప్రేమ్‌చంద్ రగిలించిన చైతన్య స్ఫులింగాలు ఇంకా ప్రజ్వరిల్లుతూనే ఉన్నాయని చూపడానికి. దేశ దేశాల భాషల్లోకి ఇంకా ప్రేమ్‌చంద్ సాహిత్యం పాకుతూనే ఉంది. భారతీయభాషల్లో విరివిగా ఆయన సాహిత్యం వస్తూనే ఉంది.

"వెయ్యిపడగలు" తర్వాత చాలకాలానికి వెలువడినా అదే "మాలపల్లి" కంటే పాతదనిపిస్తుంది. పాతదనం దేనివల్ల వస్తుంది? "వెయ్యిపడగలు" వెనక్కిపోమ్మం టుంది. వందల ఏళ్ళనాటి జమీందారీవిధానాన్ని ఉత్తమంగా చిత్రించి ఆహ్వానిస్తుంది.

"మాలపల్లి" ముందుకు చూస్తుంది. నిద్రాణదశను గుర్తించి మేల్కొలుపుతుంది. కొత్తను కోల్పోని పాతరచన అది. ప్రేమ్‌చంద్ రచనలు సమాజంలోని అన్నితీరుల దోపిడీని బట్టబయలు చేసి, సమసమాజ ఆకాంక్షను మనలో రేకెత్తిస్తాయి. మన సమాజం శోషలిజాన్నిస్థాపించి అధిగమించి పోయినట్టుగా సంతోషిస్తూ, ప్రేమ్‌చంద్ ప్రగతిశీలమైన రచనల్ని పాతబడ్డాయనటం "ఆధునికుల" పవిత్రమైన కోరికే అవుతుంది కాని వాస్తవం కాదు.

ప్రేమ్‌చంద్ తన అశేష రచనల్లో ఏ భారతదేశాన్ని చిత్రించాడో, అది ఇప్పటికీ అలాగే ఉంది. కఫన్(శవాచ్ఛాదన), "పూస్‌కీరాత్" (పుష్యమాసం రాత్రి) వంటి కథల్లో ఏ పేదరికం వడపోసి చూపాడో, ఆ పేదరికం ఇంకా ఈ దేశంలో నగ్నతాండవం చేస్తూనే ఉంది. జమీందార్ల, సాహుకార్ల, పెత్తందార్ల పంజాల్లోనలిగి పోయే గ్రామ జీవితం గుణాత్మకంగా చూస్తే, ఇప్పటికీ అలానే ఉంది. "గోదాన్", "ప్రేమాశ్రమ్" నవలల్లో ఈ జీవితతత్త్వాన్నీ, వాటి దుష్ఫలితాల్నీ కన్నుల గట్టించాడు. ప్రేమ్‌చంద్ "వరదాన్"లో చిత్రించినట్లు, మూఢవిశ్వాసాల్లో మునిగిపోయిన గ్రామీణ జీవితం నేటికీ అంతే చీకటిమయంగా ఉంది. యువ వితంతువుల గోడు, స్త్రీలను పతనోన్ముఖులుగా చేసే సామాజిక నియంత్రణలు (ప్రతిజ్ఞ, సేవాసదన్ నవలలు) నాటికీ,నేటికీ అణుమాత్రమైనా మారాయని చెప్పగలమా? వైవాహిక జీవిత స్వప్నాలు కనే యువతిని ఒక ముదివగ్గుకు కట్టబెట్టటం ( నిర్మలా ) ఈనాటి ఆర్థిక పరిస్థితుల్లో ఊహించలేని అంశమా! ఫ్యాక్టరీలు కట్టుకోడానికి పేదరైతుల్ని వెళ్లగొట్టి వారిభూములు ఆక్రమించుకోడం, దానికి వ్యతిరేకంగా "రంగభూమి"లో సూరదాస్ నడిపిన సంఘర్షణ, నేటికి ఇంకా బాగా అన్వయిస్తాయంటే ఆశ్చర్యమా?

"కాయాకల్ప" 1926 నాటి నవల, ఆనాటి కాంగ్రెస్ పెద్దలు మంత్రిమండలిలో చేరే విషయంమీద చర్చలు సాగిస్తున్నారు రాజకీయధికారం బాముకోవాలనే నాయకుల తహ తహ ఈ నవలలో ప్రధానాంశం. పదవీదాహం, దురాశ, స్వయం కేంద్రిత భావాలుగల నాయకమ్మన్యులు అధికారం లభించగానే ఎంత వికృతంగా తయారవుతారో, ఎలా రంగులు మారుస్తుంటారో వర్ణించిన ఈ గాథ ఈనాటిది కాకుండా పోతుందా? ఇక "గబన్" లో - గొప్పలకు పోయి. తమ అంతస్తులు, హోదాలు చాటుకోవాలనే లాలసతో ప్రభుత్వ ధనం కాజేసే దుస్థితికి తెగబడిన రామనాథం కథ గోపన్న ("భక్త" రామదాసు) కాలం నాటిదే కావాలా? "నమక్ కా దారోగా" కథలో లంచం జీవనవిధానంగా మారిపోయినట్లు చూస్తాం. ఈ ఇతివృత్తం పాతబడే అదృష్టం ఇంకా ఈ దేశానికి పట్టలేదు.

రైతులు కూలీలపై ధనికవర్గపీడనాన్ని ప్రేమ్‌చంద్ తీవ్రంగా నిరసించాడు. స్వాతంత్ర్య సమరం తీవ్రస్థాయిలో ఉన్నప్పుడు 1931 లో రాసినకథ, "ఆహుతి" ఆయన దృక్పథానికి ఇది ఒక గీటురాయి ఈ కథలో ముఖ్యపాత్రనోట ప్రేమ్‌చంద్ ఇలా అనిపిస్తాడు "ధనం యొక్క ఆధిక్యత, చదువుకున్న వాళ్ళ స్వార్థచింతన. దేశం స్వతంత్రమైన తర్వాతకూడ, ఈనాటిలాగే కొనసాగితే, ఈ దేశానికి ఎన్నడూ స్వాతంత్ర్యం రాకపోవడమే మంచిదంటాను. బ్రిటిష్ శాసకుల దురాశ, విద్యావంతుల స్వార్థచింతన మనల్ని కుంగదీస్తున్నాయి ఎన్నో తప్పుడు విధానాలకు వ్యతిరేకంగా ప్రాణాలొడ్డి మనం పోరాడుతున్నాం. కేవలం విదేశీయులుకాక స్వదేశీయులేగదా అని ఇలాటి తప్పుడు విధానాలను స్వీకరిస్తామా? జాన్ స్థానంలో జానయ్యను కూచోబెట్టటమేనా ఆశయం? స్వరాజ్యం అంటే ఇదే అని కనీసం నేనైతే భావించను."

'ప్రేమ్‌చంద్ నవలాకారుడు కంటె ఒక గొప్ప కథాకారుడు' అంటారు కొందరు విమర్శకులు, అమృత్‌రాయ్‌తోసహా, కొందరు 'కర్మభూమి' గోర్కీ యొక్క అమ్మతో పోల్చదగిన నవల అంటారు. నవలా సామ్రాట్టుగా ప్రస్తుతి పొందిన ఆయన నవలలను గూర్చిన కొన్ని విశేషాలతో ఈ వ్యాసం ముగిస్తాను.

కిష్నా : ఈ ఉర్దూ నవల ఈనాటికీ లభ్యం కాకపోవటం విచారకరం. ఇండియా ఆఫీస్ లైబ్రరీ, లండన్‌లోని గ్రంథ సూచికలో ఇలా ఉన్నది. "నవాబ్‌రాయ్- కిష్నా. కథానాయిక పేరుతో వెలువడిన సాంఘిక నవల. 'ఇండియన్ సోషల్ రిఫార్మ్' పుస్తకమాల వారి తొలి ప్రచురణ. డిశంబరు 1906 పుటలు 141. వెల 8 అణాలు. 1907 లో "జమానా" పత్రికలో దీని సమీక్షకూడఉంది.

అసరారే ముఆబిద్ (దేవాలయ రహస్యం) : తన ఈ తొలి నవలలో ప్రేంచంద్ సమాజంలోని కొన్నికటువైన యదార్థాల్ని చిత్రించాడు. లింగేశ్వరనాథ్ దేవాలయం పూజారి, ఆయన శిష్యవర్గం పాల్పడిన నీచవ్యవహారాలు ఇతివృత్తం మతం చాటు చేసుకొన్న వీళ్ల చేతుల్లో అమాయకస్త్రీలు ఎలా పతనం చెందుతారో వర్ణిస్తాడు. 23 ఏళ్ల వయసులో మతం పేరిట జరిగేకుళ్లను బయట పెట్టటంలో ప్రారంభమైన ప్రేంచంద్ యొక్క సామాజిక చైతన్య స్రవంతి 56 ఏండ్ల వయస్సుదాకా నిరాఘాటంగా కొనసాగింది. ధార్మిక, సామాజికపరిస్థితుల విషఫలితాలను ప్రదర్శిస్తూ 'కఫన్' కథ "గోదాన్" నవల రచన దాకా సాగింది. అసరారే ముఆబిద్ ప్రేంచంద్ మొట్టమొదటి నవలగా ఆనాటి ఉర్దూ సాహిత్య పత్రికలో ధారావాహికంగా వెలువడి,

1962 లో అమృత్‌రాయ్ ద్వారా పునరుద్ధరింపబడిన సాహిత్యంతో బాటు వెలుగులోకి వచ్చింది.

ప్రేమ్‌చంద్ తొలి హిందీ నవల, 'ప్రేమా' ఇది ఆయన ఉర్దూ నవల 'హమ్ ఖుర్మా-వ-హమ్ సవాబ్' కు అనువాదం. నాటి అనేక హిందీ పత్రికల్లో దీని వ్యాపార ప్రకటనలు వెలువడ్డాయి. 1909 లో 'సరస్వతి' లో వచ్చిన ఈ ప్రకటన చూడండి.

"ప్రేమా"

ఈ నవల హిందీలో పూర్తిగా కొత్తపోకడ, మనోహరము, విజ్ఞానదాయకము అయిన రచన ఎంతో ఆకర్షణీయమైన భాషలో వ్రాయబడింది. ఈనవల చదువుతుంటే దేశ పరిస్థితిపై దుఃఖం కలుగుతుంది; కన్నీరు కార్చవలసిందే ఒకసారి ఒకరి ప్రేమప్రవాహంలో విహ్వలురైతే మరోచోట వీరరసం అనుభూతితో వెంట్రుకలు నిక్కపొడుచుకుంటాయి వెల ఏమంత ఎక్కువకాదు. 236 పుటల పుస్తకం కేవలం పది అణాలు. వెంటనే తెప్పించుకోండి ప్రేమా యొక్క నిజమైన ప్రేమ కథ చదివి మానసికానందం పొందండి.

ఇది ఆనాటి ప్రకటన తీరు. ఇందులో ఎక్కడా ప్రేమ్‌చంద్ పేరు లేక పోవడం విశేషం.

<u>సేవాసదన్</u> (1907): పరిస్థితుల ప్రాబల్యానికి బలియై, సంశయ బుద్ధియైన భర్త ప్రవర్తనతో "కులట" గా మారిన ఒక యువతి కరుణ కథ హిందీ, ఉర్దూ రెండు భాషల్లోను ఇదే మొదటి సాంఘిక నవల

నిర్మలా (1923) విలక్షణమైన నవల. భారతీయ స్త్రీ వేదనగూర్చిన హృదయ విదారకమైన సజీవ చిత్రణ. ఈ అభాగ్య స్త్రీ కన్నీటి గాథలో వరకట్న విధానం, కన్యా-వృద్ధ వివాహ దురాచారం మొదలైన వ్యవస్థా గత సామాజిక దోషాలను వేలెత్తి చూపి, పాఠకుని హృదయం స్పందింపజేస్తాడు ప్రేమ్‌చంద్.

<u>గబన్</u> (1930): నగలపై భార్య యొక్క తీరని వ్యామోహం - ఆర్థిక సంకటం భర్త - పలాయనం - కడకు నగలన్నీ అమ్మివేసి పరిస్థితుల విష వలయం నుండి భర్తను కాపాడుకోటం - ఇది ఇతి వృత్తం, పోలీసుల అమానుషమైన, హేయమైన ప్రవర్తన యీనాటిదేకాదు యీవ్యవస్థా గతంగా ఏనాటి నుంచో వస్తున్నదని యిందులో మనం చూడగలుగుతాము.

ప్రేమాశ్రమ్ ప్రసిద్ధ నవల: పోలీసు బలగం అండతో పశుప్రాయుడైన భూస్వామి దౌర్జన్యాలు – వాటిని ఎదుర్కొనటానికి ఉత్తేజితుడై కౌలుదారు (రైతు) సాగించే సంఘర్షణ గాథ.

కర్మభూమి (1932): స్వాతంత్ర్యోద్యమం, 1929లో వచ్చిన కరువు ప్రభావం, దేశవ్యాప్తంగా రైతుల ఆర్థిక విమోచనకోసం జరిగిన ఆందోళన ఈ నవలకు భూమికగా ఏర్పడినాయి నవజాగృతి గీతం ఆలపించిన సాహిత్యకళాఖండం ఈ రచన ఈ నవలతోనే ప్రేమ్‌చంద్ భారతీయ గోర్కీగా ప్రశస్తి పొందాడు.

రంగభూమి: ఈ నవల రాస్తున్నప్పుడే పండిట్ దులారేలాల్ భార్గవ దానిని ముద్రించేందుకు ముందుకు వచ్చాడు. ప్రకాశకుడు ఇలా రాశాడు. "రచన కాక ముందునుంచే ఈ నవలకు గిరాకీ ఉండటంతో ఇంత పెద్దనవల ఐనా 5000 ప్రతులు అచ్చొత్తించాము. ఇది హిందీ జగత్తులో అపూర్వవిషయం. ఇంత పెద్ద ఎత్తున మరేసాహిత్య గ్రంథమూ హిందీలో ఇంతవరకు ప్రచురితం కాలేదనుకుంటాను." అంతకన్న పెద్ద విశేషం ఏమంటే ఈ సాహిత్యజ్ఞుడైన ప్రకాశకుడు మొత్తం 5000 ప్రతులకు లెక్కగట్టి రాయల్టీ 1800 రూపాయలు అమ్మకంతో నిమిత్తం లేకుండానే అచ్చు పూర్తికాగానే ప్రేమ్‌చంద్‌కు చెల్లించాడు. కథానాయకుడు సూరదాసు ఒక బిచ్చగాడు. ఆత్మగౌరవం, ఉదారబుద్ధి కలవాడు బయటినుండి ధనికులు కొందరు ఫ్యాక్టరీలు కట్టడానికివచ్చి భూములు కొనేస్తుంటారు. జూదం, తాగుడుకూడ వాటితో పాటు ప్రవేశిస్తాయి కార్మికులకు ఇల్లు కట్టించాలనే నెపంతో గ్రామస్థులను వెళ్ళగొడతారు. సూరదాసు పట్టణానికి వెళ్ళి, తన గ్రామానికి జరిగిన అన్యాయాల్ని ప్రచారం చేస్తాడు ఈ ఉద్యమంలోనే నిప్పంటుకున్న తన గుడిసెలోనే ఆహుతి అయిపోతాడు.

గోదాన్ (1936): ఆయన అత్యుత్తమకళాఖండం. ధనిక వర్గం, పీడిత వర్గం మధ్యగల అఘాతాన్ని స్పష్టంగా చిత్రిస్తుంది. ఇతివృత్తానికి కేంద్రం రైతు అతనికి ఒకవైపున సామాజిక, రాజకీయ ఆర్థిక విషమవ్యవస్థ. మరోవైపున తన సొంత గుడ్డినమ్మకాలు, సంప్రదాయాలూ, స్వార్థప్రయోజనాలు, బలహీనతలు వత్తిడి కలిగిస్తుంటాయి. సమాజంలో ప్రతిష్ఠితులైన స్వార్థశక్తులు. తమ ఎత్తుగడలతో– పొలాల్లో కర్మాగారాల్లో పని చేసేవాళ్లను ఎలాదోపిడి చేస్తారో, వారి రక్తంతాగి ఎలాబలుస్తారో ఈ రచన చిత్రిస్తుంది. రెక్కలు ముక్కలు చేసుకున్నా సురక్షితమైన మనుగడకు నోచుకోని ఈ వర్గం అనాదిగా అసహాయులుగానే కొనసాగుతున్నారు.

ఈవర్గానికి ప్రతినిధిగా 'గోదాన్'లో హోరీమనకు సాక్షాత్కరిస్తాడు. అన్యాయాలకు, ఆపత్తులకు అణచివేతకు గురి అవుతూన్నా, అతనిలో ఔదార్యం మాత్రం చావలేదు. నిజాయితీపరుడైన చిన్నరైతుగా, బ్రతుకు ఈడ్వడానికి చేస్తూపోయిన ఋణభారంతో కృంగిపోతాడు. షావుకార్లు, జమీందార్లు బ్రతికినన్నాళ్లు దోచుకున్నారు. చావసిద్ధంగా ఉన్న సమయంలో పురోహితుడు వచ్చిఉన్న ఆవును కాస్తా దానంచేసి మనకు పుణ్యలోకాలు కనిపించవంటాడు

ప్రేమ్‌చంద్ చూపు ఏమిటో ఈ కొద్దిపాటి పరిచయంతో మనకు అవగాహన అవుతుంది. ఆయన ఆకాంక్షలు ఇంకా వెలుగు చూడాల్సే ఉంది. ముందుచూపుతో· చైతన్యమూ, ప్రేరణా లక్ష్యాలుగా, సమాజం మేలుకోసం చేసిన రచనలు ఆయనవి. గుడ్డి నమ్మకాలపైనా,తిరోగమనవాదంపైన, దోపిడిపైనా సమర శంఖారావం చేసిన ప్రజలమనిషి ఆయన రైతుకూలీల పక్షం వహించిన కలం సిపాయి ప్రగతి శీలిగా, సమాజ పతాకం సమున్నతం చేసిన భారతీయ గోర్కీ ప్రేమ్‌చంద్. అందుకే నేటికీ ఆయన రచనలు ఈనాటి సమస్యలకు సజీవ చిత్రాలుగా చదివింపు కుంటున్నాయి. ప్రేమ్‌చంద్‌కు 100 ఏళ్లు నిండాయిగాని అతని రచనల్లో ఆశయాలు ఇంకా అవతరించనేలేదు. వాటిని సాకారం చెయ్యడం మనందరి బాధ్యత.

కష్టజీవుల కడగండ్లను గూర్చి అడుగడుగునా ప్రేమ్‌చంద్ ఎంత ఆవేదన వ్యక్తం చేస్తాడో, పాఠకుణ్ణి ఎంతగా ప్రతి స్పందింప చేస్తాడో, ఏకొద్ది రచనలు చూసినా తెలుస్తుంది. ఆయన గతించి అర్థ శతాబ్దం కావస్తోంది. అయినా నేటి నిరుపేదల గురించి మన సమాజాన్ని నడిపే పెద్దలు ఏమంటున్నారు? ఏంచేస్తున్నారు? సమాజ సేవకు అంతర్జాతీయ ఖ్యాతినొందిన మదర్ థెరిసా లాంటివాళ్లు, "దేవుడు పేదవాళ్లను ఎందుకు సృష్టించాడు?" అని ప్రశ్నించుకుని "వాళ్లకు సేవచేసే మహద్భాగ్యం మనకు కలిగించడానికే" అని సమాధానం చెప్తున్నారు. అంటే మనమంతా సేవచేసి తరించడానికి పేదరికం ఎప్పటికీ ఉండిపోవలసిందే. ఇకభారత రాష్ట్రపతితో సహా మన రాజకీయ నాయకులు దినదినంచేసే ఉపన్యాసాలు ఏం వ్యక్తంచేస్తున్నాయి? పేదల కష్టాలు రోజు రోజుకూ ఎక్కువవుతున్నాయి ఇక ఎంతో కాలం వాళ్లు సహించబోరు. మనమేదైతా వాళ్లకింత మేలుచేస్తే తప్ప, ఏ విప్లవమో రాక తప్పదు. ఈ దృక్పథంలో కనిపించేది పేదరికం పోవాలనే ఆదుర్దాకాదు. పేదలు సహనం కోల్పోయి తిరగబడతారేమో అని భయం. ఇది ధనికులకు జాగ్రత్తపడాలనే హెచ్చరికలాగానే వినిపిస్తుందిగాని, సాటి మానవుల పేదరికాన్ని తొలగించి, సమ

# 'మహాజనీ' సభ్యత

ప్రేమ్‌చంద్

[మరో మాసానికి చనిపోతాడనగా ప్రేమ్‌చంద్ 1936లో ప్రచురించిన ఈవ్యాసం, ఆయన దృక్పథంలో వచ్చిన గొప్పమార్పుని సూచిస్తుంది. సాంఘిక అక్రమాలపట్ల ఆయనలో ప్రబలంగా వుండిన టాల్‌స్టాయన్ వైఖరి మూలంగా రైతాంగ సమస్యకు మహాజనిత పరిష్కారాలు చూపుతూ వచ్చిన ప్రేమ్‌చంద్, ఇప్పుడు ధనసంబంధం మీద ఆధారపడిన సాంఘిక వ్యవస్థస్థానే మానవసంబంధాలమీద ఆధారపడే నూతన సంస్కృతిని ఆహ్వానిస్తున్నాడని ఈవ్యాసం సూచిస్తుంది. లాభార్జన మూలధారమైన నేటి సంస్కృతిని ఖండించడంలో తాను ఒకొకప్పుడు వెనకటి భూస్వామిక సంస్కృతిని ఆదర్శీకరిస్తున్నాడా అనిపిస్తుంది కూడా. అయినా ఈ రచనను ప్రేంచంద్ అంతిమ ప్రకటనగా – టెస్టమెంట్ – భావించడం జరుగుతుంది. "మహాజనీ" అనే మాటకు వడ్డీ - వ్యాపారం అర్థం. కాబట్టి ఈ శీర్షికను ధనస్వామిక సంస్కృతి అని మార్చ వచ్చు కె.వి.ఆర్.]

ఆనందించు అమృతపాణివై, ఓనా హృదయమా,
రక్షకుడు నీవైపు దయచేస్తున్నాడు,
అటుచూడు, ప్రజల నిశ్వాసం నుండి
మధుర పరీమళం వెలువడుతూంది.

–ఒక పర్షియన్ కవిత నుండి

భూస్వామిక వ్యవస్థలోనూ రాచరిక విధానంలోనూ దృఢమైన హస్తాలూ ధీరహృదయమూ జీవిత ఆవశ్యకాలనుకునేవారు బుద్ధిబలం, వచశ్శక్తి, అధికారమంటే అచంచలమైన విధేయత ముఖ్యమనిపించుకునేవి. ఈ వ్యవస్థలో ఈ విధానంలో లోపాలెన్నైనా వుండవచ్చుగాని, మంచి లక్షణాలు పూర్తిగాలేకుండా పోలేదు. ఒకానొక జాగీర్దారు తనప్రతీకారాగ్నిని శత్రు రక్తంతో చల్లార్చుకోగోరి వుండవచ్చుగాని, మిత్రుని కోసమో హితుని కోసమో తన ప్రాణాన్ని తృణంగా సమర్పించనూ

---

సమాజం స్థాపించాలనే సంకల్పంలా కనిపించదు. ప్రేమ్‌చంద్ కోరింది పేదలపై సానుభూతికాదు. దేశసంపదలో వారికిచెందాల్సిన భాగం తాలూకు హక్కు. అందుకు ఆయన తన జీవితమంతా కొవ్వొత్తి చేసి వెలిగించాడు పేదరికం ఉన్నంతవరకూ ప్రేమ్‌చంద్ స్మృతి మనల్ని ప్రశ్నిస్తూనే ఉంటుంది ఆయన ఆశయసాధనకు తగిన చైతన్యం పొందడమే మనం ఈనాడు ఆయనకుఅర్పించాల్సిన జోహారులు.

వచ్చు. రాజు సంకల్పించిందే చట్టం. దాని అతిక్రమణను అతగాదెన్నడూ క్షమించి వదలడు. అయినా పాలితుల శ్రేయస్సు కోసం పాటుబడేవాడు, న్యాయపాలనలో నిష్పక్షపాతంగా వ్యవహరించేవాడు పరోదేశం మీద దండయాత్ర చేసాడంటే వారి అపరాధాన్ని దండిద్దామనో, పగతీర్చుకుందామనో, లేక రాజోచితమైన తన ప్రతిష్ఠనీ నిలుపుకుందామనో, అదీగాకపోతే అన్యదేశాలను పౌరులతో జయించి తనసామ్రాజ్యాన్ని విస్తరింపజేద్దామనో అలా జరిగేది ఈ దండయాత్రలక్ష్యం తన పౌరులను దోపిడీ చేయడమైవుండదు. రాజులూ, చక్రవర్తులు తమతమ స్వార్థ ప్రయోజనాల సాధనకు గానీ ధనాన్ని ఆర్జించడానికిగాని జన సామాన్యాన్ని యుద్ధరాక్షసికి చిఱదిండిగా అర్పించేవారు కాదు సరిగదా, వారు ప్రజల సుఖ దుఃఖాలలో పాలుపంచుకుని, వారి శక్తి సామర్థ్యాలకు ఇవ్వవలసినంత ఇచ్చేవారు.

అయితే ఈనాటి 'మహాజనీ' వ్యవస్థలో ధనమే పరమార్థమై పోయింది. ఒకానొక దేశాన్ని పాలిస్తున్నామంటే వడ్డీ-వ్యాపారులకూ పెట్టుబడీదారులకూ అంతు పొంతులేని లాభాలను సమకూర్చిపెట్టడానికే. దీని దృష్ట్యా, వడ్డీ వ్యాపారులే నేడు ప్రపంచ పరిపాలకులనడం సబబైన మాట. మానవ సమాజం రెండుగా చీలింది. చాలా యెక్కువ భాగం తను చెమటకార్చి కాయకష్టం చేస్తూంటే, చాలా స్వల్పభాగం తన అధికారం పలుకుబడి మూలంగా ఒక్కన సమాజాన్ని తన పుక్కు పిడికిట్లో నొక్కివేస్తూంది. ఈ అధిక సంఖ్యాకుల పట్ల దానికి సానుభూతిగాని జాలిగానిలేవు వీరు వుండేదల్లా యజమానులకోసం చెమటకార్చేందుకూ, రక్తంచిందించేందుకూ ఆ తర్వాత ఏదో ఒకరోజున యీలోకాన్ని విడిచివెళ్లేందుకూ అన్నమాట. విచారకరమైన విషయం ఏమిటంటే ఇలాంటి ఆలోచనాసరళి పాలకవర్గానిదే అయినా పాలితుల భావాల లోకిగూడా యిది దూరగలగడమే. ఫలితం, ప్రతివ్యక్తీ క్రూరజంతువుగామారి సమాజాన్ని వేటాడి చంపబూనురాడు. దానితో తనకున్న ఏకైక సంబంధం యేమిటీ అంటే, ఎలాగో దాని కన్ను గప్పి దానివల్ల వీలైనంత ఎక్కువ ధనం రాబట్టుకోవడానికి ఏదో యుక్తినీ పన్నాగాన్నీ ప్రకటించడమే.

ధనంకోసం యీ పేరాశ తతిమా మానవ గుణాల నన్నిటినీ లోబరచుకుంది. ఒకరి సాంఘిక అంతస్తునీ ఒకరి సామర్థ్యాన్నీ నిర్ణయించేది ధనం ఒక్కటే. నీ హృదయం ఎంత కారు నల్లటిదైనాగానీ, ధనముంటేచాలు, నువ్వు దేవుడివి కాగలవు. ధనదేవత బలివేదిక ముందు నిలిచి సాహిత్యమూ సంగీతమూ కళా తలలు వంచి పూజ చెయ్యవలసిందే. తేలికగా వూపిరిపీల్చుకోజాలనంతగా కలుషితమౌతూంది ఈ

వాతావరణం. డాక్టరేగాని, హకీమేగానీ తను కోరే విపరీతమైన "ఫీజు" చేతికి రాందే రోగి కేసి చూడనైనా చూడడు, పలుకనైనా పలుకడు. లాయరు ప్రతి నిమిషాన్నీ రూపాయలా పైసల రూపంలోనే చూస్తాడు. శక్తిసామర్థ్యాలను సక్రమంగా నిర్ధారించేసి వాటి బజారువిలువను బట్టే. "మౌల్వీ"లూ "పండిట్"లూ ఇష్టపూర్తిగానే ధనికులకు వూడిగం చేస్తారు — "పసిడి గల్గువాని బానిస కొడుకులు" వార్తాపత్రికలు ఆలాపించేది ధనం రాగాన్నే. ఎటువైపునుంచైనా సరే దాని ఆధిపత్యాన్ని ఎదుర్కోవడం ప్రమాదమై పోయేంతగా ఇది మనిషి మనస్సునీ హృదయాన్నీ అధీనం చేసుకుని వుంటూంది ప్రేమ, కరుణ, నిజాయితీ, సాధుత్వం — యిలాంటివన్నీ తనలో గూడుగట్టుకునివున్నాయని ఒకనాడనుకున్న మనిషి,దయాదాక్షిణ్యాలంటే ప్రేమాభిమానాలంటే యేమిటోగూడా తెలీని ప్రాణరహితమైన యంత్రంలా రూపొందాడు. ఈ "మహాజనీ" నాగరికత కొత్త కొత్త నియమ నిబంధనలమీద ఆమోద ముద్ర వేసింది. వాటి ప్రకారమే ఈనాడు సమాజం నడుచుకుంటూంది. అలాంటి సూత్రాలలో ఒకటేమిటంటే, కాలం అంటే ధనం. ఒకప్పుడు కాలం అంటే జీవితం. విద్యా సంస్కృతుల సముపార్జనకో, పేద సాదలసేవకో అనాథల సంరక్షణకో, ఒకవుదాత్తమైన ప్రయోజనానికి అది వినియోగపడేది. మరి యీ రోజుల్లో ధనార్జనకు వినియోగపడడంకంటె దానికివుదాత్తమైన వినియోగమేదీ లేకుండావచ్చింది డాక్టరుగారిచేతివేళ్లు రోగి నాడిమీద వుండవచ్చుగాని అతనికళ్ళు మాత్రం చేతిగడియారానికి అతుక్కున్నట్టుంటాయి. గడిచే ప్రతినిమిషం అతని కంతగణన అని అర్థం. రోగి ఒక రూపాయి తీసి యిస్తే, నిమిషం మించి అతన్ని చూడడం జరగదు. తన సొదసంతా వినిపించాలని రోగికుంటుంది గాని ఉదార పురుషుడైన వైద్యుడి చెవికెక్కదు. ఏమాత్రం ఆసక్తి లేదతనికి. తన చూపుకి, రోగి ప్రతి ఫలం రాబట్టుకోదగిన శరణార్థి మాత్రమే. ఏదో ప్రిస్క్రిప్షన్ గీకి, మరో రోగివద్దకు పోతాడు. పాఠాలు చెప్పిపోయేందుకు వచ్చే ట్యూటరు ఒక గంటసేపు కూర్చోవాలి. అలా కూర్చున్నంతకాలం చేతి గడియారం అతగాడి ముందుంటుంది. విద్యార్థి సగం పాఠమే చదివాడనుకోండి, ట్యూటరు కేమీ పట్టదు ఆ గంట అయిందో లేదో, పైకి లేస్తాడు. గంటసేపటికంటె ఎక్కువకాలం తానెలా వుండగలడు — కాలమంటే ధనం గదా మరి? ఈ ధన-ఆరాధన స్నేహానికీ మానవీయతకీ వుండిన అర్థాన్నంతటినీ వొలిచి పారేసింది. మిత్రుల్నీ, బంధువుల్నీ అటుంచుదాం, ఆలుబిడ్డలతో కాస్త హాయిగా పొద్దుపుచ్చేందుకు గూడా భర్తగారికి టైం చాలదు. వారితో ముచ్చట్లాడిన సమయంలోనే మరో పనిచేస్తే ఎంత సంపాదించి వుండవచ్చో! ఏదోసంపా

దించడానికి ఖర్చు చేసిన కాలానికే సార్థకత వుంటుంది. లేకుంటే తాను సదవకాశాన్నల్లా పాడు చేసుకున్నట్టే. తిండీ తీరుబాటూ తప్పని సరికదా, వాటికోసం "అమూల్యమైన" తన కాలాన్ని వృథా చెయ్యక తప్పదు. పాపం

బస్తీలోవున్న నీ మిత్రుడు, లేదా నీ బంధువు సుప్రసిద్ధుడయ్యాడా, మరి అతగాణ్ణి నువ్వు పోగొట్టుకున్నావని నిశ్చయంగా అనుకోవచ్చు. ముందు ఒకకార్డురాసి లోనికి పంపందే ఆ యింటిలోకే నీకు ప్రవేశం ఉండదు ఆపెద్దమనిషికి ఎన్ని పనులూ ఎన్ని పనులూ— నీ కోసమని ఒకటి రెండు క్షణాలకంటె అదనంగా ఖర్చు చెయ్యలేడు; లేదూ, తనకు టైములేదని నీముఖాన్నే అనేసినా అనెయ్యగలడు. ఇప్పు డతగాడు ధనానికి భక్తుడు, స్నేహం, మర్యాదా మప్పితాలూ— ఈమాటలకు అర్థమే మరిచిపోయి వుంటాడు.

నీకు లాయరైన స్నేహితుడున్నాడనుకో, నువ్వు వ్యాజ్యంలో తగులుకున్నావనుకో, అతనినుంచి ఎలాంటి సాయాన్నీ ఆశించకుమా! నీ బాధలపట్ల అతగాడు ఈ పాటికే ఏ ఆసక్తీ చూపక దానికి గుడ్ బై కొట్టకపోయి వుండకుంటే, డబ్బు విషయం ఎత్తకపోవచ్చుగాని నీ కేసుని శ్రద్ధగా పట్టించుకోడు ముక్కూ మొగమూ తెలీని మరో లాయరు వద్దకు వెళ్లి అతని కివ్వాల్సిన ఫీజు ఇచ్చుకోవడమే మేలు. ఏ రంగంలోనైనా ఒక వ్యక్తి సమర్థుడు కాకుండా దేవుడే కాపాడాలి. అలా అయ్యాడా, అతగాడిలో మరి సహజ మానవానుభూతులన్నీ మటుమాయమయ్యాయన్నమాటే ఎంచేతనంటే, "సమయ మమూల్యము."

పిచ్చాపాటీతో పొద్దు పుచ్చమని ఎవరూ అనడం లేదు. స్నేహం, అభిమానం సానుభూతి-యిలాంటి మానవ అనుభూతులన్నిటినీ తన్ని తగలేసేంతగా ధనాసక్తిని ముదరనివ్వగూడదు.

అయినా, ధనానికి బానిసగా మారినవాణ్ని నువ్వు ఖండించలేవు. ప్రతిఒకడూ ఏంచేస్తున్నాడో తానూ అదే చేస్తున్నాడాయె! మనిషి పరులనుంచి కోరుకునేవాటిలో కీర్తిప్రతిష్టలుముఖ్యం ఇది నాటిదీ నేటిదీకాదు. ప్రఖ్యాతిపొందటానికి పాండిత్యమో కళోమార్గమైన కాలంలో, జనం వీటిమీదనే గురిపెంచేవారు. ఆ గమ్యం చేరటానికి ఏకైక మార్గం యీ కాలాన ధనమే అయికూర్చున్నప్పుడు, మనిషి దాన్ని పూజించక తప్పదు. తాను సాధువో మహాత్ముడో సన్యాసో తాపసోకాదుగనక, తానిప్పుడు మెట్టుతూన్న చక్కని రాజమార్గాన్నే తమ తమ వృత్తులలో ఘటికుల మనిపించుకున్న వారంతా ఒకనాడు ప్రయాణంచేసి పైకి వచ్చిన వాళ్లేనని తనకు తెలీక పోదు.

విజయం పొందిన మనిషికి కాలమే ధనం. ఈ సూత్రాన్ని అనుసరిస్తూ విజయం పొందినవాడి అడుగు జాడల్లో నడిచిపోయేవాణ్ణి. మరొకడు చూసి ఎలా తప్పెన్నగలడు? కీర్తిప్రతిష్ఠలకోసం మనిషికిగల అభిలాషను మనస్సు మీదినుంచి తుడిచి పెట్టలేవు. ధనం లేనివాళ్లు - కాలాన్ని ధనమనుకోలేదు గనకనే వీరి కాధనం లేదు- వట్టి పనికిమాలిన వాళ్లని కనకనిపిస్తారు. తమ వృత్తిలో తాము దక్షులే కావచ్చుగాక. అయినా వీరి గురించి ఎవరు గొప్పజేసి చెప్తారు? జీవితమంటే ఏ కొద్దిపాటి వుత్సాహం గలవాడెవడైనా ఇలా నిర్లక్ష్యాన్నీ విస్మృతినీ సహించలేడు. సానుభూతీ స్నేహమూ పెద్ద మనిషితనమూ వగైరా మనోభావాలను నిర్దాక్షిణ్యంగా తోసేసి. బుద్ధినీ హృదయాన్నీ లక్ష్మీపూజకు మాత్రమే అర్పించుకోవాలి. అప్పుడే ధనలక్ష్మి అతన్ని కటాక్షిస్తుందని అతని ఆశ. ఇష్టాపూర్తిగా ఎవడూ దీనికి పూనుకోడు - ఇది అతగాడిమీద బలవంతంగా మోపడం జరుగుతుంది. ధనాన్ని తెచ్చి పెట్టేదానిమీద తప్ప తక్కిన దేనిమీదా మనస్సుపోని విధంగా అది నియంత్రితమౌతుంది. దురదృష్టంకొద్దీ అర్ధగంట కాలం ఏ సభలోనో ఉపన్యాస కార్యక్రమంలోనో తాను కూర్చోవలసివస్తే, పాపం యిది అతనికి బలవంతపు మాఘస్నానమో విడిఖైదో అనిపిస్తుంది. మానసికమైన, అనుభూతి పరమైన, సాంస్కృతికమైన అతని శ్రద్ధాసక్తులన్నీ ఏకైకమైన బిందువుమీద లగ్నమైవున్నాయి అలా ఎందుకు జరగ్గూడదు? ధనాన్ని తప్ప మరిదేన్నీ తాను నమ్ముకోలేడు. అతగాడి ఆప్తమిత్రులు తమకేదో కావలసి వచ్చేప్పుడే అతని వద్దకు వస్తారు. అతని ధనమే బంధువులందరికీ ఆకర్షణ. తానే పేదవాడై వుంటే, ఇప్పుడు తనకు ముట్టడివేస్తూన్న మిత్రుల్లో ఎవ్వరూ తన ముఖం చూపించేవారేనా? ఇందరు చుట్టపక్కాల్లో ఒకరైనా తనవద్దకు వచ్చేవారేనా? సమాజంలో తనదైన స్థానాన్ని తానే సిద్ధపరచుకోవాలి. ముసలితనంలో పనికి వచ్చేందుకు ఎంతో కొంత వెనకేసుకోవాలి. తన బిడ్డలు దిక్కుమాలి బిచ్చమెత్తకుండా వుండాలంటే ఎంతో కొంత దక్కించాలి. హృదయం లేని ఈ క్రూరమైన ప్రపంచం విషయంలో తనకు స్వానుభవం పుష్కలంగావుంది. మనిషి గుండె ధైర్యాన్నీ సంకల్ప బలాన్నీ దెబ్బతీసి, మానవ సహజమైన ఆశలనూ వాంఛలనూ నులిమి చిదిమివేసే సంకట పరిస్థితులను తన కుమాళ్లు ఎదుర్కోవలసి రాగూడదు. జీవిత ప్రయాణంలో ఎన్నెన్నో మైలురాళ్లు దాటవలసిరావచ్చు. వ్యాపార సరళిలో ముందుకు సాగితేతప్ప తాను ఏ మైలురాయీ దాటలేడు

వ్యాపారమంటే వ్యాపారమేననేది ఈ నాగరికత రెండో సూక్తి. వ్యాపారంలో మానవానుభూతులకూ ఉద్రేకాలకూ జాగాలేదు వెనకటి జీవన సూత్రాలు యిలాంటి

మొరటు సూటిదనం గురించి బడాయి చెప్పుకునేవికావు. దీన్ని నిర్లజ్జ అనవచ్చు. ఈ సరికొత్త సూత్రానికి ప్రాణమూలమంతా ఇదే డబ్బుతో, గట్టిరొక్కంతో వ్యవహరిస్తున్నప్పుడు, స్నేహమూ సానుభూతీ దయాలాంటి వాటికి మినహాయింపు లివ్వడం కుదరదు. వ్యాపారంలో స్నేహమేమిటి? ఎవడైనా ఒకడు ఈ పరమ సూత్రాన్ని ఆశ్రయించాడో ఇక నువ్వు చెప్పవలసిందేదీ వుండదు నీ నాలుక ఆడదు పరిస్థితులు ఒకమనిషిని ఒక నేస్తమే అయిన ఒకానొక వడ్డీవ్యాపారి వద్దకు నెట్టుతా యనుకుందాం వెళ్లిన మనిషికి తాను ఒడ్డున బడగలనని ఆశ వుండవచ్చు. అధమ పక్షం చేబదులో లేక తక్కువ వడ్డీరేటో దక్కుతుందనీ భ్రమపడవచ్చు. అరుణదాత మామూలు వ్యాపార సరళిలోనే మాటాడ్డం మామూలు ఏదో ఒకరాయితీ ఇమ్మని ప్రార్థనాపూర్వకంగా అతగాడడుగుతాడు. జాలి బుట్టించే కంఠస్వరంతో నీళ్ళునిండిన కళ్లతో, "అయ్యా, ఇలాంటి యిక్కట్లు దాపురించకపోతే, మీకు యిబ్బంది కలిగించాలని కలలోనైనా నేననుకొని వుండను దేవుణ్ణి జూచి ఈ దీనుణ్ణి కనికరించండి. పాత స్నేహితుడు గదా అని .." అంటాడనుకుందాం. మాట పూర్తి జెయ్యకముందే అమహాశయుడు వ్యాపారం వ్యాపారమేనన్న వాస్తవాన్ని మీరుమరుస్తున్నాల్లాగుంది" అంటాడు. ఈ మాటలు అపతలి వాడికి పిడుగుపాట్లు. తనకు మరో వాదమేదీలేదిక నెమ్మదిగా పైకిలేవనన్నా లేస్తాడు లేదా వ్యాపార సరళివదలని మిత్రుడుపెట్టే షరతుల కన్నిటికీ ఒప్పుకుంటాడు

"మహాజనీ" సభ్యత జనంలో బాగా ప్రచారం చేసిపెట్టిన కొత్తవిధానాలలో సూత్రాలలోకెల్లా పరమ విషతుల్యమైందీ ఘోర రక్తదాహంగలదీ "వ్యాపారమంటే వ్యాపారమే" ననేది. భర్తకూ భార్యకూ మధ్య, తండ్రికీ కుమారుడికీ మధ్య, అధ్యాపకుడికీ విద్యార్థికీ మధ్య-వ్యాపారం! మనుషుల మధ్యగల ఆత్మీయమైన సాంఘిక సంబంధాలన్నిటికీ స్వస్తి మనిషికీ మనిషికీమధ్య ఇంకా ఏదైనా సంబంధం మిగిలి వున్నదంటే, అది యీ వ్యాపార సంబంధం ఒక్కటే ఈ "వ్యాపారం" మొఖం మండ! దురదృష్టవంతురాలైన ఆడపిల్ల అవివాహితగా వుంటూ, తన బతుకుదెరువు తానే సంపాదించుకోజాలకపోతే, తన తలిదండ్రుల గృహంలోనే తాను దాసీపిల్ల స్థాయిలో జీవించవలసిందే. ప్రతి కుటుంబంలోనూ కొడుకులూ కూతుళ్లూ ఇంటి పనులు తలా ఒకటి చేసుకుంటారు వాళ్ల నెవ్వరూ సేవకులనరు, కాని, ఈ "మహాజనీ" వ్యవస్థలో కొంతప్రాయం మీరిన ఆడపిల్లకు తన సొంత అన్నదమ్ములకే పనిపిల్లగా పరిచారికగా తప్ప పరిగణన లేకుండా వచ్చింది. ఒకప్పుడు భయభక్తులు పొందిన తండ్రి, తన విధులు తాను నెరవేర్చుకుపోయే కుమారుడికి పనిమనిషౌతు

న్నాడు. కన్నతల్లి తన సంతానానికే ద్రోహం చేస్తున్నది. మిగతా బంధువుల విషయం ఎంతకొద్దిగా చెప్పడం అంతమంచిది. చుట్టపు చూపుగా వచ్చిన సోదరుణ్ణి అతిథిలా సమాదరిస్తున్నారు వారి ఆతిథ్యానికి బదులుగా తాను ఎంతోకొంత ముట్ట జెప్పవలసి వస్తున్నది. ఈ "సభ్యత" మూలమల్లా వ్యక్తివాదం – ఎవడి గతివాడిదే వెనకబడ్డవాడు పిశాచివాత బడినాసరే.

అయితే యీ విషయంలో ఎవరినీ తప్పెన్నడం కుదరదు. పేరు ప్రఖ్యాతుల దుగ్ధ, రానున్న రోజుల గురించి చింత, ఇంటిపెద్ద గతించాక అతగాని ఆలుబిడ్డల నెదుర్కొనే ప్రశ్న, పదిమందికీ కనిపించేలా డాబూదర్జా, ఇవి ప్రతి ఒక్కరినీ కుంగదీసి ముందుకడుగెట్టకుండా అడ్డుపడే అంశాలు. ఈ నాగరికత తాలూకు నియమ నిబంధనలను ఎవడైనా పాటించక పోతాడో, వాడికి లోకంలో అంతా చుక్కెదురే.

ఇంతదాకా, యీ నాగరికత చేసిన ఆజ్ఞాపనలు పాటించకుండా జనానికి గత్యంతరం లేకపోయింది. ఈ సామాజిక వ్యవస్థ ఆధిక్యానికి తలవంచక తప్పేదికాదు. అధికార పానంతో "మహాజనుడు" ఉన్మత్తుడై పోయేవాడు. ప్రపంచం సమస్తం తన చెప్పు చేతల్లోవుండాయె. రాజైనా "మహాజనుడి" ఆజ్ఞానువర్తే; మంత్రులైనా అతని బానిసీల్లే; యుద్ధానికైనా శాంతికైనా కావలసిన తాళంచెవులు తన అధీనంలోనే; తన పీఠాలముందు లోకం సమస్తం జోహారే; విడి భూఖండం ఏదైనా అతని కాలి మచ్చెలకిందే

అయితే ఇప్పుడిప్పుడు పశ్చిమాన ఒక నవ్యనాగరికతా సూర్యోదయమౌతుంది 'మహాజనీ' లేదా పెట్టుబడిదారీ నాగరికతను గెంటివేసింది. ఈ నూతన వ్యవస్థకు మూల సూత్రం ఏమిటంటే, కాయకష్టంచేసిగానీ మానసికశ్రమచేసిగానీ ఉత్పత్తిచేసే వాడు ప్రతిఒకడూ రాజ్యంలోనూ సంఘంలోనూ అత్యంత గౌరవనీయుడు అవుతూ వుంటే, తదితరుల శ్రమద్వారా సమకూరిన సంపదో అమ్మా అబ్బాయిచ్చిపోయిన సంపదో వున్నవాడు జీవరాసులలోకెల్లా నీచుడనిపించుకుంటున్నాడు, దేశపరిపాలనలో అతనివాణి మూగబడిపోతూంది పౌర హక్కులను సైతం పొందలేకున్నాడు. ఈ అపూర్వ మహాశక్తిని చూచి 'మహాజనుడు' చచ్చేంత భయంతో పిచ్చివాడిలా లోకమంతా తిరుగాడుతున్నాడు; ప్రపంచ 'మహాజనులు' యావన్మందీ ఈ నూతన నాగరికతను చూచి కళ్లు పొడుచుకొని శాపనార్థాలు పెడుతున్నారు. వ్యక్తి స్వేచ్ఛకూ మత స్వేచ్ఛకూ ఎవరి యిష్టానుసారం వారు నడుచుకునే హక్కుకూ ఇది బద్ధవిరోధి

అంటున్నారు. ఇవ్వాళ తిట్టిన తిట్లు రేపు తిట్టకుండా కొత్త కొత్త తిట్టుమాటలు ప్రయోగిస్తూ, ఈకొత్త నాగరికతను న్యూనపరిచే హేయమైన కట్టుకథలకూ నిందా ప్రచారాలకూ దిగుతున్నారు కారునల్లటి రంగుతో దానిరూపాన్ని చిత్రిస్తున్నారు ద్వేషంతో గూడిన దుర్భాషలు వాడుతున్నారు. ధనిక వర్గాల చేతి సాధనాలనన్నిటినీ యీ విష ప్రచారం నిమిత్తం సమకూర్చుకుంటున్నారు అయితే సత్యం కాంతిబాణంలా యీ కారుచీకట్లను చీల్చుకు ప్రతిచోటా తన వెలుగు వెదజల్లుతూంది

వ్యక్తి స్వేచ్ఛకుండిన కోరలనూ గోళ్లనూ యీ నవ్యనాగరికత విరగగొట్టి వేసిందనడం నిస్సందేహం. ఆ పేరుతో ఒక పెట్టుబడిదారు వేనవేల పనివారి రక్తాన్ని జుర్రుకునేవాడు. ఇప్పుడలా బలవలేదు. ప్రజల నిత్యావసర వస్తువుల ధరలను వెనకటిలా దన చిత్తం వచ్చినట్టుగా పెంచివెయ్యలేడు. తన వర్తక సరుకులకు మంచి మంచి మార్కెట్లకోసమని యుద్ధాలను రెచ్చగొట్టే స్వేచ్ఛ తనకిప్పుడు చెయిజారింది. బాంబులనూ తుపాకి తూటాలనూ యుద్ధ సామగ్రినీ లెక్కకు మిక్కుటంగా ఉత్పత్తి చేసి దుర్బల జాతుల నణచిపెట్టే స్వేచ్ఛ తనకిప్పుడు లేదు. స్వేచ్ఛ అంటే ఇదే అయితే, అది ఈ నాగరికతలో తనకు నిజంగానే లేదు. స్వేచ్ఛ అంటే అర్థం చాలినంత గృహవసతీ, ఆరోగ్యకరమైన జీవన పరిస్థితులూ, పుష్టికలిగించే తిండీ, శుభ్రమైన పల్లెపట్టూ, ఎలక్ట్రిక్ దీపకాంతీ, ఫాన్‌లగాలీ; సాదా జనానికి సత్వరమైన సరసమైన న్యాయావకాశాలు అయితే, ఆ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అత్యంత నాగరిక మయ్యాయనిచెప్పే దేశాల్లోనూ నేడు కనిపించవు పురోహితులు, పూజారులు, ముల్లాలు వగైరా గూడిన పరాన్నజీవులతో గూడిన వర్గం దుర్గర్వంలో చేసే బోధనలూ, గుడ్డి నమ్మకాలూ - మతస్వాతంత్ర్య మంటే ఇవే ఐతే, ఆ కొత్త సమాజంలో ఇలాంటి స్వేచ్ఛ లేదు, నిజమే. మత స్వాతంత్ర్యమంటే అర్థం ప్రజలకు సేవ, సహన భావం, సంఘ శ్రేయస్సు కోసం వ్యక్తి స్వార్థ త్యాగం, చిత్తశుద్ధి, శుభ్రమైన దేహమూ మనస్సూ అనుకుంటే, ఈ కొత్త సమాజంలో వున్నపాటి మతస్వాతంత్ర్యం ఏ యితర దేశంలో కలలోకి గూడా రానంత.

ఒక మనిషో మరొకడో సొంతదారైన సంపద మూలంగా ఎక్కడెక్కడైతే అసమానత వుందో, అక్కడల్లా ఈర్ష్యాసూయలూ, జబర్దస్తీ, జులుం, దౌర్జన్యం దగా, అబద్ధమైన నేరారోపణలూ, పడుపువృత్తీ వ్యభిచారమూ ఉండటం తప్పనిసరి కాని. ఎక్కడైతే సంపద అతిశయంగా వుండదో, ఎక్కడైతే మనుషుల్లో హెచ్చు

మందికి ఒకే విధమైన పరిస్థితి వుంటుందో, అక్కడ ఒకణ్ణిచూచి మరొక డెందుకు యాసు పెంచుకోవాలి? అలాంటి వ్యవస్థలో స్త్రీలు తమ మానాన్నమ్ముకొని వ్యభిచారానికి దిగాలి? కోర్టు పక్షులయ్యేలా మనుషుల్ని ప్రేరేపించి ఆకర్షించేది ఏది వుంటుందక్కడ? దొంగలూ దారిదోపిడిగాళ్లూ వగైరాల దురాగతాలకు ఆ వ్యవస్థ ఎందుకు బలౌతుంది? ఈ దుర్గుణాలూ అవలక్షణాలూ అన్నీకూడా ధనం యిచ్చినవరాలే, ధనం పండించిన దుష్టఫలాలే - 'మహాజనీ సభ్యత' మాత్రమే వీటిని సృష్టించింది, వీటిని పెంచి పోషించేదీ, ఇదంతా దైవ నిర్ణయం ప్రకారమే ఏర్పడిందనీ విధాయకమనీ భావించవలసిందిగా అణగదొక్కబడిన, దోపిడీపాలైన, పరాజితులై పోయిన ప్రజలను కోరేదీకూడా ఈ నాగరికతే. జనం అసంతృప్తి చెందినట్టో తిరుగబడనున్నట్లో ఏ కొద్దిపాటి సూచన కనిపించినా, తక్షణమే పోలీసులూ, న్యాయస్థానాలూ, జైళ్లూ రంగంమీదికి వచ్చి జనాన్ని తమ తమ స్థానాల్లో నిలిపిపెడుతాయి. నువ్వు ఒకవైపు తాగుతూనే మరోవైపు కైపునెత్తికెక్కకుండావుండలేవు. అలాగేనువ్వు అగ్గినిరాజేసి, అది మంటమండకుండా చెయ్యలేవు. శాపాల్లాంటి ఈ అక్రమాలనన్నింటినీ సృష్టించి ఈ లోకాన్ని నరకకూపంగా మార్చివేసిందీ నాగరికతే. ఈ స్వర్ణారాధనను ఆపు, తదితర దుర్గుణాలు తమంత తామే అంతరిస్తాయి. రెమ్మల్నీ ఆకుల్నీ కత్తిరించి చెట్టు వేళ్లని మాత్రం పదిలంగా వుంచడంలో అర్థమే లేదు. ధనపరత్వం మనిషికి అధమ ప్రవృత్తి కల్పించేదనీ, అవమానకరమనీ, ప్రాణాంతకమైన విషతుల్యమనీ యీ కొత్త సమాజం భావం. ఇందులో ఎవడైనా ఒకడు తన వైభోగం వెలగబెడుతూ డంభం ప్రదర్శిస్తూ జీవిస్తున్నాడనుకో, తదితరులు అతన్ని జూచి తమ కళ్లలో నిప్పులు పోసుకోరు. అసహ్యించుకుంటారు. ఆపాద మస్తకం నగలు ధరించిన స్త్రీని జగదేక సుందరి అనుకోరు, తక్కువ చూపు చూస్తారు. జనసామాన్యం జీవన ప్రమాణాన్ని బాగా మించి జీవించడం కుసంస్కారమే. అలాగా తాగడం దుర్గుణమే ననుకుంటారు గనక ఎవడూ అక్కడ తాగుబోతుకాడు. మతపరమైన దృక్పథంతోగాక, సంఘపరమైన దృక్పథంతో ఈ అవలక్షణాన్ని చూస్తారు. తాగుబోతుతనం ఓరిమినీ సహనాన్నీ శ్రమించాలనే కోరికనీ గట్టిగా పనిజేసే శక్తినీ నశింపజేస్తుందని గ్రహిస్తారు.

ఏ ఒక్కడి దురాశ నెరవేరటానికో, వాడు తన సొంత లాభంకోసం వారి శ్రమను దోచుకునేందుకో, జనసామాన్యాన్ని పట్టి పనిముట్లుగా వుపయోగించుకుందామనుకుంటే యీ నాగరికత అనుమతించదు. ప్రభుత్వ పదవులుండీ లంచాలు పట్టి

రాజాల్లాగా మెలిగే స్వేచ్ఛను ఎవ్వరికిగానీ ఇవ్వదు. ఇక్కడ అత్యున్నతాధికారి అర్జన నిపుణుడైన వృత్తి జీవి అర్జనకంటె ఎక్కువేమీకాదు. అతగాడు నివసించేందుకు మహాభవనాలేమీవుండవు; మూడో నాలుగో గదులతో తృప్తిపడవలసిందే అతని సతీమణి రాజుగారి దేవేరిలాగానో, సుల్తాన్ వారి బేగంలాగానో బహుమతి ప్రదాన సభలకు వస్తూ పోతూ వుండదు; తానూ తన బతుకుదెరువు కోసం శ్రమించే సందర్భాలే హెచ్చు; ఏ పత్రికా కార్యలయంలోనో పనియ్యాలి.తప్పదు. ప్రభుత్వ ఉద్యోగం సంప్రాప్తించిందిగదా. మనకేమిక? మనం అధినాథులమయ్యాం పొమ్మని అనుకునే అహంకారం వుండదు; తాను ప్రజాసేవకుల్లో మరొకణ్ణనే అనుకుంటాడు. "మహాజనీ సభ్యత" ను మెచ్చేవాళ్లకు ఈ నూతన వ్యవస్థంటే సరిపడదు ఎందుచేతనంటే, సంపదను కూడబెట్టి తదితరులమీద పెత్తనం సాగించే అవకాశానికే ఇందులో చోటులేదు. అయితే "మహాజనీ" వ్యవస్థకు తెలిసిగానీ తెలియకగానీ తోడ్పడుతూనో బలపరుస్తూనో, ఈ కొత్త నాగరికతను గేలిచేస్తూ అపఖ్యాతిపాలు జేసేవాళ్లను వారి బానిస మనస్తత్వాన్ని చూచి జాలిపడాలి. దురాశ, స్వార్థపరత్వం మనిషిలో ఇంకా క్షుద్రమైన లక్షణాలు పునాదిగా కట్టిన ఈ వ్యవస్థను, మానవీయత ధార్మికత, ఉదాత్తత గలిగిన వాడెవ్వడూ శ్లాఘించడు, దేవుడు ఒకవ్యక్తికి విద్యాసంపదనూ కళాదక్షతనూ ఇచ్చివుంటే, మానవ సమాజానికి చేసే సేవలోనే వాటికి పూర్తి సార్థకత వుంటుంది. మానవ సమాజాన్ని బానిసలుగా మార్చడానికో జనాన్ని దోచుకోడానికో దగా చెయ్యడానికో వీటిని వినియోగ పెట్టడం అక్రమం

ధనవంతుడి పాలనకూ వ్యక్తి ఆస్తికీ ప్రాణాంతకంగా పరిణమిస్తూన్న యీ నాగరికత ధన్యమైనది. ముందు వెనకలుగా మిగిలిన ప్రపంచం దీని అడుగుజాడల్లోనే నడవ వలసి వుంటుంది. సాంఘికంగానూ మతపరంగానూ ఈ దేశానికో ఆ దేశానికో ఈ వ్యవస్థ సరిపోదనిగానీ, ఈ దేశం పరిస్థితులకో ఆ దేశం పరిస్థితులకో అది అమరదనిగానీ అనడం అసందర్భం, క్రైస్తవమతం విత్తులు జెరూసలెంలో మొలకెత్తాయి; దాని సువాసన లోకమంతా వ్యాపించింది, బౌద్ధమతం భారతదేశం ఉత్తరాదిలో పుట్టింది, మానవకోటిలో సగభాగం దానికి శిష్యుడుగా మారింది మనిషి ఎక్కడైనా ఒకలాగేవుంటాడు స్వల్పమైన తేడాలుండవచ్చునేమోగాని మౌలికంగా మాత్రం ఒకదేశ ప్రజలకూ మరొకదేశ ప్రజలకూ విభేదాలులేవు ఒకదేశానికి సత్ఫలితాల నిచ్చిన రాజ్య నిర్మాణమూ సంఘ వ్యవస్థా తదితర దేశాలకు గూడా అంతే మంచి ఫలితాలనిస్తాయి. "మహాజనీ" వ్యవస్థ గానీ దాని బంట్లూ ఏజంట్లూ

## యువ రచయితలు - ప్రేమ్‌చంద్

యువరచయిత హరిహరనాథ్‌కు ప్రేమ్‌చంద్ లేఖ.

"మీ సుందరమైన, గాఢమైన ఆవేశంతో నిండిన రచన ఎంతో ఆసక్తితో చదివాను. మీ రచనలో ఎంతో fervour, కరుణ వుంది కాని కథలో వుండాల్సిన భావము, నిర్మాణము, పాత్రలు అనే ఆవశ్యక అంశాలు ఇందులో లోపించాయి. అందువల్ల ఇది గద్య కావ్యమవుతుంది కాని కథ కాదు మీ అభిరుచి అందులో వుంటే అదే కానివ్వండి ( గద్య కావ్యాలే రాయండి అని భావం - అను. ) కాని సెంటిమెంటలిజం రానివ్వండి ఒక సృజనాత్మక మనస్సు సృజన చేయాలి. దేనిని? పాత్రల (చిత్తవృత్తుల్ని) చిత్రించే పరిస్థితుల్ని. ఒక యువ రచయిత ఆశావహమైన ధోరణిలో రాయాలి. అది ఇతరులలో కూడ ఆశావాదాన్ని రగిలించేదిగా వుండాలి. అత్యున్నతమైన సాహిత్య దృక్పథం వికాసాన్ని, ఔన్నత్యాన్ని కలిగించడమేనని నేననుకుంటాను చివరకు మన వాస్తవాదం కూడ ఈ వాస్తవం నుంచి దృష్టి మళ్ళించకూడదు. మీరు ధైర్య శాలురు, నిజాయితీపరులు, స్వతంత్రులు, సాహసికులు, తెగింపుగల 'మానవు'లను, కొనియాడ దగిన ఆదర్శాలు గల మానవులను సృష్టిస్తే చూడాలని నాకుంది. ఇది ఈ తరుణంలో కావలసింది. నిశ్చయంగా మానవ ప్రకృతి పూర్తిగా వినియోగంలోకి రాలేదు.

మీకొక వారంరోజుల క్రితం "హంస" ఇదివరకు ఏం చేసేదో, ఇక ముందు ఏం చేయ దలచుకున్నదో రాశాను. దానికొరకు ఒక కథ రాసి వీలైనంత త్వరలో పంపించమని మిమ్మల్ని కోరాను. చాలా ఎన్నికైన ప్రథమ శ్రేణికి చెందిన ఒక ఆరు కథలు, సమీక్షలు, ఇతర విషయాలతో ప్రతినెలా ఇవ్వాలని నా ఉద్దేశ్యం. మీరు తప్పకుండా ఒక కథ రాయండి. హిందీ సాహిత్యంలో యువరచయితలకు ఉజ్వలమైన భవిష్యత్తున్నది. కానీ నియమబద్ధమైన దీక్షతో పరియోగంతో ఎంతో ఓపికతోకూడిన పనితోతప్ప గుర్తింపు అనే ఫలం లభించదని మీకూ నాకూ తెలుసు

"హంస"కు రాస్తున్నానని మీరు రాస్తారని ఆశిస్తూ"

---

గానీ, దీన్ని ప్రతిఘటించేదాన్ని గురించి దుష్ప్రచారం సాగించేందుకూ ప్రజల కళ్లలో దుమ్ముగొట్టి వాళ్లను తప్పుతోవ పట్టించేందుకూ తమకుగల యావత్ శక్తినీ వినియోగిస్తారు. నిజం. అయితే, ఏమైనాగానీ, అంతిమ విజయం మాత్రం నూతన వ్యవస్థదే

---

(రవి బకయా హిందీ తర్జుమాకు తెలుగు; 'ఇండియన్ లిటరేచర్' సంచిక 1,1952)

# సవాశేరు గోధుమలు

ప్రేమ్‌చంద్

ఒక ఊళ్ళో శంకర్ అనే ఒక కుర్మీ జాతి రైతు ఉన్నాడు. కల్లకపటం తెలియని అమాయకమైన బీదవాడు. తన పనేమిటో తానేమిటో, ఎవడితోనూ లావాదేవీలు లేనివాడు. కల్లకపటం, మోసం, వంచన అంటే ఏమిటో తెలియనివాడు. ఎవడన్నా మోసగిస్తాడేమోననే చింతా లేదు. ప్రతారణ విద్యా తెలియదు. కూడు దొరికినపూట తింటాడు లేకపోతే వేపుడు ధాన్యంతో కాలక్షేపం చేస్తాడు. అవీ దొరక్కపోతే ఇన్ని మంచినీళ్ళు తాగి రామనామం జపం చేస్తూ కడుపులో కాళ్ళు పెట్టుకొని పడుకొంటాడు మెదలకుండా. కాని అప్పుడప్పుడూ ఎవడన్నా అతిథీ, అభ్యాగతుడూ గుమ్మంలోకి వస్తే తన నివృత్తి మార్గానికి స్వస్తి చెప్పవలసి వస్తూ వుండేది. విశేషించి, సాధువో, మహాత్ముడో అడుగు పెట్టేటేచాలు, అనివార్యంగా ప్రపంచాన్ని శరణం పొందవలసి వస్తూవుండేది. తానైతే కడుపుమీద పెట్టుకొని నిద్ర పోగలడు కాని వచ్చిన సాధు మహారాజ్‌ని ఆకలితో పడుకోమని ఎట్లా చెబుతాడు. అందులోనూ తానూ ఈశ్వరభక్తుడాయె మరి!

ఓ రోజు సంధ్యా సమయానికి ఓ మహాత్ముడు వచ్చి ఆయన గుమ్మంలో పీఠం పెట్టి కూచున్నాడు. మొగంమీద మాంచి వర్చస్సు తొణికిసలాడుతూవుంది. మెడలో పచ్చని పట్టుకండువా, జడలు కట్టిన తల, చేతిలో ఇత్తడి కమండలువు, కాళ్ళకు పాముకోళ్ళు, కళ్ళకు జోడు-మొత్తం వేషం చూస్తే మహారాజుల భవనాల్లో తపస్సు చేస్తూ మోటారుబళ్ళల్లో దేవాలయ ప్రదక్షిణాలు చేస్తూ, యోగసిద్ధి పొందడానికి రుచికరమైన ఆహారం ఆరగిస్తూ వుండే మహాత్ములకోటికి చెందినవాడులా కనబడుతున్నాడు ఇంట్లో ఉండడానికైతే యవలపిండి వుంది. దాన్ని ఆ మహాపురుషునికి తినిపించడం ఎట్లా? పూర్వకాలంలో యవలకు ఎంతో ప్రాధాన్యం ఉన్న మాట నిజమే. కాని నేటి యుగంలో యవభోజనం సిద్ధపురుషులకుకూడా పచించడం కష్టంగా వుంది. అతనికి చాలా చింత పట్టుకొన్నది. ఏమిటి తినిపించడమని?

చివరికి నిశ్చయించుకొన్నాడు. ఎక్కడి నుంచైనా గోధుమ పిండి అప్పుతెద్దామని. అయితే ఊరి మొత్తంమీద ఎక్కడా అప్పు పుట్టలేదు. ఊళ్ళో అందరూ మామూలు మనుషులేగాని దేవతా కోటికి చెందినవాళ్ళు ఎవరూ లేకపోయిరి! అంచేత దేవతల భోజన పదార్థాలు వాళ్ళ దగ్గిర ఎట్లాదొరుకుతాయి? అదృష్టవశాత్తు గ్రామంలోని బ్రాహ్మణదేవత దగ్గిర కొద్దిగా దొరికాయి అయన దగ్గిరనుంచి సవాశేరు గోధుమలు అరువు తెచ్చాడు. పెళ్ళానికి విసిరి పిండి చేయమని ఆజ్ఞాపించాడు.

మహాత్ముడు యథాసమయాన లక్షణంగా భోంచేసాడు. అంతకంటే సలక్షణంగా కాళ్ళు చాపుకొని మత్తుగా నిద్రపోయాడు. మరునాడు ఉదయం ఆశీర్వదించి తన దారిని తాను చక్కాపోయాడు.

బ్రాహ్మణదేవత సంవత్సరానికి రెండుసార్లు పంట కళ్ళం గింజలు వసూలు చేసుకొనేవాడు. శంకర్ సవాశేరు గోధుమలు ఈయనకు వాపసు ఇవ్వడమేమిటి? అయిదు శేర్ల బదులు మరికొంచెం ఎక్కువగా పంట కళ్ళంలో ఇచ్చేద్దాం. ఆయన అర్థం చేసుకుంటాడులే ఆమాత్రం నాకూ తృప్తిగా వుంటుంది అని అనుకున్నాడు. చైత్రి మాసంలో బ్రాహ్మడు రాగానే ఏడున్నర శేర్ల గోధుమలు కొలిచాడు. బాకీ తీరిందనుకొని ఆ విషయం ఏమీ ప్రస్తావించాడు కాదు- బ్రాహ్మణదేవత ఎప్పుడూ అడగనూ లేదు. పాపం బోలా శంకరుడైన శంకర్‌కు ఏం తెలుసు బ్రాహ్మణదేవత రుణం చెల్లించడానికి తాను మరోజన్మ ఎత్తాలిసి వుంటుందని.

## 2

ఏడు సంవత్సరాలు గతించాయి బ్రాహ్మడు అవతారం మారి ప్రస్తుతం షాహుకారు అయినాడు. ఈ లోపల శంకర్ రైతు దశ తప్పి కూలివాడు అయ్యాడు. అతని తమ్ముడు మంగల్ అతని నుంచి వేరుపడ్డాడు. ఒక్కచోట కలిసివున్నప్పుడు ఇద్దరూ రైతులు. శంకర్ ద్వేషాగ్ని ప్రబలకూడదని వాంఛించాడు కాని పరిస్థితులు తారుమారైనాయి. అంచేత విడివడక తప్పింది. దు. వేరుపొయ్యిలు రాజేసేటప్పటికి అతడు వెక్కి వెక్కి ఏడ్చాడు. నాటినుంచి అన్నదమ్ములు పరస్పరం శత్రువులై పోయారు. ఒకడు ఏడుస్తుంటే రెండోవాడు నవ్వుతాడు. ఒకడి ఇంటిలో ఏదైనా ఆపద వస్తే రెండోవాడు ఇంటిలో 'గుల్ గులాలు'[1] చేసుకొని తింటాడు. ప్రేమ బంధం, నెత్తురు సంబంధం, ఒక తల్లి పాలు తాగిన మమకారం, అన్నీ నేటితో తెగతెంపులై పోతాయి. తాను భగీరథ ప్రయత్నంతో వంశ గౌరవ వృక్షాన్ని నాటి తన రక్తంతో దాన్ని తడిపి పెంచాడు. అది ఈవిధంగా పెల్లగిలిపోవడం చూసి అతని హృదయం తుత్తునియలై పోతోంది. ఏడు రోజుల దాకా అతడు భోజనం మొహంకూడా చూడలేదు. పగలంతా జ్యేష్ఠ మాసం ఎండలో పనిచేస్తూ వుండేవాడు. రాత్రికి మొగం కప్పేసుకొని పడివుండేవాడు. ఈ దారుణ హృదయవేదన, ఈ దుర్భర కష్టం, రెండూ అతని రక్తాన్ని పీల్చేశాయి, మాంసాన్ని. కొవ్వునూ

---

1. గుల్‌గులా — ఒక తీపి పిండి వంట. గోధుమపిండి, బెల్లంతో చేస్తారు. గోధుమ బూరె లనవచ్చు.

మాయం చేసేశాయి... జబ్బు చేస్తే నెలల తరబడిగా మంచం నుండి కాలు కింద పెట్టలేక పోయాడు. మరి రోజులు దొర్లించడం ఎట్లా? అయిదు బీఘాల పొలానికి ఇప్పుడున్నది అందులో సగమే, ఒక్క ఎద్దు మిగిలింది. ఏమిటి వ్యవసాయం చేయడం? వ్యవసాయం ఏదో మర్యాద కాపాడుకోవడం కోసం చేయడమేగాని అందులో కలిసొచ్చేది ఏమీ లేదు. బ్రతకడానికి ఎట్లాగూ కూలీనాలీ చెయ్యవల్సిందే

ఏడు ఏళ్లు కాలగర్భంలో లీనమైనాయి. ఓరోజు శంకర్ కూలిచేసి ఇంటికి వస్తూండగా దారిలో బ్రాహ్మణదేవత ఎదురయ్యాడు. ఆపిఅడిగాడు తనను-"శంకర్! రేపు వచ్చి నీ ధాన్యం లెక్క ఓసారి చూసుకొని వెళ్లనాయనా! నీ దగ్గర అయిదున్నర మణుగుల అప్పు బాకీ వుంది ఎన్నాళ్లనుంచో. చెల్లిద్దామనేమాటే నీకు లేదు. మింగేద్దామని ఉద్దేశ్యమా నీకు?" శంకర్ ఒక్కసారిగా చకితుడై పోయాడు- "నేను నీదగ్గర నుంచి ఎప్పుడు గోధుమలు తీసుకొన్నాను అయిదున్నర మణుగుల గోధుమలే! మీరు పొరబడుతున్నారు. నా వద్ద ఎవరికివ్వాల్సిన ధాన్యం ఓ చటాకుకూడా లేదు ఓపైసా కూడా నేను ఎవ్వరికీ ఇవ్వాల్సిందిలేదు."

బ్రాహ్మడు "నీ స్వభావం ఇట్లా వుండడం చేతనే మింగడానికి మెతుకు లేకుండా వుంది."

బ్రాహ్మణదేవత సవాశేరు గోధుమల సంగతి జ్ఞాపకం తెచ్చాడు. ఏడేళ్ల కిందటి సంగతి! శంకర్ విని స్తంభించిపోయాడు. "ఈశ్వరా! నేను ఈయనకు ఎన్ని సార్లు పంట కళ్లంలో ధాన్యం దానం చెయ్యలేదు? ఈయన నాకు చేసిందేముంది? పంచాంగం వినిపించడానికిగాని, మంచి చెడ్డలు చెప్పడానికిగాని, గుమ్మం తొక్కినప్పుడల్లా కాస్తోకూస్తో దక్షిణ గుంజుకొని పోతూనేవున్నాడు. ఎంత స్వార్థం! సవాశేరు ధాన్యం గుడ్డును పొదిగినట్లుపొదిగి ఇవ్వాళ ఈ పిశాచాన్ని నాముందు నిలబెట్టాడా ఇది నన్ను మింగేసేలాగా వుంది ఇన్ని రోజుల్లో ఏనాడైనా ఈ ఊసు తెచ్చివుంటే ఈ పాటికెప్పుడో గోధుమలు కొలిచి ఇచ్చేసి వుండేవాన్ని. లోపల ఈ కుళ్లతో ఇన్నాళ్లూ దాచిపెట్టాడు కాబోలు! "అయ్యగారూ తిరిగి ఇస్తున్నానని చెప్పి నేను మీకు ఆ గోధుమలు కొలిచి ఇవ్వనిమాట నిజమేగాని, చాలాసార్లు పంటకళ్లంలో సేరు సేరు చొప్పున రెండు సేర్లు చొప్పున మీకిచ్చాను. ఇవ్వాళ మీరు ఒక్కసారి అయిదున్నర మణుగులు అడిగితే ఎక్కడ నుంచి తెచ్చియిచ్చేది?"

బ్రాహ్మడు "[1]ఆవగింజంతైనా అప్పు అప్పే, గుమ్మడికాయంతైనా దానం దానమే. నువ్వు ఏమిచ్చినా పంట మామూలు కింద యిచ్చివుంటావు. దాన్ని దీని

1. లేఖా జౌ జౌ, బక్షీస్ సౌ సౌ అని మూలం.

కింద జమకట్టడం కుదరదు. ఒక టివ్వాల్సినచోట నాలుగింతలిచ్చినా అది ఈలెక్క-లోకి రాదు నీ పేర కాతా పుస్తకంలో అయిదు మణుగులు రాసివున్నాయి. ఎవరి చేతనైనా సరే నీ యిష్టంవచ్చిన వాళ్లచేత లెక్క చూపించుకో. నాది నా మొహాన పారేస్తే నీ పేరు కొట్టేస్తా, లేకపోతే యింకా పెరిగిపోతూ వుండడం ఖాయం."

శంకర్— "పాండేజీ! ఎందుకు ఒక బీదముండావాణ్ణి ఈ విధంగా వేపుకు తింటావ్! నాకు కూటికి దిక్కు- దివాణం లేకుండావుంది. ఇన్ని గోధుమలు ఎవడి ఇంటి నుంచి తెచ్చియిచ్చేది?"

బ్రాహ్మడు — "ఎవడింటి నుంచి తెచ్చి యిచ్చినా సరే. నేను ఓ చటాకు కూడా వదిలేదిలేదు. ఇక్కడ యివ్వకపోతే రేపు భ గ వ ం తు డి ఎదుట ఎట్లాగూ ఇవ్వాలి."

శంకర్ వణికిపోయాడు మనబోటి చదువుకొన్నవాళ్ళమైతే చెప్పివుండేవాళ్లం. మంచిది భగవంతుని సన్నిధానంలోనే యిస్తాం. అక్కడి తూకం ఇక్కడి తూకంకంటె ఎక్కువేమీ ఉండదుగా! కనీసం మనవద్ద ఇదమిత్థమని ఏమీ రుజువు లేదుగా, మరి విచారం దేనికీ అని. కాని శంకర్ ఇంత యుక్తి తెలిసినవాడుగాని, ఇంత వ్యవహార జ్ఞానం వున్నవాడుగానికాడు. అసలే రుణం- అందులో బాపనబొమ్మ-కాతాపుస్తకంలో పేరు వుండిపోతే నరకం వెళ్ళక తప్పదు. ఈ భావం తట్టగానే అతనికి వొళ్ళు గగుర్పొడిచింది, అన్నాడు.

"పండిజ్జీ! మీకు ఎంత ఇవ్వాలో అంతా ఇస్తా. భగవంతుని దగ్గిర ఇవ్వడ మెందుకు? ఈ జన్మలోనే ఇన్ని అవస్థలు పడుతున్నాను. పై జన్మకు కూడా ఈ పాపాలన్నీ మూట గట్టుకోవడం దేనికి? కాని ఇదేమీ సబబుగాలేదు. నువ్వు గోరం టలు కొండంతలు చేసి పెట్టావు. బ్రాహ్మడవై వుండి నువ్వు ఈ విధంగా చేయడం బాగలేదు. ఆ ఘడియలోనే జగడంవేసి తీసేసుకుంటే, ఇవ్వాళ నా నెత్తిమీద, ఇంత బరువు ఎందుకు వుంటుంది? నేను ఇస్తానుగాని నువ్వు భగవంతుని ముందు సంజా యిషీ చెప్పుకోవాల్సి వుంటుంది."

బాశ్రిహ్మడు— "పరలోక భయం నీకుగాని, నాకేమి భయం. అక్కడవున్న వాళ్ళంతా మాకు కావలసిన చుట్టాలే, రుషులు, మునులు వీళ్ళందరు బాశ్రిహ్మలేగా, దేవతలు బాశ్రిహ్మలు, ఏదైనా లోపాలోపాలుంటే సరిదిద్దేస్తారు. అయితే మరెప్పు డిస్తానంటావ్?"

శంకర్—"నా తలకిందేమీ దాచిపెట్టుకోలేదు. ఎవడిదగ్గరనైనా యాచించితెస్తా. అప్పుడే నీకు ఇవ్వగలిగేది."

బ్రాహ్మడు—"నేనిదంతా ఒప్పుకోను. ఏడేళ్ళయి పోయింది. ఇప్పుడొక్క రోజైనా గడువు ఇవ్వలేను. గోధుమలు ఇవ్వలేకపోతే దస్తావేజు రాసి ఇయ్యి."

శంకర్—"నాకు ఇవ్వాలనే వుంది. గోధుమలు తీసుకున్నా సరే, దస్తావేజు రాయించుకున్నా సరే, ఏ లెక్కను ధర కట్టుతావ్?"

బ్రాహ్మడు- "బజారు ధర ఐదుసేర్లు. నీకు అయిదుంబావు సేర్ల చొప్పునధర కడతాను."

శంకర్—"ఇవ్వాలిసే వున్నప్పుడు బజారు ధరేకట్టు మళ్ళా పావు ఎక్కువ వేసిన దోషం ఎందుకు నాకు?"

లెక్క ప్రకారం గోధుమల ధర అరవై రూపాయలు తేలింది. అరవై రూపాయలకు దస్తావేజు రాసారు. నూటికి మూడు రూపాయలు వడ్డీ ఒక సంవత్సరం లోపల ఇవ్వకపోతే మూడున్నర వడ్డీ రేటు, పన్నెండణాల స్టాంపు రూపాయి దస్తావేజు రాత కింద శంకర్ అదనంగా చెల్లించవలసి వచ్చింది. ఊరు మొత్తం బ్రాహ్మణ్ణి నిందించడం మొదలుపెట్టింది! కాని ఎవరూ మొహంమీద ఏమీ అనలేక పోయారు. షాహుకారుతో ప్రతివాడికీ పని పడుతుంది. అందుకని అతనితో ఎవడూ వాదులాడడు.

## 3

శంకర్ ఓ సంవత్సరం అంతా కఠిన తపస్సు చేసాడు అనుకొన్న గడువు కంటె ముందే చెల్లించేయాలని అతడు వ్రతం పూనాడు మధ్యాహ్నం పూర్వంకూడా పొయ్యి రాజేదికాదు వేపుడు ధాన్యం నమిలి కాలక్షేపం చేసేవాడు. ఇప్పుడదీ మానేసాడు. కేవలం పిల్లవాడికోసం రాత్రికి రొట్టెలు ఉంచేవాడు. రోజూ ఓ దమ్మిడీ పుగాకు కాల్చేవాడు, ఈ వ్యసనాన్ని మాత్రం అతడు వదిలించుకోలేక పోయాడు. ఇప్పుడా వ్యసనం కూడా ఈ కఠిన వ్రతానికి బలై పోయింది. అతడు చిలుం గొట్టం విరగకొట్టేసాడు. హుక్కా పీకేసాడు. పొగాకుచిప్ప ముక్కలుముక్కలు చేసేసాడు. బట్టలు మొదటే అధ్వాన్నంగా వుంటూ వచ్చాయి. ఇప్పుడవి ఎంత కనిష్ఠంలో వుండాలో అంత కనిష్ఠంగా వున్నాయి. చలికాలం ఎముకలు చిల్లులుచేసే గాలిని నిప్పు దగ్గర కూచొని నెట్టేసాడు. తాను చేసిన దృఢ సంకల్ప ఫలితం అనుకొన్నదాని

కంటే ఎక్కువగా వుంది. సంవత్సరం చివరిలో అతని అరవై రూపాయలు పోగయి నాయి. పండిజ్జీకి ఈ రూపాయలు ఇచ్చేసి, మిగతా రూపాయలుకూడా సాధ్య మైనంత తొరలో మీకు ముట్టజెప్పేస్తాను మహానుభావా అని చెబుదామనుకున్నాడు. పదిహేను రూపాయలు సంగతి వేరు. ఏమి పండిజ్జీ ఈ మాత్రమైనా ఒప్పుకోరా. అతడు రూపాయలు తీసుకొని పండిజ్జీ చరణకమలాలపై ఉంచాడు పండిజ్జీ ఆశ్చర్య పడి అడిగాడు—"ఎవడి దగ్గిరన్నా అప్పు చేసావుటయ్యా?"

శంకర్—"లేదు మహారాజా! మీ అపారమైన కృప వల్ల ఈసారి కూలి బాగా దొరికింది"

బ్రా—"కాని ఇది అరవై రూపాయలేనే!"

శంకర్—"ఔను అయ్యావారూ! ఇప్పటికి ఇది తీసుకోండి. మిగిలింది రెండు మూడు నెలల్లో ఇచ్చేస్తాను. నన్ను ఋణ విముక్తుని చేయండి."

బ్రా—"నాకు ఇవ్వాలిసిన పుచ్చువక్క దగ్గిరనుంచి చెల్లించినప్పుడే నీకు రుణ ముక్తి. పోయి నాకురావలిసిన మరో పదిహేను రూపాయలు తీసుకరా."

శంకర్—"మహాప్రభూ! ఈ మాత్రం దయపెట్టు. సాయంత్రం రొట్టెలకు కూడా ఠికానా లేకుండా వుంది. ఊళ్లో వుంటున్నప్పుడు ఎప్పుడో ఒకప్పుడు ఇచ్చేస్తా."

బ్రా—"నాకు తిరుగుళ్ల మరుగుళ్ల గిట్టవు అధిక పరిసంగం చేసేవాడినికాదు. నా పూర్తి డబ్బు ముట్టకపోతే ఇవ్వాళనుంచి నూటికి మూడున్నర రూపాయల వడ్డీ తగులుతుంది తెలుసా. నీ రూపాయలు నీ ఇంట్లో పెట్టుకున్నా సరే. నా దగ్గిర వుంచి వెళ్ళినా సరే."

శంకర్— "మంచిదిబాబూ. తెచ్చినంతమట్టుకు ఉంచుకోండి. నేను పోతున్నా. ఎక్కడనుంచైనా మరో పదిహేనురూపాయలు దొరుకుతాయేమో విచారిస్తా " శంకర్ ఊరంతా గాలించాడు. కాని ఎవ్వడూ సందుపెట్టలేక కాదు, అతనిమీద నమ్మకంలేక కాదు. పండిజ్జీ వేటను పలకరించడానికి ఎవడికీ సాహసం లేకపోయింది

## 4

ప్రతి పనికీ ఎదురుపని ఓటి పుడుతుంది. ఇది ప్రకృతి నియమం, శంకర్ సంవత్సరమంతా కఠోరమైన సాధనచేసినా, ఋణవిముక్తి కలుగలేదు. అతనిసంయమ మంతా నిరాశగా పరిణమించింది. ఇంత కష్టపడినా ఏడాదిలో ఓ అరవై రూపా యలకంటె మిగల్చలేనప్పుడు ఇంతకి రెట్టింపు సంపాదించడానికి వేరే ఉపాయం

మాత్రం ఏముంది? నెత్తిమీద అప్పుల బరువు మోయాల్సిన రాత వున్నప్పుడు అది మణుగైతేనేం మణుగుంబావు బరువైతేనేం? అతని ఉత్సాహం క్షీణించి పోయింది. పరిశ్రమించడం అంటే విసుగు పుట్టింది కోరిక ఉత్సాహానికి జనని. ఆశలోనే మనిషి తేజస్సు, బలమూ, జీవితమూ అన్నీ సంచితమై ఉన్నాయి. ఆశే ప్రపంచాన్ని నడిపేశక్తి. ఆశాహీనుడైన శంకర్‌ని ఔదాసీన్యం ఆవహించింది. జీవితావసరాలు ఓ సంవత్సరం పాటు త్రోసిపుచ్చాడు గాని, ఇప్పుడవి గుమ్మం మీద నిల్చుండే ముష్టివాళ్ళ లాంటివి కావు, గుండెలమీద స్వారీచేసే పిశాచాలుగా తయారైనాయి. వాటికింత బలి పడెయ్యకపోతే మనిషిని ప్రాణాలతో వదిలేటట్లులేవు. బట్టలకు మాసికలు వేయడానికి కూడా ఓ హద్దు వుంటుంది. శంకర్‌కు ఇప్పుడు చేతికి పైసా దొరికితే నిల్వ చేయడం పెట్టడం ఏమీలేదు. బట్టలో లేక తినే వస్తువో తెస్తూ వుంటాడు. మొదట్లో ఒక్క పుగాకే కాల్చేవాడు. ఇప్పుడు గంజాయి, భంగు వీటి రుచి మరిగాడు. డబ్బు చెల్లించాలనే బెంగ అతనికిప్పుడులేదు ఎవ్వడికీ తాను ఒక్క పైసాకూడా బాకీ లేనట్లే నడుచుకొంటున్నాడు. మొదట వరుసజ్వరం వస్తూ వున్నా పనికి తప్పకుండా పోతూ వుండేవాడు. కాని ఇప్పుడు పనికి పోకుండా తప్పించుకోవడానికి ఏదో సాకు వెదకడం ప్రారంభించాడు.

ఈ విధంగా మూడు సంవత్సరాలు గడిచాయి. బ్రాహ్మణ షాహుకారు ఓ సారైనా హెచ్చరించలేదు. మంచి నేర్పరైన వేటకాడివలె గురి తప్పని వేటు వేద్దామని చూస్తున్నాడు మొదటనే వేటమృగాన్ని అదలించడం అతడు వేటాడే పద్ధతికి విరుద్ధం.

ఓరోజు పండిట్జీ శంకర్‌ను పిలిచి లెక్క చూపించాడు.

అరవై రూపాయలు మినహాయించిన తర్వాత కూడా శంకర్ ఇవ్వతేలిన సొమ్ము నూట ఇరవై రూపాయలు.

శంకర్—"ఇంత సొమ్ము పై జన్మలో ఇవ్వాలిసిందే. ఈ జన్మలో ఇవ్వ లేను."

బ్రా—"నే నీ జన్మలోనే వసూలు చేస్తాను. అసలు కాకపోయినా వడ్డీ అయినా చెల్లించాలిసిందే."

శంకర్—"ఒక్కగాని ఒక్క ఎద్దు వుంది. కావాలంటే అది తీసేసుకోండి. ఓ కుటీరం ఉంది. అదీ తీసేసుకోండి. అంతకంటె నా దగ్గిర వుండి చచ్చిందేమిటి?"

బ్రా-"నేను ఎద్దూ మొద్దూ తీసుకొని ఏమిటి చెయ్యాలి? నాకు ఇవ్వాలంటే నీ దగ్గిర చాలా చాలా వుంది."

శంకర్-"ఇంకా ఏముంది స్వామీ?"

బ్రా-"ఏం లేకపోతేనేం? నువ్వున్నావుగా! నువ్వైనా ఎక్కడికన్నా కూలీ నాలికి పోతూనే వున్నావుగా. నేనైనా వ్యవసాయం కోసం కూలివాడిని పెట్టవలసి వుంటుంది. వడ్డీ క్రింద నువ్వు మా దగ్గిర పనిచేస్తూవుండు. వీలైనప్పుడు అసలు చెల్లిద్దువుగాని. నిజానికి నాకు డబ్బు చెల్లించేదాకా ఇంకో చోటికి నువ్వు కూలికి పోలేవు. నీ వద్ద ఆస్తి పాస్తులేమీ లేవు. ఇంత డబ్బు ఏం భరోసా చూసి వదిలి పెట్టేది? దీనికి బాధ్యత ఎవరు వహిస్తారు? నువ్వు ప్రతి నెలా సంపాదించి వడ్డీ ఇస్తే సరే, సంపాదించినా వడ్డీ అయినా ఇవ్వలేకపోతే, అసలు సంగతి చెప్పాలా?

శంకర్-"అయ్యవారూ! వడ్డీ క్రింద పని చేస్తే పొట్టగడిచే తీరు?"

బ్రా-"నీ యింటి ఇల్లాలు వుందిగా, పిల్లలున్నారాయె, వాళ్ళ కాళ్ళూ చేతులు ముడుచుకొని కూచుని పోతారా? నేనున్నాననుకో, నీకు అర్ధసేరు యవలు రోజూ చల్ది బువ్వకు ఇస్తూ వుంటాను. కప్పుకోవడానికి సంవత్సరానికి ఓ కంబళి ఇస్తూ వుంటాను ఓ పొడుగు చొక్కా కూడా కుట్టిస్తాను. ఇంకేం కావాలి ఇంతకంటె? నిజమేననుకో ఇతరులైతే నీకు రోజుకు ఆరణాలిచ్చేమాట- కాని నాకేమి గరుజు పట్టింది? నేను నీమీద దయతలిచి నా డబ్బు వసూలు చేసుకోవడానికి నిన్ను పెట్టు కుంటున్నాను మరి "

శంకర్ కొంచెంసేపు దీర్ఘంగా ఆలోచించి అన్నాడు. "స్వామీ! ఇహ జీవితమంతా దాస్యమే"

బ్రా- "దాస్యమనుకో, కూలి అనుకో ఏమన్నా అను. నేను నా డబ్బు చెల్లంది నిన్ను వదిలి పెట్టను. నువ్వు పారిపోతే నీ కొడుకు చెల్లిస్తాడు. ఎవడూ లేకుండా పోతే ఆ విషయం వేరనుకో."

ఈ నిర్ణయానికి ఇహ అప్పీలు లేదు. కూలివాడికి జామీను ఎవడుంటాడు? ఎక్కడ దిక్కులేదు. పరుగెత్తి ఎక్కడకు పోతాడు మరుసటిరోజు నుంచి అతడు బ్రాహ్మడి దగ్గిర పనిచేయడం మొదలు పెట్టాడు. సవాశేరు గోధుమలకు బదులుగా ఆయుర్దాయం అంతా దాస్య శృంఖలాల్ని కాళ్ళకు తగిలించుకోవడమయింది. ఆ అభాగ్యుడికి ఊరట కలిగించే మంత్రం ఒక్కటే- "ఇది నా పూర్వ జన్మంలో

చేసిన కర్మానుభవం! ఇదివరకు ఎప్పుడూ చేసి ఎరగని అడ్డమైన పనులన్నీ ఆడది చెయ్యవలసి వస్తోంది. పిల్లలు తిండిగింజలకోసం అల్లాడుతున్నారు. శంకర్ మెదల కుండా దుఃఖాన్ని మింగి చూస్తూవుండడం తప్ప చేయగలిగిందేమీ కనబడదు. ఆ గోధుమ గింజల భారం ఏదో దేవత ఇచ్చిన శాపంవలె అతని నెత్తినుంచి క్రిందికి జన్మంతా దిగనేలేదు.

## 5

శంకర్ విప్రుని వద్ద ఇరవై సంవత్సరాల దాస్యం చేసిన పిమ్మట ఈ నిరర్థకమైన ప్రపంచం నుంచి నిష్క్రమించాడు. నూట ఇరవై రూపాయలు ఇంత వరకు అతని నెత్తిమీద స్వారీ చేస్తూ వున్నాయి. పండిట్జీ ఆ నిరుపేదకు భగవత్సా న్నిధ్యంలో తొందర యివ్వడం ఉచితం కాదని ఊహించాడు. అంత కఠినుడు, అంత అన్యాయపరుడూ కాడు మరి! అతని పడుచు కుర్రవాణ్ణి పట్టుకొన్నాడు. నేటి దాకా ఆ కుర్రాడు పండిట్జీ దగ్గర ఊడిగం చేస్తున్నాడు. వాడు ఎప్పుడు ఉద్ధరింప బడుతాడో, అసలు ముక్తి అంటూ వాడికి ఉందో లేదో ఆ పెరుమాళ్ళకే ఎరుక.

ఓ చదువరీ, ఈ కథంతా కపోల కల్పితమని భావించకు సుమీ! ఇది నూటికి నూరుపాళ్ళు నిజమైన కథ. అటువంటి శంకర్లు, అటువంటి పండిట్జీలు లేకుండా ప్రపంచం రిత్తపోలేదు.

---

ప్రేమ్‌చంద్ కథలు – నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా (1975); సంకలనం: రాధాకృష్ణ; అనువాదం: అయాచితుల హనుమచ్ఛాస్త్రి

---

సృజన నవంబర్ సంచిక కుటుంబరావు సాహిత్య సమాలోచనసంచికగా ఎక్కువ పేజీలతో వెలువడుతుంది. ఆయన వివిధ రచనా ప్రక్రియలగురించి భావాల గురించి ఆయన వ్యక్తిత్వం గురించి ఆయనతోగల పరిచయం గురించి రచనలు పంపదలచినవారు సెప్టెంబర్ 27వ తేదీలోగా మాకందేటట్లు పంపించ వలసిందిగా కోరుతున్నాం.

## విప్లవ రచయితల సంఘం దశాబ్ది ఉత్సవాలు (1970 - 80)

# విరాళాలకై విజ్ఞప్తి

పగడాల పంట దీసి వస్తులు ఉంటూ, దోసిళ్ళకొద్దీ రక్తం చిందించి పిడికెడు బువ్వకు కూడా నోచుకోక, శతాబ్దాల తరబడి దోపిడీ, చిత్రహింసలకు గురవుతున్న అధోజగత్ సహోదరుల విముక్తికోసం పోరాటాలు చెలరేగుతున్న విప్లవాల యుగం మనది

నగ్జల్‌బరీ, శ్రీకాకుళ పోరాటాల ప్రేరణతో 1970 జులై 4వ తేదీన హైదరాబాద్‌లో విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించింది. ప్రజల విప్లవ పోరాటాలలో ప్రభవించిన సాంస్కృతిక అరుణతార విరసానికి, కలాన్నీ కత్తినీ పట్టిన పాణిగ్రాహి స్ఫూర్తి అయ్యాడు.

రచనలు అచ్చు అక్షరాలుగా కాగితాల వరకే పరిమితంకాక, ప్రజలపట్ల కమిట్‌మెంట్‌తో శక్తివంతమైన ఆయుధాలై దూసుకొస్తున్న తరుణంలో విరసం ప్రభుత్వ విషపు కన్నెర్రకు గురయింది. రచయితలపై అక్రమ కుట్రకేసులు, సర్వీసుల నుండి తొలగింపు, రచనలపై నిషేధాలు, బెదిరింపులు, ఆఖరికి ప్రాణాలు కోల్పోయిందాకా ఈ నిర్బంధం కొనసాగింది.

ఈ ఆటుపోట్లన్నీ తట్టుకొంటూ, ప్రజల విప్లవపోరాట ఫలితాలను పంచుతున్న సాహిత్య ఝంఝగా విరసం నిలిచింది. సంస్థను ఉద్యమస్థాయిలో, నిర్వహించడం జరుగుతోంది ఈ నిర్వహణలో లక్షలాది పీడితవర్గ ప్రజలు ఎన్నో ఆంక్షలకు గురౌతూ కూడా తమ సహకారాన్ని అందిస్తూ. సంస్థకు మద్దతునిస్తున్నారు. ఈ సంఘీభావమే కొండంత బలంగా, విప్లవోద్యమాల వెలుగులో విరసం తన కార్యకలాపాలు నిర్వహిస్తోంది.

విరసం ఏర్పడి దశాబ్ది అయిన సందర్భంలో 1980 అక్టోబర్ 17, 18, 19 తేదీల్లో హైదరాబాద్‌లో మహాసభలు జరుగుతాయి. తమ శక్తికొద్దీ విరాళాలు ఇచ్చి కార్యక్రమాల్లో పాల్గొని మహాసభలను జయప్రదం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

విప్లవాభినందనలతో

ఆహ్వాన సంఘం

విరాళాలు పంపవలసిన చిరునామా :

చెరబండరాజు ఇ. నెం. 2-2-899,

అంబర్‌పేట, హైదరాబాద్-13.

SRJANA Telugu Monthly Aug./Sep. '80 H/WL-10
Regd. No. with Registrar of News Papers 10953/67



---

## విజ్ఞప్తి

చెరబండరాజుకుగానీ, కె.వి. రమణారెడ్డికిగానీ ఏ విరసం బాధ్యునికిగానీ డబ్బు ఏ రూపంలో పంపే వారైనా తామది చెరబండరాజు సహాయనిధికి పంపుతున్నారో విరసంకు విరాళంగా పంపుతున్నారో స్పష్టంగా పేర్కొవాలని కోరుతున్నాం.

— విరసం.

---